# విషయసూచిక





# ఉపోద్ఘాతము



అర్థశాస్త్రం మానవుల జీవిత విధానాన్ని వివరిస్తుంది. వివిధ సామాజిక దశలలో మానవుల భౌతికావసరాలైన ఆహారం, బట్టలు, గృహవసతి, రవాణా తదితర జీవిత సౌకర్యాల ఉత్పత్తి, వినిమయ విధానాలనుగూర్చి, సరకుల ఉత్పత్తి క్రమంలోను, మారకపు క్రమంలోను మానవులమధ్య ఏర్పడే సంబంధాలనుగూర్చి చర్చిస్తుంది.

ఆదినుండి మానవులు వ్యక్తిగతంగా గాక, సమూహంగానే జీవిస్తూవచ్చారు. ఆదిమ కమ్యూనిస్టుదశలో మానవులు ముఠాలుగా ఏర్పడి వేటాడి జీవించేవారు. అలాగే స్త్రీలు, పురుషుల మధ్య స్థూలమైన పని విభజన ఉంటూండేది. ఈనాడు ప్రపంచంలో అనేకభాగాలలో ఉండే అనేకమంది వ్యక్తుల పరస్పర సహకారం ద్వారా జీవితావసరాలను ఉత్పత్తి చేస్తూండడం చూస్తున్నాము. ఈజిప్ట్, ఇండియాలలో పత్తి పండించే రైతులు, పత్తిబేళ్ళు రవాణాచేసే కార్మికులు, ఓడ ఖలాసీలు, గ్లాస్గో ఫ్యాక్టరీ కార్మికులు, తిరిగి బట్ట రవాణా చేసేవారు, బట్టలుకుట్టే దర్జీ, వీరంతా కలిస్తేనే గ్లాస్గోబట్టతో మన చొక్కాలు తయారవుతున్నాయి. అలాగే, వివిధ వస్తువులూను.

ఆదిమవాసులు కొన్నివేల సంవత్సరాలవరకు వర్గ రహితమైన తెగలలోనే (Communities) నివసించేవారు. ఇలాంటి ఆదిమ కమ్యూనిస్టు సమాజదశ అనంతరం వచ్చిన

సమాజాల్లో పరస్పర విరుద్ధమైన వర్గాలు, దోపిడీ చేసేవారు, చేయబడేవారు అనేవర్గాలు ఏర్పడ్డాయి.

ఉత్పత్తి ఎల్లప్పుడూ సామాజికంగానే జరుగుతుందనే సత్యాన్ని పెట్టుబడిదారీ అర్థశాస్త్రజ్ఞులు గుర్తించరు. రాబిన్ సన్ క్రూసోలవలనే వ్యక్తిగతంగా జీవించవచ్చునని అభూత కల్పనద్వారా రుజువుచేయ చూస్తారు.

పెట్టుబడిదారీ అర్థశాస్త్రజ్ఞులు సమాజం నిరంతరం మార్పు చెందుతూంటుందని, అభివృద్ధి చెందుతూంటుందని గుర్తించరు. తాము సృష్టించిన సిద్ధాంతాలు శాశ్వత సత్యాలనీ, పెట్టుబడిదారీ వ్యవస్థఅనాది సిద్ధమనీ, శాశ్వతమనీ ప్రచారం చేస్తూంటారు. కాని, సామాజికోత్పత్తి విధానము, వినిమయ విధానముకూడా నిరంతరం మారుతూంటాయని చరిత్ర చాటుతుంది.

ఆదిమ మానవులు వేటాడుట, చేపలు పట్టుట, కంద మూలాదులు ప్రోగుచేయుటద్వారా జీవించిన దశవుంది. పిమ్మట కొయ్యనాగళ్ళు ఉపయోగించి వ్యవసాయం సాగించిన దశవుంది, తరువాత చేమగ్గాలు, రాట్నాలు ఉపయోగించి బట్టలు తయారుచేసిన రోజులున్నాయి. ఈనాడు పెద్ద పెద్ద యంత్రాగారాలలో, భారీ యంత్రాలద్వారా ఉత్పత్తి కొనసాగించబడుతూంది. రేపు పెద్ద ఎత్తున అణుశక్తి నుపయోగించుటద్వారా ఉత్పత్తి కొనసాగించ బడవచ్చు. ఈ విధంగా ఉత్పత్తివిధానం, ఉత్పత్తిశక్తులు నిరంతరం మార్పు చెందుతూనే వున్నాయి. అభివృద్ధి కౌతూనే వున్నాయి. ఈ మార్పులతో పాటు మానవుల మధ్యనుండే సంబంధాలు, వర్గ సంబంధాలు

మారుతూ వచ్చాయి. సామాజికాభివృద్ధి సూత్రాలు కూడా మార్పుచెందుతూ వచ్చాయి. ఆదిమవాసులు సమిష్టిగా ఆహారాన్ని సంపాదించుకొని, సమిష్టిగా అనుభవిస్తూండేవారు. తరువాత బానిసలు, బానిస యజమానులు అనేరెండు వర్గా లేర్పడ్డాయి. అటుపిమ్మట ఫ్యూడల్ భూస్వాముల వర్గమొకటి, వారి భూములను సాగుచేసిపెట్టే వ్యవసాయ బానిసవర్గ మొకటి ఏర్పడ్డాయి. ఈనాటి సమాజంలో పెట్టుబడిదారులు, కార్మికులు అనే రెండు ప్రధాన వర్గాలున్నాయి. రేపు సోషలిస్టు ప్రపంచంలో దోపిడీచేసే వర్గమే లేకుండా పోతుంది. రష్యాలో సోషలిజం ఆచరణలోకి వచ్చేసింది. తూర్పు యూరప్ రాజ్యాలు, నవచైనా సోషలిజం వైపుకు త్వరితగతిని పురోగమిస్తున్నాయి.

సమాజంలో వచ్చే మార్పులను, అభివృద్ధిని, సామాజికాభివృద్ధి సూత్రాలను మార్క్సిస్టు సిద్ధాంతం శ్రద్ధగా పరిశీలిస్తుంది. ఈనాడున్న పరిస్థితులతోనే సంతృప్తిపడదు. పరిస్థితులలో వచ్చే మార్పులను, ఆ మార్పులకుగల మూల కారణాలను పరిశోధిస్తుంది. ఆయా పరిస్థితులలో శిథిలమై నశించి పోతున్న దేదో, అభివృద్ధి ఔతున్న శక్తులేవో, సమాజ పురోగమనానికి తోడ్పడే ఆర్థికాభివృద్ధి సూత్రాలేవో తెలుసుకుంటుంది. ఫ్రెంచి విప్లవము, బ్రిటిష్ పారిశ్రామిక విప్లవం ద్వారా ఫ్యూడలిజం నాశనమై, ఎలా పెట్టుబడిదారీ సమాజం ప్రారంభమయిందీ, అలాగే 1917 నవంబరు విప్లవంలో రష్యాలో పెట్టుబడిదారీ విధానం నాశనమై, సోషలిజం యెలా అమలులోనికి వచ్చిందీ, మొదలైన సామాజిక మార్పులను, అభివృద్ధి సూత్రాలను పరిశోధించి వివరిస్తుంది.

పై సూత్రాల నాధారం చేసుకుని ఆర్థిక విధానాలను వివరించుటకు అర్థశాస్త్రం కృషిచేస్తుంది. జీవితావసరాల సముపార్జనలో, అంటే ఉత్పత్తివిధానంలో వచ్చిన మార్పుల ఫలితంగా మానవుల మధ్య, వర్గాల మధ్యనుండే సంబంధాలను వివరిస్తూంది. లెనిన్ చెప్పినట్లు అర్థశాస్త్రం "సామాజికో త్పత్తికి సంబంధించిన చారిత్రక విధానాల అభివృద్ధిని గురించి వివరించే శాస్త్రం."

మార్క్సిస్టులు ప్రపంచాన్ని శాస్త్రీయమైన గతి తార్కిక, భౌతికవాద దృక్పథంతో అధ్యయనంచేస్తారు. భౌతిక పునాదులమార్పే, సామాజిక మార్పులకు మూలమని మార్క్సిజం చెబుతుంది.

ప్రకృతిని యథాతథంగా చూడడమే భౌతిక దృక్పథ మని ఏంజెల్సు చెప్పారు. మన ఎదుటనున్న వస్తువును వున్న దాని నున్నట్లుగా పరిశీలించవలసి యుంటుంది. ఎదుటనున్న వస్తువును వున్నదున్నట్లు పరిశీలించడం మానివేసి, భావం ప్రధానమని, ఆలోచనద్వారానే సత్యాన్ని కనుక్కోగలమని చెప్పే భావవాదాన్ని మార్క్సిజం నిరాకరిస్తుంది. ప్రయోగం ద్వారా, ఆచరణద్వారా ఏది సత్యమో, ఏదికాదో పరీ క్షిస్తుంది.

మార్క్సిస్టు అర్థశాస్త్రం పెట్టుబడిదారీ విధానాన్ని (ఏ వ్యవస్థనైనా సరే) యిదే దృక్పథంతో పరిశీలిస్తుంది. దానిని యథాతథంగా పరిశీలిస్తుంది. అది అనాదిసిద్ధమనీ, శాశ్వతమనీ దాని ఆర్థికసూత్రాలు అనుల్లంఘనీయాలనీ, ప్రకృతిసిద్ధమైనవనీ పెట్టుబడిదారీ అర్థశాస్త్రజ్ఞులు చెప్పేదానిని నిరాకరిస్తుంది. పెట్టుబడిదారీవిధానం ఆచరణలో ఎలా పని

చేస్తూంది. దానిలోని వైరుధ్యాలేమిటి, వాటి ఫలితంగా దానిలో ఎప్పటికప్పుడు వచ్చే మార్పులు, అభివృద్ధి ఏమిటి అనేవాటిని వివరిస్తుంది. కాబట్టే మార్క్సిస్టు ఆర్థిక సిద్ధాంతాలు ఊహాజనితాలు కాక, యథార్థంగా వుంటాయి.

ప్రపంచంలో ఏ వస్తువుకూడా స్థిరంగా ఉండదని, నిరంతరం చలనంలో ఉంటుందని, మార్పుచెందుతూంటుందని, పుట్టి పెంపొందుతూండడమో, క్షీణించి నాశనమవుతూండటమో జరుగుతూంటుందని. మార్పు సంభవించడం క్రమంగానూ, అగోచరంగానూ మాత్రమేగాక, ఒక దశనుండి మరొక దశలోనికి మారేటపుడు యీ మార్పు వేగంగాను, అకస్మాత్తుగానుకూడ జరుగుతుందని, యిలా మార్పులు జరుగుటకు కారణం ఆంతరింగికమైన విరుద్ధశక్తుల మధ్య సంఘర్షణ అని మార్క్సిజం చెబుతుంది. దీనినే గతితార్కిక పద్ధతి అంటారు.

ఈ శాస్త్రీయమైన గతితార్కిక పద్ధతిని మార్క్సిస్టు అర్థశాస్త్రం సమాజ జీవిత విధానాలకు అన్వయింప జేస్తుంది. ఆదిమ కమ్యూనిస్టు సమాజం, బానిస సమాజం, ఫ్యూడల్ సమాజం, పెట్టుబడిదారీ సమాజం క్రమంగా ఒకదాని తర్వాత ఒకటి ఎలావచ్చాయో, అలాగే పెట్టుబడిదారీ సమాజంకూడా పోయి సోషలిస్టు సమాజం ఎలా రాగలదో అర్థశాస్త్రం నిరూపిస్తుంది. ప్రకృతిలో ఎలా అయితే విరుద్ధశక్తుల సంఘర్షణ ఫలితంగా మార్పువస్తుందో, అలాగే సమాజ విధానాలలో కూడా విరుద్ధశక్తుల ఘర్షణవల్లనే మార్పువస్తుంది. ఉత్పత్తి శక్తులకు, ఉత్పత్తి సంబంధాలకు గల వైరుధ్యమే సమాజంలోని ఆంతరంగిక వైరుధ్యం. ఈ వైరుధ్యం ఆదిమ కమ్యూ

నిష్ట సమాజంనుండి నేటివరకు వివిధ సామాజిక దశలలోను, వివిధ రూపాలలోను వ్యక్తమవుతూ వస్తున్నది.

కార్మికవర్గం పెట్టుబడిదారీ విధానానికి వ్యతిరేకంగా, ఆ విధానానికి స్వస్తిచెప్పి అధికారాన్ని స్వీకరించేందుకు సాగించే పోరాటంలో మార్క్సిస్టు అర్థశాస్త్రం సహకారిగా వుంటుంది; నాయకత్వం వహిస్తుంది. సామాజిక మార్పులకు వర్గపోరాట మొక ఆయుధమని చెప్పటతోనే సంతృప్తిపడదు. సమాజాన్ని మార్చుటకు, కార్మికవర్గం సాగించే ప్రతిచర్యకు సిద్ధాంత సహాయాన్ని సమకూర్చి పెడుతుంది. కార్మికవర్గానికి నాయకత్వం వహించే రాజకీయ నాయకులకు శాస్త్రీయ విజ్ఞానంతో కూడిన విశ్వాసాన్ని చేకూర్చి పెడుతుంది. మార్క్సు తన 'కాపిటల్' గ్రంథాన్ని అచ్చువేస్తూ, "ఇది ('కాపిటల్' గ్రంథం) నిస్సందేహంగా బూర్జువావర్గం గుండెలకు గురిపెట్టబడిన ఫిరంగి గుండ్లన్నింటిలోకి భయంకరమైన గుండు" అని చెప్పారు.

మార్క్సిస్టు సిద్ధాంతం, మానవజాతిని పెట్టుబడిదారీ విధానంనుండి విముక్తిచేసి, అధికారాన్ని స్వీకరించి, వర్గ రహిత సోషలిస్టు సమాజానికి పునాదులువేసేందుకు కార్మిక వర్గం సాగించే పోరాటంలో అమూల్యమైన, అనివార్యమైన ఆయుధం. "విప్లవసిద్ధాంతంలేనిదే విప్లవోద్యమం వుండ"దని లెనిన్ చెప్పారు. మార్క్సిస్టు సిద్ధాంతం లోపించిననాడు రాజకీయ నాయకులు కార్మికోద్యమాన్ని పక్కదారులు పట్టించడం చూస్తున్నాము. కాని, మార్క్సిస్టు సిద్ధాంతాన్ని సక్రమంగా అనుసరించినట్లయితే కార్మికవర్గం అజేయమవుతుంది.

ర చ యి త.

1 వ అధ్యాయము

# సామాజికాభివృద్ధి దశలు



## ఆదిమ కమ్యూనిస్టు సమాజం

మానవ జీవితం ప్రారంభమై 50 వేల సంవత్సరాలపైనే అవుతుంది. దీనిలో 7/8 వ వంతు కాలం మానవులు అనాగరిక తెగలుగా గుహాలలో నివసిస్తుండేవారు. మృగాలను వేటాడుట ద్వారా, కందమూలాదుల సేకరణద్వారా జీవించేవారు. కర్రలు, రాళ్ళతో తయారుచేసిన బల్లాలే వారి పరికరాలు. నిప్పుతో ఆహారం వండుకునేవారు. తోళ్ళతో దుస్తులు తయారు చేసుకునేవారు. కొంతకాలానికి కొత్త పరికరాలను కనిపెట్టారు. వేటాడుటకు విల్లంబులు, చేపలు పట్టుటకు వలలు, చిన్న చిన్న కొయ్యపడవలు కనిపెట్టారు. గుహాలస్థానే చెట్టు కొమ్మలపైన నివాస స్థలాలు ఏర్పర్చుకున్నారు.

ఈ అనాగరిక తెగలు ముఠాలుగా వేటాడి సంపాదించిన దానిని సమిష్టిగా పంచుకుతినేవారు. ఆ రోజులలో శ్రమ విభజన అనేది స్త్రీ పురుషుల మధ్యమాత్రమే వుండేది. పురుషులు ఆయుధాలు తయారుచేసుకుని వేటాడుతుంటే, స్త్రీలు యింటిపనులు వంట, దుస్తులు తయారుచేయడం వగైరా చేసే వారు. ఆదిమ కమ్యూనిస్టు సమాజంయొక్క మొదటి దశలో మానవుని జీవితవిధాన మిలా వుండేది. ఆ రోజులలో ఎంతో కష్ట

పడితేనేకాని జీవితం గడిచేదికాదు. ఇలాంటి భౌతిక పరిస్థితు లలో మానవుని మానవుడు దోపిడీ చేయడమనేదే వుండేది కాదు.

అనేక వేల సంవత్సరాలవరకు మానవుడు యీ అనాగ రిక దశలోనే వున్నాడు. కాని క్రమేణా కొన్ని తెగలవారు తమ జీవితాన్ని నిర్వహించేందుకు నూతన పద్ధతుల నభివృద్ధి చేశారు. ఈ పద్ధతులవల్ల మానవుల జీవితవిధానంలో గొప్ప మార్పులు సంభవించాయి. మానవుల మధ్య సంబం ధాలే మారిపోయాయి. ప్రతిరోజూ కష్టపడి వేటాడి, ఆ వేట ఫలితంపైన జీవితం నిర్వహించేబదులు జంతువులను మచ్చిక చేసి పెంచడం నేర్చుకున్నారు. పశుపాలనం ప్రారంభించారు. అలాగే తమకు, తమ పశువులకు అవసరమైన ఆహారాన్ని సృష్టించడంకూడా నేర్చుకున్నారు.

వ్యవసాయం, పశుపాలనం ప్రారంభమగుటతో తెగల మధ్య వేటాడే తెగలు, వ్యవసాయంచేసే తెగలు అనే విభజన ప్రారంభమైంది. వ్యావసాయిక తెగలు మాటిమాటికి వేట కోసం స్థలాలు మార్చవలసిన అవసరం లేకపోయింది. సార వంతమైన భూమిని వెతుక్కుంటూ అది లభించినచోట స్థిర నివాస మేర్పరచుకోసాగారు. ఈ వ్యావసాయిక తెగలు తమ తక్షణావసరాలకన్న కొంచెం ఎక్కువగానే ఉత్పత్తి చేయు గలిగేవారు. అంతేకాదు. కూడబెట్టుకునేందుకు వీలైన సంపద పశువులరూపంలో వీరికి ఉన్నది. తమ అదనపు ఉత్పత్తిని యితర తెగలతో, వేటాడే తెగలతో మారకం చేసుకునేవారు. ఈవిధంగా వ్యావసాయిక తెగలమధ్య, వెనుకబడిన తెగలమధ్య

మారకం ప్రారంభమయింది. ఇదే సరకుల మారకానికి పునాదిగా పనిచేసింది.

వ్యవసాయం ప్రారంభించి స్థిరనివాస మేర్పరచుకున్న పిమ్మట తెగలు పెద్దవి కా నారంభించాయి. మానవుడు ఋతు పరిశీలన, తదనుగుణ్యాంగా పంటలు పండించడం నేర్చుకున్నాడు. నైలు, సింధు, యూఫ్రెటీస్ మైదానాలలో వరదనీటిద్వారా భూమిసారాన్ని పెంచడం నేర్చుకున్నాడు. నీటి పారుదల మార్గాలు కనిపెట్టాడు. తత్ఫలితంగా ఆహారపదార్థాలు ఎక్కువగా లభ్యమవుతూ వచ్చాయి. కాని యివన్నీ చేయాలంటే మానవ ప్రయత్నం నిర్మాణయుతంగా జరిగితే తప్ప సాధ్యం కాదు. కొత్త లోహాలు కనిపెట్టి, వాటిని శుభ్రం చేయడం, వాటిని సమ్మిళితంచేయడం నేర్చుకున్నారు. చేతిపనులు అభివృద్ధి అయాయి. కుమ్మరిసారెద్వారా కుండలు చేయడం, బండ్లు, నావలు, యిటుకలు వగైరా తయారుచేయడం, లోహపుకర్రు గల నాగళ్ళు తయారుచేయడం మానవుడు నేర్చుకున్నాడు. ఇవన్నీ కాస్తో కూస్తో ప్రత్యేకపనులు చేయడం, వాటిలో నిపుణత సాధించడం మొదలుపెట్టిననాడే సాధ్యమవుతాయి. ఈవిధంగా చేతిపనులమధ్య, వ్యవసాయంమధ్య శ్రమ విభజన ప్రారంభమయింది. ఈ శ్రమ విభజన ముఖ్యమైన ఫలితాలకు దారితీసింది. క్రమానుగతంగా మారకంకోసం ఉత్పత్తి – అంటే సరకుల ఉత్పత్తి – ఎక్కువవుతూ వచ్చింది.

ఎంగెల్స్ యిలా చెప్పారు: "పశుగణాలరూపంలోను, విలాస వస్తువుల రూపంలోను వ్యక్తిగత ఆస్తి ప్రారంభమగుటతో వ్యక్తులమధ్య మారకానికి, ఉత్పత్తి చేయబడ్డ వస్తువులు

సరుకులుగా పరిణామం చెందడానికి దారితీసింది. తర్వాత వచ్చిన విప్లవాని కంతటికి యిది పునాదిగా పనిచేసింది. ఎప్పుడయితే ఉత్పత్తిదారులు తాము ఉత్పత్తిచేసిన వస్తువులను స్వయంగా అనుభవించడం మానివేసి మారకం వేయడం ప్రారంభించారో అప్పుడే వారు దానిపైన పెత్తనాన్ని పోగొట్టుకో నారంభించారు......తాము ఉత్పత్తిచేసిన వస్తువు తమనే దోపిడి చేసేందుకు, అణచివేసేందుకు సాధనంగా తయారయ్యే అవకాశం ఏర్పడింది. (ఎంగెల్స్ : కుటుంబం – దాని పుట్టుపూర్వోత్తరాలు – V వ అధ్యాయం.)

పురాతన తెగలు తమలో తాము యుద్ధాలు చేసుకునే వారు. గెలిచిన తెగ ఓడిపోయినవారిని తినడమో లేక పురుషమేధంద్వారా చంపడమో జరిగేది. ఆనాడు మరొక విధంగా వారిని వినియోగించే అవకాశమే లేదు. తాము ఉత్పత్తిచేసింది తమ పోషణకే చాలీచాలకుండా వుండేది. అందువల్ల ఇతరులు దోపిడీచేయడానికి ఏమీ మిగిలేదికాదు. కనుక ఓడిపోయిన వారిచే బానిసలుగా పనిచేయించుకో వచ్చుననే ఆలోచనే వారికి స్ఫురించలేదు.

కాని యిపుడు పరిస్థితులు మారాయి. నూతన పరికరాలద్వారా, నూతనమైన చేతిపనులద్వారా, నూతన వ్యవసాయ పద్ధతులద్వారా మానవులు తమ అవసరాలకన్న ఎక్కువగానే ఉత్పత్తి చేయగలిగేవారు. అదనపు ఉత్పత్తి, సరకుల మారకం అభివృద్ధి అయ్యాయి. ఈ పరిస్థితులలో ఓడిపోయినవారు గెలిచినవారికి సంపదలు సృష్టించిపెట్టడానికి ఉపయోగపడే అవకాశం యేర్పడింది.

ఇంకేం! మానవులలో ఒక భాగం బానిస లయ్యారు. సరుకులుగా మారారు. వ్యవసాయదారు పశువులను పోషించు కున్నట్లే బానిసయజమానులు బానిసలకు బ్రతకడాని కింత తిండి పారేసేవారు. బానిసలు చేసిన ఉత్పత్తిపైన ఆధిపత్యం యజమానులది. బానిసలు తమకు పెట్టిన తిండికన్న చాలా ఎక్కువ ఉత్పత్తి చేసేవారు. దీనిద్వారా యజమానులు సంపదలు పోగుచేసేవారు.

సరుకుల మారకంతో ఆస్తిరూపాలు మారాయి. దీనితో బయటి తెగలవారే గాక, తెగల లోపలకూడా బానిసలు తయారయ్యారు. ఇన్నాళ్ళూ స్వతంత్రంగా వుంటూన్న మానవుల మధ్య వర్గవిభజనకు పునాదు లేర్పడ్డాయి. ఒకవైపున పాలక వర్గాలు, వారి ఉద్యోగస్థులు, రెండవవైపున వారికి కప్పం చెల్లించే వ్యవసాయదారులు, చేతిపనివారలు, ఋణదాతలు, ఋణస్థులు, ధనికులు, బీదలు ఏర్పడ్డారు. మొట్టమొదటిసారిగా వ్యాపారస్థులనే వర్గంకూడా బయలుదేరింది.

ప్రాథమికదశలో మానవులకు ఆస్తి అంటే పెద్ద విలువ లేదు. తాము తయారుచేసుకున్న ఆయుధాలు, పడవలు వగైరాలపైన స్వంత హక్కులుండేవి. కాని వేటాడేప్రాంతం సమిష్టి ఆస్తి. ఆహారం అందరూ సమిష్టిగా అనుభవించేవారు. వ్యవసాయం అభివృద్ధి అయాక భూమిపైన సమిష్టి యాజమాన్యం వున్నప్పటికీ ప్రయివేటు సాగుహక్కు ఏర్పడుతూ వచ్చింది.

ఆదిమ కమ్యూనిస్టు సమాజంలో రోజురోజుకూ అభివృద్ధి అవుతున్న ఉత్పత్తిశక్తులకు, పాత ఉత్పత్తి సంబంధాలకు

మధ్య నిరంతర ఘర్షణ ఉండేది. పశుపోషణ, పచ్చికగడ్డి పెంపకం, వ్యవసాయం - ఏర్పడినమీదట, పాత కాలపు సమిష్టి ఉత్పత్తి సంబంధాలు ధ్వంసమై, వాటిస్థానే పనివిభజన ఏర్పడ సాగింది. ఐతే యీ వైరుధ్యం, ఆదిమ కమ్యూనిస్టు సమాజంలో వర్గపోరాటరూపం వహించలేదు. అభివృద్ధి అవుతున్న ఉత్పత్తిశక్తులకూ, పాత ఉత్పత్తి సంబంధాలకూ మధ్య జరిగే ఘర్షణ, ఎప్పటికప్పుడు సర్దుబాట్లు, సమన్వయంద్వారా పరిష్కారమవుతూండడంవల్ల ఆదిమ కమ్యూనిస్టు సమాజం ముందుకు సాగిపోయింది.

సామాజికవ్యవస్థపై పెత్తనం సభ్యులందరిదీను. ప్రజాభిప్రాయం ప్రకారం అందరూ నడచుకునేవారు. వీరిపైన పెత్తనం చలాయించే అధికారం మరొకటి లేదు. కాని శ్రమ విభజన ఎక్కువై, సమాజం వర్గాలక్రింద విభజింపబడిన పిమ్మట, వర్గ వైరుధ్యాలు పెంపొందిన కారణంగా వీటిని అణచి ఉంచేందుకు ఒక రాజ్యాంగ యంత్రం (State) ఏర్పడింది. ఈ రాజ్యాంగయంత్రం మొట్టమొదట సమాజావసరాల నిమిత్తం ఏర్పడినప్పటికీ, రాను రాను సమాజంనుండి వేరై దానిపై పెత్తనం చెలాయించే స్వతంత్ర ప్రతిపత్తిని ఏర్పరుచుకుంది.

## నాగరికత - బానిస సమాజం

"సమాజంలో శ్రమ విభజన, తత్ఫలితంగా వ్యక్తుల మధ్య మారకం, వీటిని రెండింటినీ సమన్వయపరుస్తూ సరుకుల ఉత్పత్తి పూర్తిగా అభివృద్ధియై, అంతకు ముందుండే సమాజ విధానమంతటిలోనూ విప్లవకర మార్పులు ఎప్పుడైతే

వచ్చాయో, అప్పుడు నాగరిక దశ ప్రారంభమయింది" అని ఎంగెల్స్ చెప్పారు (కుటుంబం – దాని పుట్టుపూర్వోత్తరాలు) ఈ నాగరిక సమాజాలు మొట్టమొదట నైలు, యుఫ్రెటీస్ నదీతీరాలలోను, ఇండియా, చైనాలలోను ప్రారంభ మయాయి. తర్వాత గ్రీస్ నాగరికత, దానిని మింగివేసిన రోమన్ నాగరికత పశ్చిమఖండాలలో ఏర్పడ్డాయి. సమాజంలో వర్గాలు, నూతన ఆస్థిరూపాలు పెంపొందుటతో, అధికారంలో ఉండే వర్గాల ఆస్తి పాస్తులను, ప్రయోజనాలను రక్షించే నిమిత్తం సైన్యం, పోలీసు, కోర్టులు, ఉద్యోగస్థులు, పన్ను వసూలుదారులు వగైరా ప్రభుత్వయంత్రం అభివృద్ధి చెందింది. కొత్త మతాలు, కొత్త దేవుళ్ళు వెలిశారు.

ఈ బానిస సమాజంలో ప్రధాన వైరుధ్యం బానిసలు —బానిస యజమానుల మధ్య ఉంటుండేది. కాని బానిసలతోపాటు యితర వర్గాలుకూడా వుండేవి. ఉదా:- రోమన్ సామ్రాజ్యంలో పైవర్గాలకు (పాట్రిషియన్లు) క్రిందివర్గాలకు (ప్లెబియన్లు) కలహాలుండేవి. తర్వాతకాలంలో ఒకవైపున పెద్ద పెద్ద భూస్వాములు, వర్తకులు, పన్ను వసూలుదారులు వగైరాలకు, రెండవ వైపున బీదవ్యవసాయదారులకు, పట్టణ బీదలకు (వీరినే ప్రోలెటరీ అనేవారు) మధ్య వైరుధ్యా లుండేవి. కాని బానిసలే యీ సమాజకట్టడానికి అట్టడుగున అణగారిపోతూ పునాదివర్గంగా వుండేవారు.

## బానిస సమాజం బ్రద్దలగుట

బానిస సమాజంలో రాజులు, మహారాజులు, పెద్ద పెద్ద బానిస యజమానులు వగైరాలు ఉత్పత్తి నభివృద్ధిచేసి

సంపదలను పెంపొందించుటకు మారుగా, యుద్ధంచేసి రాజ్యాలు జయించి ఆ విధంగా బానిసలను, సంపదలను ప్రోగుచేయాలని చూచేవారు. వీరు సమాజంలో కొద్దిమందిమాత్రమే. మిగతా ప్రజలందరు – బానిసలు, వ్యవసాయదారులు చేతి వృత్తులవారు – వీరి యుద్ధాలలో సైనికులుగాను, వీరి విలాసాలకు సంపదను సృష్టించిపెట్టేవారుగానే ఉండిపోయారు. రాను రాను బీదరికానికి గురి అయ్యారు. దీనితో ప్రభువులపై తిరుగు బాట్లు ప్రారంభించారు. రోమన్ సామ్రాజ్య పతనానికి యివే కారణాలు.

పైన చెప్పిన విధంగా బానిస ఎస్టేట్లు కూలిపోయాయి. ఒక రకమైన వ్యవసాయ బానిస విధానం ప్రారంభమయింది. దీర్ఘకాలంమీద నూతన ఉత్పత్తి శక్తులు అభివృద్ధి అయాయి. ఇనుప నాగళ్ళను తయారుచేయడం, ఎక్కువ వుత్పత్తి శక్తి గల మగ్గాలు, వ్యవసాయ పద్ధతులు ప్రారంభమయ్యాయి. ఉత్పత్తి శక్తులలో వచ్చిన యీ అభివృద్ధితో నూతన సమాజ దశ–ఫ్యూడల్ దశ–ప్రారంభమయింది. ఈ దశలో వ్యవసాయం ప్రధానం. బానిస బదులు వ్యవసాయబానిసవర్గం తయారయింది.

బానిసవలె కాక వ్యవసాయ బానిసను లేక అర్థ బానిసను (serf) చంపడానికి యజమానికి హక్కులేదు. కాని వ్యవసాయ బానిస తన యజమానిని వదలిపెట్టి స్వేచ్ఛగా వెళ్ళుటకూ వీలు లేదు. తనకు తన ప్రభువు యిచ్చిన 2, 3 ఎకరాల భూమిలో (భూమిపై హక్కు ప్రభువుదే) స్వంతసాగు చేసుకుని, తన కుటుంబాన్ని తాను పోషించుకోవాలి. వ్యవ

సాయ పనిముట్లు తన స్వంతమే కాని, మిగతా కాలమంతా తన ప్రభువుగారి ఎస్టేటులో పనిచేయాలి. ఎస్టేటు యజమాని మారితే ఎస్టేటుతోపాటు తనూ కొత్త యజమానిక్రింద పని చేయాలి. తన సొంత సాగుక్రింద నున్న భూమిలో పనిచేసి సంపాదించినదంతా తాను అనుభవిస్తాడు. కాని ఎస్టేటులో చేసిన శ్రమఫలితమంతా ప్రభువుకు పోతుంది. తనకోసం పని చేసుకుంటున్నంతవరకు పనిముట్లు తనవే అయినందువల్ల ఉత్పత్తి చేయాలనే ఉత్సుకత సహజంగా వుంటుంది. బానిస కిది వుండేది కాదు.

భ్యూడల్ విధానాన్ని గురించి వివరిస్తూ స్టాలిన్ "లెనినిజం" అనే గ్రంథంలో యిలా చెప్పారు : "(ఈ దశలో అభివృద్ధి ఐన) నూతన ఉత్పత్తిశక్తుల కనుగుణ్యంగా వ్యవసాయ బానిస ఉత్పత్తిలో కొంత చొరవ, పనియెడల శ్రద్ధ, సుముఖత

---

చూపించడ మవసరం. అందువల్ల పనియెడల శ్రద్ధలేకపోవడం, అసలు చొరవ అనేదే బానిసలో లోపించడంవలన, ఫ్యూడల్ ప్రభువు బానిసవిధానానికి స్వస్తిచెప్పి, కొంత స్వంతసాగు కలిగి, స్వంత ఉత్పత్తి పరికరాలు కలిగి, భూమిని సాగుచేసేం దుకు అవసరమైన శ్రద్ధకలిగి, పంటలో భాగాన్ని ఫ్యూడల్ ప్రభువుకు యివ్వగలిగిన వ్యవసాయ బానిసవిధానాన్ని స్వీక రించడం జరిగింది."

ఫ్యూడలిజంలో దోపిడీ పైనచెప్పినరూపంలో ఉంటుంది. ఎంత దోపిడీ జరుగుతుందో స్పష్టంగానే తెలుస్తుంది. వ్యవ సాయబానిస తనకోసం ఎంతశ్రమ చేశాడు, ప్రభువుకోసం ఎంతచేశాడు అనేది తేలికగా లెక్కగట్టవచ్చు.

ఫ్యూడల్ ఎస్టేట్లలో ఉత్పత్తి స్వయంపోషకంగా ఉంటుండేది. స్థానికావసరాలకు సరిపడిన ఆహారం, బట్టలు, యితర జీవితావసరాలు స్థానికంగానే ఉత్పత్తి అవుతూండేవి. ఉత్పత్తి ప్రధానంగా మారకానికి గాక, స్వంత వినియోగానికే చేయబడుతూండేది. అయినా, తమదగ్గర ప్రోగుపడిన అదనపు సంపదను తమ విలాసవస్తువుల నిమిత్తం ఫ్యూడల్ ప్రభువులు మారకంవేయడం జరుగుతుండేది. క్రమేణా దీనివలన వ్యాపారం, రవాణాలు అభివృద్ధి అయ్యాయి. ధన ప్రాబల్యం ప్రారంభమయింది. తమ విలాసాలకోసం ధనరూపంలో సంపదలు కూడబెట్టాలనే తహతహ ప్రభువులకు ఎక్కువయింది. వ్యవసాయ బానిసలదోపిడీ కూడా ఎక్కువయింది.

వ్యాపారాభివృద్ధితో కొత్త చేతిపనులు అభివృద్ధి అయాయి. లోహాలను కరిగించడంలో కొత్తపద్ధతులు అవలంబించబడ్డాయి. శ్రమవిభజన ఎక్కువయింది. ఈ విధంగా నూతన ఉత్పత్తిశక్తులు పెంపొందాయి. పట్టణాల ప్రాముఖ్యత బలం పెరిగింది. వ్యక్తిగత వ్యాపారస్థుల చేతులలో సంపద పెద్ద ఎత్తున ప్రోగుపడ నారంభించింది. దీనితో ఫ్యూడల్ సమాజ విధానం శిథిలం గానారంభించింది. ఒకవైపున ఫ్యూడల్ ప్రభువులకు రెండవవైపున వ్యవసాయ బానిసలు, చేతివృత్తులవారు వర్తకులు వగైరాలకు మధ్య వర్గ పోరాటాలు తీవ్రతరమై ఫ్యూడల్ ఆర్థిక విధాన విచ్ఛిత్తికి దారిదీశాయి. ఉత్పత్తి శక్తుల అభివృద్ధి కనుగుణ్యంగా నూతన సామాజిక విధానం అవసరమయింది. విప్లవపోరాటాల ద్వారా ఫ్యూడలిజంను నాశనంచేసి పెట్టుబడిదారీ విధానం అమలులోనికి వచ్చింది.

## ఉత్పత్తి సంబంధాలు - సామాజిక దశలు

పైన క్లుప్తంగా వివరించబడిన దానినిబట్టి ఒక విషయం స్పష్టంగా అర్థమవుతుంది. వివిధ సామాజికదశలలో విభిన్న ఉత్పత్తి పద్ధతులు, సామాజిక సంబంధాలు (అంటే మానవుల మధ్య, వర్గాలమధ్య సంబంధాలు) వున్నాయని చూచాము. సామాజిక పరిణామాన్ని గురించి మార్క్స్ యిలా చెప్పారు :

"ఉత్పత్తిదారులమధ్య పరస్పరం ఏర్పడే సామాజిక సంబంధాలూ, మొత్తం తాము గావించే ఉత్పత్తిలో తమ కృషి ఫలితాన్ని మారకం వేసుకునే పరిస్థితులూ (అంటే శ్రమ విభజన) సహజంగా ఉత్పత్తిసాధనాల స్వభావాన్నిబట్టి మారుతుంటాయి......భౌతిక ఉత్పత్తిసాధనాలు (Material means of production) అంటే ఉత్పత్తిశక్తులు మారినపుడు, అభివృద్ధి చెందినపుడు వ్యక్తిగత ఉత్పత్తిదారుల మధ్య ఉండే సామాజిక సంబంధాలు, అంటే ఉత్పత్తియొక్క సామాజిక సంబంధాలు (Social relations of production) మారతాయి, పరిణామం చెందుతాయి. ఉత్పత్తి సంబంధాల సముదాయమే (Totality) ఒక నిర్దిష్టమైన చారిత్రకాభివృద్ధి దశకు చెందిన ఒక ప్రత్యేక విభిన్న స్వభావంకల్గిన సామాజిక సంబంధాలు—అంటే సమాజం - అవుతుంది. పురాతన సమాజం (ఆదిమ కమ్యూనిస్టు, బానిససమాజాలు) ఫ్యూడల్ సమాజం, పెట్టుబడిదారీ సమాజం యిలాంటి ఉత్పత్తి సంబంధాలయొక్క మొత్తాలే. ఇవి ఒక్కొక్కటే మానవచరిత్ర అభివృద్ధిలోని ప్రత్యేకదశలను సూచిస్తాయి."

(మార్క్స్ : కూలి- పని, పెట్టుబడి అనేగ్రంథంనుండి)

ఇచట ఒక విషయం గమనించాలి. పాతసామాజిక దశలయొక్క చిహ్నాలు నూతన సామాజికదశలో కొంత సాగుతూ ఉండవచ్చు. అలాగే పాతసామాజిక దశలయొక్క రూపాలు నూతన సమాజంతోపాటు ప్రక్కప్రక్కనే కొంత సాగుతూ ఉండవచ్చు. ఈనాడు ప్రపంచంలో కొన్నికొన్ని ప్రాంతాలలో యింకా ఆదిమ కమ్యూనిస్టు రూపాలు, ఫ్యూడల్ రూపాలు ఉన్నాయి. ఇటు పెట్టుబడిదారీ సమాజం, అటు సోషలిస్టు సమాజం, సోషలిజంలోనికి పరిణామం చెందుతున్న సమాజాలుకూడా ఉన్నాయి.

సమాజ విధానాలు మారుటకు మూలకారణ మేమిటో మార్క్స్ మొట్టమొదటిసారిగా బయటపెట్టగలిగాడు. ఉత్పత్తి శక్తులు మారినపుడు, అభివృద్ధి ఐనపుడు వాటి కనుగుణ్యంగా, తప్పనిసరిగా ఉత్పత్తివిధానాలు అనగా సామాజిక విధానాలు మారతాయని నిరూపించాడు.

అయితే యీ సమాజ విధానాలు క్రమంగాను శాంతి యుతంగాను కాక అకస్మాత్తుగా, విప్లవయుతంగా ఎందుకు మారుతున్నాయి? సామాజిక విప్లవాలకు కారణమేమిటి? మార్క్స్ దీనికి శాస్త్రీయమైన వివరణ యిచ్చారు. ఒక సమాజంలో ముందు ఉత్పత్తి శక్తులు అభివృద్ధి చెందుతాయి. వాటి కనుగుణ్యంగా వెనువెంటనే పాతసామాజిక సంబంధాలు మారవు. నూతన ఉత్పత్తి శక్తుల అభివృద్ధికి పాత సామాజిక సంబంధాలు ఆటంకంగా తయారవుతాయి. అందువల్ల వాటి మధ్య ఘర్షణ ఏర్పడుతుంది. పాత సమాజంలో అధికారంలో ఉన్నవర్గం ఉత్పత్తిశక్తుల అభివృద్ధిని అరికట్టుటకు కృషిచేస్తుంది.

అభివృద్ధి అవుతున్న నూతన వర్గానికి, అధికారంలోనున్న వర్గానికి మధ్య సంఘర్షణ ఏర్పడుతుంది. వర్గపోరాటాలు పెంపొందుతాయి. చివరకు ఒక విప్లవ పోరాటం ద్వారానే నూతన ఉత్పత్తి సంబంధాలు నెలకొల్పబడగలవు. ఉత్పత్తి శక్తులయొక్క ఆటంకాలు తొలగింప బడగలవు.

"సమాజంలోని భౌతిక ఉత్పత్తిశక్తులు ఒకానొక దశ వరకు అభివృద్ధి చెందిన పిమ్మట ఆనాడున్న ఉత్పత్తి సంబంధాలతో – మరొక రూపంలో చెప్పాలంటే అంతకు ముందునుండి వుంటున్న ఆస్థి సంబంధాలతో – ఘర్షణపడతాయి. ఒకప్పుడు ఉత్పత్తిశక్తుల అభివృద్ధికి తోడ్పడిన యీ రూపాలు యిప్పుడు వాటికి సంకెళ్లుగా తయారవుతాయి. దానితో సామాజిక విప్లవానికి నాంది ఏర్పడుతుంది."

(మార్క్స్ "అర్థశాస్త్ర విమర్శ"కు వ్రాసిన ఉపోద్ఘాతం నుండి)



2 వ అధ్యాయము

# పెట్టుబడిదారీ ఉత్పత్తి విధానంయొక్క పరిణామం

మొదటి అధ్యాయంలో ఉత్పత్తిశక్తుల అభివృద్ధి ననుసరించి వివిధ సామాజిక దశలు ఎలా ఏర్పడ్డాయో చూచాము. పెట్టుబడిదారీ విధానం ఒక్కసారిగా ఆకాశంనుండి వూడిపడలేదని, అంతకుముందు కొన్ని సామాజిక దశలున్నాయని తెలుసుకున్నాము. ఇప్పుడు అంతకుముందుండే ఉత్పత్తి విధానాలనుండి పెట్టుబడిదారీ ఉత్పత్తి విధానం ఎలా ఉద్భవించిందో పరిశీలిద్దాం.

## సహజోత్పత్తి విధానం (Natural Economy)

పురాతన కాలంలో ఉత్పత్తిసాధనాలైన పనిముట్లు చాలా స్వల్పంగాను, అల్పంగానూ వుండేవి. ఎవరికి వారే సులభంగా కొద్దికాలంలో బల్లెమో, రాతి ఆయుధమో, విల్లంబో తమ యిండ్లలో తయారుచేసుకొని తామే ఉపయోగించేవారు.

క్రమేణా కొంత కాలానికి (ఆదిమ కమ్యూనిస్టుదశ ఆఖరి భాగంలో బానిస సమాజంముందు) పశుపాలనం ప్రారంభ మయ్యాక, పశుపాలనము వృత్తిగాగల తెగలు యితర తెగలనుండి వేరైపోయాయి. ఈ విధంగా సమాజంలో

మొట్టమొదటిసారిగా శ్రమవిభజన జరిగింది. ఆనాటినుండి వివిధ తెగలు వివిధ వస్తుసముదాయాలను కల్గియుండడంకూడా ప్రారంభమయింది. పశుపాలనం వృత్తిగాగల వారికి పశువులు, వాటిపాలు, ఉన్ని, మాంసము, తోళ్ళు వగైరా లుండేవి. ఇతర తెగలకివి వుండేవికావు. అందువల్ల ఒక తెగ మరొక తెగ తమతమ వస్తువులను మార్పిడి చేసుకునే పద్ధతి ఏర్పడింది. ఒక వస్తువుకు యింకో వస్తువును యిచ్చిపుచ్చుకునే యీ మారకపు విధానాన్ని వస్తుమార్పిడి (Barter) అంటారు. మొట్టమొదటిసారిగా యీ వస్తుమార్పిడి వ్యక్తుల మధ్యగాక తెగలమధ్యనే తెగపెద్దలద్వారా జరిగేది. తమ అవసరాలకు పోగా మిలిగినదానిని మారకంవేసి తమ కవసరమైన యితర జీవితావసర వస్తువులను సంపాదించడమే ఈ మారకంయొక్క లక్ష్యం. కాబట్టి యిచట ఉత్పత్తియొక్క లక్ష్యం స్వంత ఉపయోగమేగాని అమ్మకంగాదు. ఈ విధానాన్ని సహజోత్పత్తి విధానం అంటారు.

కాలక్రమేణా ఉత్పత్తి శక్తులు అభివృద్ధిఅవుతూ వచ్చాయి. చెట్లు చేమలు పెంచడం, ధాన్యాదులు పండించడం మొదలైన వ్యవసాయకృషి ప్రారంభమయింది. మనుష్యుడు పనిచేయుటలో నూతన మార్గాలన్వేషిస్తూ వచ్చాడు. క్రొత్త పనిముట్లను కనిపెట్టాడు. గృహపరిశ్రమలు వెలిశాయి. దీనితో శ్రమ విభజన అంతకంతకు పెరుగుతూ వచ్చింది. ఎంగెల్స్ "కుటుంబం – దాని పుట్టుపూర్వోత్తరాలు" అనే గ్రంథంలో చెప్పినట్లు "పశుపాలన, వ్యవసాయం, గృహపరిశ్రమలు మున్నగు వివిధరకాల ఉత్పత్తి మార్గాలు ఏర్పడిన పిమ్మట

మానవుడు తన శ్రమశక్తిని వినియోగించుటద్వారా తన జీవనాని కవసరమైన వస్తువులకన్న ఎక్కువ వస్తువులు ఉత్పత్తి చేయకల్గుచున్నాడు."

ఇందువల్ల మారకంలోకూడా మరింత అభివృద్ధికి పునాదులేర్పడ్డాయి.

మారకం అభివృద్ధియైన పిమ్మటకూడా చాలాకాలం సహజోత్పత్తి విధానం అమలులో ఉండేది. ఎంతోకాలానికి గాని అమ్మకానికి ఉత్పత్తిచేయడం రాలేదు. బానిసత్వం, ఫ్యూడలిజం కాలంలో ప్రధానంగా సహజోత్పత్తి విధానమే అమలులోవుండేది. దీనిని వివరిస్తూ ఎంగెల్స్ యిలా వ్రాశారు;

"పూర్వకాలంలో ఉత్పత్తి కమ్యూనిస్టు పద్ధతులపై జరిగేది. ఉత్పత్తిఅయిన వస్తువును ఉత్పత్తిదారులే అనుభవించేవారు. తర్వాతనే చాలకాలానికి తమకు సరిపోగా మిగిలిన వస్తువులను యితరులకిచ్చి, వారివద్ద మిగిలిపోయిన వస్తువులను తాము తీసుకునే మారకం పద్ధతివచ్చింది. మారకం పద్ధతి రావడమంటే వస్తువులు సరుకులుగా అనగా అమ్మకం కొరకే ఉత్పత్తిఅయే వస్తువులుగా – మారటానికి మొదటి మెట్టు అన్నమాట. మొదట్లో యీమారకం తెగలమధ్యనే జరిగేది. క్రమంగా తెగలలో అంతర్గతంగానే యీ మారకం వచ్చింది. ఇందువల్ల తెగలు పెద్ద చిన్న కులములక్రింద అనగా కొన్ని కుటుంబాలు ముఠాలుగా చీలిపోవడం జరిగింది. కాని యీవిధంగా కులాలక్రింద విభజింపబడినా, కులపెద్దలుకూడా, కులంలోని యితరుల సహాయంతోతమకు కావలసిన వస్తువులన్నిటినీ ఉత్పత్తి చేసుకునే కష్టజీవులుగా

వుండేవారు. అత్యల్పమగు వస్తువులను మాత్రమే అనగా తమకు మిగిలిన వస్తువులను మారకంగా యిచ్చి తెచ్చుకునే వారు. కుటుంబం చేసేపని వ్యవసాయం, పశువుల పెంపకమే గాదు. వీటివల్ల ఉత్పత్తిఅయ్యే వస్తువులనుకూడా తామే యితర ఉపయోగములకొరకు మార్చుటకై పనిచేసేవారు. తమధాన్యాన్ని తామే చిన్నచిన్న గాలి మరల, నీటిమరల సహాయంతో పిండిగా విసురుకునేవారు. రొట్టెలను కాల్చుకునేవారు. వడికేవారు, నేసేవారు. రంగులఅద్దకం చేసేవారు. తోలువూనేవారు. ఇళ్లు కట్టుకునేవారు. వాటిని మరమ్మతు చేసుకొనేవారు. తమకు కావలసిన పనిముట్లను చేసుకునేవారు. వడ్రంగం, కమ్మరం చేసేవారు. ఇంతెందుకు, సర్వసామాన్యంగా కుటుంబ అవసరాలకు కావలసిన వస్తువులన్నిటినీ స్వయంగా తయారుచేసుకునేవారు.

"జర్మనీలో 19వ శతాబ్దారంభంలో కూడా యిట్టి కుటుంబాలుండేవి. వారు మారకం ద్వారా తెచ్చుకునేవి చేతిపనులవారు తయారుచేసే కొద్ది వస్తువులను మాత్రమే. వీటినైనా వారు తయారుచేసుకోలేక కాదు. తాము చేసిన వాటికన్న తాము కొనేవి బాగుండడంవల్లగాని, చవుక అవడం వల్లగాని మాత్రమే."

"కాపిటల్‌ను గురించి" అన్న ఎంగెల్సు (గ్రంథం నుండి)

ఈ విధంగా బానిసత్వం ఫ్యూడలిజం కాలంలో ప్రధానంగా సహజోత్పత్తి విధానం వుండేది. పెట్టుబడిదారీ విధానం ప్రారంభదశలో కూడా యీ సహజోత్పత్తి మరో రూపంలో వుండేది.

## సరకుల సామాన్య ఉత్పత్తి విధానం

కాలక్రమేణా అంతకంతకు శ్రమవిభజన ఎక్కువౌతూ వచ్చిన కొలదీ, మారకం హెచ్చిన కొలదీ సరుకులు – అనగా అమ్మకానికై తయారుఅయిన వస్తువులు–ఉత్పత్తి చేయబడుతూ వచ్చాయి. మొట్టమొదటిసారిగా వ్యవసాయంనుండి చేతిపనులు వేరయ్యాయి. ఆనాటినుండి ఒకవైపున సహజోత్పత్తి రెండవ వైపున సరకుల సామాన్య ఉత్పత్తి కూడా ఒకదాని సరసన ఒకటి వుంటూ వచ్చాయి.

వ్యవసాయదారు తన పోషణకై తాను పండించుకొనేవాడు. ఈ విధంగా సహజోత్పత్తి వుండేది. కాని చేతిపనులవారు తయారుచేసే వస్తువులు తమ స్వోపయోగానికి గాక అమ్మకానికే వుద్దేశింపబడేవి. నాగళ్లు, కొడవళ్లు, పలుగులు పారలు వగైరా వ్యవసాయ పరికరాలుగాని, బిందెలు, చెంబులు వగైరా గృహపరికరాలుగాని మార్కెటులో అమ్మటకే తయారుచేసేవారు. ఈ రకంగా చేతిపనివారలు తమ స్వంత పనిముట్ల నుపయోగించి, ఒకరి క్రింద కూలికిగాకతమకు తామే శ్రమపడి అమ్మకానికై ఉత్పత్తి గావించే పద్ధతిని సరకుల సామాన్య ఉత్పత్తి (Simple commodity production) అని పిలుస్తారు.

దీనినిబట్టి పెట్టుబడిదారీ విధానానికి పూర్వం కూడ సరుకులు అంటే అమ్మకానికై తయారుచేయబడే వస్తువులు ఉత్పత్తి అయేవని తెలుస్తుంది. అయితే పెట్టుబడిదారీ విధానంలో సరకుల ఉత్పత్తికి యీ సరకుల సామాన్య ఉత్పత్తికి మధ్య తేడా ఏమిటో చూడవలసియుంది.

1. సరుకుల సామాన్య ఉత్పత్తి విధానంలో చేతి పనులవారు, వ్యవసాయదారులు మున్నగువారు తాము పని చేసే సాధనాలపై తామే పూర్తిహక్కు కలిగియుంటారు. వీటి సహాయంతో తమశ్రమను వినియోగించి సరుకులను తయారు చేసి అమ్ముతారు. కాని పెట్టుబడిదారీ విధానంలో యిలా గాదు. ఉత్పత్తి సాధనాలైన ఫ్యాక్టరీలు, యంత్రాగారాలు, గనులు మున్నగునవన్నీ పెట్టుబడిదారులవి. శ్రమచేసి సరుకుల నుత్పత్తిచేసేది కార్మికులు. వీరికి ఉత్పత్తి సాధనాలపైగాని ఉత్పత్తి అయిన సరుకుపైగాని ఎలాంటిహక్కు ఉండదు, కూలికి మాత్రమే పనిచేస్తారు.

2. సరుకుల సామాన్య ఉత్పత్తివిధానంలో వ్యవసాయ దారులు, చేతివృత్తులవారు ప్రధానంగా తమ జీవితావసర వస్తువులకోసంగాని, తమ సరుకును మార్కెట్‌లో మారకంచేసి తమ కవసరమైన సరుకులను సంపాదించేందుకుగాని ఉత్పత్తి చేస్తారు. అంటే ప్రధానంగా స్వీయోపయోగంకోసమే ఉత్పత్తి జరుగుతుంది. పెట్టుబడిదారీ సరకుల ఉత్పత్తి విధానంలో యిలా గాక, సరకులను అమ్మకానికే తయారుచేస్తారు.

ఈ రెండు ఉత్పత్తి విధానాలమధ్యగల తేడాలను గమనించుటతోపాటు మరోరెండు ముఖ్యవిషయాలనుగూడ యిదే సందర్భంలో గుర్తుంచుకోవాలి.

అ) చాలామంది పెట్టుబడిదారీ విధానానికి పూర్వం యిలాంటి స్వీయోపయోగ ఉత్పత్తివిధానం వుంటూవుండే దన్న విషయాన్ని గ్రహించ నిరాకరిస్తున్నారు. వీరు యీ

నాటికీ పెట్టుబడిదారీ విధానం బాగా అభివృద్ధిచెందిన దేశా లలోకూడా సరుకుల సామాన్య ఉత్పత్తి వుంటూనేవుందని, లక్షలాది చిన్నరైతులు, చేతిపనులవారు వున్నారని, వీరంతా పైకి సర్వస్వతంత్రులుగా కనిపిస్తున్నా నిజానికి అనేకరూపాలలో పెట్టుబడిదారీ విధానానికి బానిసలై క్రమంగా బలియైపోతున్నా రని వారు గుర్తించడంలేదు. తత్ఫలితంగా ఈ తరగతి ప్రజలు పెట్టుబడిదారీ విధానంపై కార్మికవర్గం సాగించే పోరాటంలో బాసటగా నిలువగలరనే విషయాన్ని గ్రహించలేక, రైతులు కార్మికులకు సహాయపడరని, శ్రామిక విప్లవంలో పాల్గొనరని సిద్ధాంతీకరిస్తున్నారు. ఇట్టి సిద్ధాంతాలే ట్రాట్స్కీ-జంకు దారి తీశాయి.

ఆ) అలాగే రెండవవైపున పెట్టుబడిదారీ ఉత్పత్తి విధా నానికీ, సామాన్య సరుకుల ఉత్పత్తి విధానానికీ మధ్య పెద్ద అఖాతం వుందని, దానికీ దీనికీ ఏమీ సంబంధంలేదని భావిం చడంగూడా పొరపాటే. ప్రతిరోజూ, ప్రతిగంటా, ప్రతి నిముషమూ సామాన్యసరుకుల ఉత్పత్తివిధానం పెట్టుబడిదారీ విధానంగా పరిణామం చెందుతూనేవుందని గుర్తించకపోతే, ప్రమాదానికి దారితీస్తుంది. గ్రామసీమలలో వ్యవసాయం స్వోపయోగ పద్ధతిలోనే జరుగుతూంది. అందుచేత యిది భారీయెత్తున జరిగే సమిష్టి వ్యవసాయంక్రిందకు మారదనే నిర్ణ యానికి దారితీస్తుంది. దీనిప్రకారం సోషలిస్టు పద్ధతిపై భారీ ఎత్తున వ్యవసాయాన్ని పునర్నిర్మించడం అసాధ్యమని తేలు తుంది. ఇది తప్పుసిద్ధాంతమని ఆచరణే రుజువుచేసింది.

## పెట్టుబడిదారీ ఉత్పత్తి పుట్టుక - దాని అభివృద్ధి

ఫ్యూడలిజంలోని ఉచ్ఛదశయైన వ్యవసాయ బానిసత్వం నుండే పెట్టుబడిదారీ విధానం ఉద్భవించింది. సరుకుల సామాన్య ఉత్పత్తి విధానంనుండే సరుకుల ఉత్పత్తి విధానం అభివృద్ధి అయింది.

వ్యవసాయ బానిసదశలో సరుకుల సామాన్య ఉత్పత్తి ఎక్కువైన కొలదీ, మారకం అభివృద్ధియైన కొలదీ, స్వదేశంలోనేగాక, విదేశాలతోకూడా వ్యాపారం ప్రారంభమయింది. పశ్చిమదేశాల వ్యాపారస్తులు తూర్పుదేశాలనుండి సుగంధ ద్రవ్యాలు, సిల్కులు, తివాచీలు వగైరా తెచ్చి ఫ్యూడల్ ప్రభువుల కమ్మేవారు. దీనితో ఫ్యూడల్ ప్రభువుల కోర్కెలు హెచ్చి ఫ్యూడల్ ఎస్టేట్ల స్వయంపోషకత్వ మంతరించింది.

రెండవవైపున మారకం వృద్ధియైనకొలదీ ద్రవ్య చెలామణీకూడ హెచ్చింది. డబ్బుయొక్క శక్తి, ప్రాధాన్యత ఎక్కువ కాజొచ్చాయి. దానితో వ్యాపారస్తులవర్గంకూడ బలపడింది. ఫ్యూడల్ ప్రభువులు తమ భోగాలు, విలాసవస్తువులకోసం తమ సంపదను డబ్బులోకి మార్చుకోవడం, యింకా ఎక్కువ డబ్బును సంపాదించే నిమిత్తం వ్యవసాయ బానిసలను అధికతర దోపిడీకి గురిచేయడం ప్రారంభమయింది.

15, 16 శతాబ్దాలలో అమెరికాను కనిపెట్టడం, భారత దేశానికి సముద్రమార్గం కనుగొనడంతో వ్యాపారం మరింత అభివృద్ధి కాజొచ్చింది. దీనితో ఫ్యూడల్ సమాజ గర్భంలో చాలా ప్రముఖమైన మార్పులు వచ్చాయి.

## ఫ్యూడలిజంయొక్క అంతర్గత విచ్ఛిత్తి

వర్తకులు ఫ్యూడల్ ప్రభువుల, బానిస యజమానుల భోగవిలాసాలకై అనేకరకాల విలాస వస్తువులను సప్లయిచేసి విశేషంగా లాభాలార్జించారు. డబ్బు కూడబెట్టారు. రెండవ వైపున ఫ్యూడల్ ప్రభువులు వ్యవసాయ బానిసల దోపిడీ నెక్కువ చేయుటయేగాక, డబ్బు రూపంలో శిస్తు వసూళ్లు ప్రారంభించారు. తమ విందులు, విలాసాలు, యుద్ధాలు, సైనికులు వగైరాలకు యీ డబ్బు చాలక, వ్యాపారస్తులయొద్ద వడ్డీకి ఋణాలు తీసుకోనారంభించారు. దీనితో వడ్డీ వ్యాపారస్తుడు రంగంలోకి వచ్చాడు. ఈ విధంగా వ్యాపార పెట్టుబడిదారీవర్గం శక్తివంతం గాజొచ్చింది.

చేతిపనులు బాగా అభివృద్ధి అయ్యాయి. ఫ్యూడల్ బస్తీలలో వృత్తినిపుణులు (Craftsmen), అభ్యాసకులను, (apprentices) వృత్తిపనివారలను (Journeymen) ప్రోగు చేసి ఉత్పత్తి సాగించేవారు. నెమ్మదిగా వర్తక వాణిజ్యాలు వృద్ధిపొంది వర్తకసంఘాల ప్రాబల్యం విస్తరించుటతో కార్ఖానాల పద్ధతి అమలులోనికి వచ్చింది (వివరం తర్వాత చదువగలరు).

ఈ పారిశ్రామిక వ్యాపారాభివృద్ధికి ఫ్యూడలిజం అడ్డు వచ్చింది. వర్తక వాణిజ్యాలపైనా, పరిశ్రమలపైనా, అనేక రకాలైన పన్నులు, రుసుములు, లైసెన్సు ఫీజులు విధించుట ద్వారా పెక్కు ఆటంకాలు కలిగాయి.

పైన వివరించిన పరిణామాలతో ఫ్యూడల్ సమాజం చాలావరకు బలహీనపడింది. కాని ఫ్యూడల్ సమాజ విచ్ఛిత్తికి మూలకారణం ఫ్యూడల్ వ్యవసాయోత్పత్తి అభివృద్ధి కాలేకపోవడమే. పాత ఉత్పత్తి పద్ధతులమూలంగా వ్యవసాయం అభివృద్ధికాలేదు. రెండవవైపున వ్యవసాయ బానిసల దోపిడీ, బీదరికం ఎక్కువ గావడంవలన భూమి క్రమంగా నిస్సారంగా తయారవడమేగాక, రైతాంగంయొక్క ఉత్సాహం, చొరవ, శ్రద్ధ నశించాయి. ఈ విధంగా ఫ్యూడల్ సమాజవిధానంలోని ఉత్పత్తి సంబంధాలు ఉత్పత్తిశక్తుల అభివృద్ధికి ఆటంకంగా తయారయ్యాయి.

ఫ్యూడల్ ప్రభువులు తమ భోగలాలసత్వానికి తగిన సంపత్తిని సంపాదించుకునేందుకు తమ ప్రజల దోపిడీతోనే సంతృప్తిపడక, తోటిప్రభువులతో యుద్ధాలకు దిగేవారు. అనేక మంది సామంతులు, పటాలాలు, మందిమార్బలం తయారయ్యారు. వీరందరిని పోషించేందుకు, యుద్ధఖర్చులకు ప్రజలను మరింత దోపిడీచేసేవారు. పై కారణాలవలన ఫ్యూడల్ వర్గం మరింత తీవ్ర సంక్షోభంలో పడింది. వర్గకలహాలు తీవ్రమయ్యాయి.

మొత్తంమీద క్లుప్తంలో ఫ్యూడల్ సమాజ విచ్ఛిత్తికి యీ క్రింది వైరుధ్యాలు కారణాలయ్యాయి: (i) వ్యవసాయ బానిసకు - ఫ్యూడల్ ప్రభువుకు మధ్య (ii) పట్టణాలలో వర్తకులు, వికాసం పొందుతున్న పెట్టుబడిదారులకు-ఫ్యూడల్ ప్రభువులకు మధ్య (iii) ఫ్యూడల్ ప్రభువులలో ప్రభువులకు మధ్య ఘర్షణలు.

రైతుల తిరుగుబాట్లనేకం జరిగాయి. 14 వ శతాబ్దంలో ఇంగ్లండులో వాట్ టైలర్ నాయకత్వాన రైతాంగం పెద్ద తిరుగుబాటు సాగించింది. అలాగే 15 వ శతాబ్దంలో మత సంస్కరణ కాలంలో రైతుల యుద్ధాలనేకం జరిగాయి. రెండవవైపున పట్టణాలలో అప్పుడే వికాసం పొందుతున్న బూర్జువావర్గం పోరాడ సాగింది. ఈ పోరాటాలు చివరకు నిరంకుశ రాజరికాన్ని, ఫ్యూడల్ ప్రభువర్గాన్ని కూలద్రోసి రాజ్యాంగ యంత్రాన్నే స్వాధీనంచేసుకునే విప్లవపోరాటాలుగా పరిణమించాయి. ఇంగ్లండులో 1648, 1688 లలో విప్లవాలు జరిగి రాజరికం ఓడిపోయింది. 1832 లో పూర్తి పెట్టుబడిదారీవ్యవస్థ నెలకొల్పబడింది. ఫ్రాన్సులో 1889 విప్లవంద్వారాను, జర్మనీలో 1848 విప్లవం ఓడిపోయినా 1864–71 లలోనూ బూర్జువా వ్యవస్థలు ఏర్పడ్డాయి.

పెట్టుబడిదారీ విధానం పూర్తిగా వికసించాలంటే కొద్దిమంది ధనికుల చేతులలో విపరీతంగా ధనం ప్రోగుపడి, ఉత్పత్తి సాధనాలపైన పెత్తనం వారిచేతులలోనికి పోవాలి. తమశ్రమ శక్తి నమ్ముకుంటేనేగాని బ్రతకజాలనట్టి కార్మికవర్గం తయారు గావాలి. ఇవి రెండూ ఎలా తయారయ్యాయో పరిశీలిద్దాం.

## ప్రాథమిక పెట్టుబడి ప్రోగుపడ్డ విధం

పైన, వ్యాపారస్థుల, వడ్డీ వ్యాపారస్థులవద్ద ధనం ఎలా ప్రోగుపడిందో చూచాం. దీనితోబాటు పెట్టుబడిదారీ శకం ప్రారంభదినాల్లో యూరప్ ఖండంలో అభివృద్ధిచెందిన పోర్చుగల్, స్పెయిన్, హాలెండ్, ఇంగ్లాండు దేశాలు విదేశాలతో

సముద్రం మీదుగా పెద్ద వ్యాపారాన్ని సాగిస్తూవుండేవి. ఈ దేశాలకు సంబంధించిన సాహసికులు కొందరు భారతదేశం, చైనా, అమెరికా మున్నగు సంపన్న దేశాలకు సముద్రమార్గా లను కనిపెట్టారు. ఈ దేశాలతో వ్యాపారం చేయడంద్వారా చాలా లాభాలు గడించారు. అంతేగాదు, అప్పటికే కనిపెట్ట బడిన తుపాకీమందు సహాయంతో ఆసియా, అమెరికా దేశాల ప్రజలను సులభంగా ఓడించి వాటిని స్వాధీనం చేసుకుని, ఆ దేశాల ప్రజలను విపరీతంగా దోపిడీచేయ నారంభించారు. మన దేశంలో బ్రిటిష్ వాళ్ళు వచ్చినదాది ఎన్ని దౌర్జన్యాలతో, క్రౌర్యాలతో, మోసాలతో, హత్యలతో ధనం బ్రిటన్‌కు తరలించుకుపోయారో మనకు అనుభవమే. యూరప్‌లో ఒక దేశానికీ, మరొక దేశానికీ మధ్య జరిగిన యుద్ధాలలో గెలిచిన దేశాలవారు, ఓడిపోయిన దేశాలను కొల్లగొట్టేవారు. సము ద్రాలపై ఒక దేశానికి సంబంధించిన ఓడలను, మరొకరు కొల్ల గొట్టడంద్వారాకూడ సంపదను ప్రోగుచేశారు.

ఈవిధంగా స్వదేశంలోని ప్రజా సామాన్యాన్ని దోపిడీ చేయడంద్వారానూ, దోపిడీధరల కమ్మడంద్వారానూ, విదే శాలను పశుబలంతో బందిపోటుదారులవలె ప్రత్యక్షంగాను, పరోక్షంగాను కొల్లగొట్టడంద్వారానూ, సముద్రాలపై ఓడ లను దోచుకోవడంద్వారానూ పెట్టుబడి ప్రోగయింది. ఇలా పెట్టుబడిదారీ విధానపు ప్రారంభదినాలలో విశేషంగా సంపదను కూడబెట్టడాన్నే పురాతన సంపత్సంచయము (Primitive accumulation of capital) అంటారు.

వాస్తవం యీలా వుండగా, పెట్టుబడిదారీ విధానాన్ని సమర్థించే పెద్దలు కొంతమంది పెట్టుబడియొక్క మూలాన్ని గురించి మరోవిధంగా సెలవిస్తారు. చాలా కాలం క్రిందట రెండురకాల మానవు లుండేవారట! అందులో మొదటిరకం వారు చక్కగా శ్రమపడేవారట. అతి జాగ్రత్తగా, పొదుపుగా ఖర్చు పెట్టుకునేవారట! తమ శ్రమద్వారా సంపాదించిన ధనంలో కొంత భాగాన్ని దాచుకుని కూడబెట్టారట! రెండవ రకంవారు వట్టి సోమరిపోతులట! వీరు వృథాగా డబ్బు తగలేసుకునేవారట! అందువల్ల వారికి శరీరాలుతప్ప సంపద మిగల లేదట! ఈ పాపఫలితంగా రెక్కలమ్ముకుంటేతప్ప జీవించలేని దుర్గతి పట్టిందట. సమాజంలో అధికభాగం ప్రజలు పేదరికాన్ని అనుభవిస్తూ బాధపడుతూండడానికి మూలం యిదేనట. మొదటిరకం పెద్దలకుమాత్రం ప్రాప్తపుణ్య ఫలితంగా సంపద నానాటికీ పెరుగుతూ, కష్టం చేయకపోయినా, కాలుమీద కాలువేసుకుని కూర్చున్నా జీవితం గడుస్తూందట. దీనినే భగవల్లీలయని, కర్మ ఫలితమని, నుదుటి వ్రాతయని చెబుతూంటారు. సృష్టిలోనే బీదవారు, ధనవంతులు ఏర్పడ్డారని సెలవిస్తుంటారు. ఈ తప్పుడుసిద్ధాంతాల ప్రధానోద్దేశం ఏమిటి? స్వంత ఆస్తివిధానాన్ని చెక్కుచెదరకుండా రక్షించడమే; పాలకవర్గ ఆధిపత్యాన్ని సుస్థిరం చేయడమే.

## వేతనపు కూలీలు తయారైన విధము

పెట్టుబడిదారీ ఉత్పత్తి పద్ధతి పూర్తిగా అమలులోకి రావాలంటే సంపదను ప్రోగుచేయడం ఒక్కటే చాలదు. అది

సన్నాహాలలో సగభాగంమాత్రమే. సన్నాహాలు పూర్తి కావాలంటే తగినంతమంది స్వతంత్రులగు వేతనపు కూలీలు తయారుగా వుండాలి. పెట్టుబడిదారీ విధానం వీరి నెలా తయారుచేసుకుందో చూద్దాం.

తాము స్వతంత్రంగా కష్టపడి బ్రతుకుటకు వీలున్నంత వరకు పెట్టుబడిదారుల క్రింద పనిచేయుట కెవ్వరూ అంగీకరించరు. కాబట్టి తమ పనిముట్లమీద, ఉత్పత్తి సాధనాలమీద యాజమాన్యపు హక్కు కలిగిన చిన్నచిన్న ఉత్పత్తిదారులు, వృత్తిదారులు ఉండడం పెట్టుబడిదారీ వస్తూత్పత్తివిధానానికి పనికిరాదు. వీరంతా పెట్టుబడిదారుల క్రింద ఊడిగంచేయాలంటే వారి ఉత్పత్తి సాధనాలను వారికి లేకుండా చేయాలి. తమ శ్రమశక్తి మినహా తమ దగ్గర బజారులో అమ్ముకోటానికి మరేదీ లేకుండాపోవాలి. కుటీర పరిశ్రమలను నాశనం చేయడం ద్వారా వృత్తులు పోగొట్టుకున్న వృత్తినిపుణులు, నిర్ధనులైన వృత్తిపనివారు కొంతమంది వేతనపు కూలీలుగా తయారయ్యారు. కాని వీరుమాత్రమే చాలరు. పెద్దపెద్ద పరిశ్రమలలో పనిచేయుటకు వేలాది కార్మికులు అవసరమౌతారు. అంతేగాక ఎల్లప్పుడూ కొంతమంది కార్మికులు పనిలేక నిలవ (రిజర్వు)లో వుండడం పెట్టుబడిదారుల కవసరం.

ఈవిధంగా వేలసంఖ్యలో కార్మికులు కావాలంటే పెట్టుబడిదారీ విధానానికి పూర్వమున్న వ్యవసాయ బానిస విధానం అడ్డు వస్తుంది. దానిక్రింద రైతులు దాదాపు బానిసలవలె భూమికి కట్టుబడి యుండేవారు. వ్యవసాయాన్ని గాని, తమ ప్రభువులను గాని వదలి స్వేచ్ఛగా వెళ్ళుటకు వీలుండేదిగాదు.

అందుచేత యీ విధానాన్ని పెట్టుబడిదారీ విధానం నాశనం చేయవలసి వచ్చింది. వ్యవసాయ బానిసత్వంనుండి విముక్తి చేయడంతో సరిపోదు; అతడు పనిచేసే భూమినుండికూడ విముక్తి చేయాలి. భూమిని కొనుక్కో-లేనివారు, తమకున్న జానెడు భూమితో కాలక్షేపంగానివారు, వడ్డీ వ్యాపారుల దోపిడీతో కృంగిపోతున్నవారూ, పెట్టుబడిదారీ ప్రభుత్వపు ప్రత్యక్ష, పరోక్ష పన్నులను మార్కెట్ దోపిడీని తట్టుకో లేనివారు, లక్షలాది రైతులు నిరంతరం పెట్టుబడిదారీ సమాజంలో నిరుపేదలై భూమిని వదలి, కార్మికవర్గంలో కలుస్తూనే వుంటారు. వీరంతా గ్రామాలనుండి తరలివెళ్ళి కార్మిక రిజర్వు సైన్యంలో చేరుతూనే వుంటారు.

ఈవిధంగా భూములను కోల్పోయి కార్మికులుగా తయారయే సహజ పరిణామంతోనే పెట్టుబడిదారులు తృప్తి పడరు. పెట్టుబడిదారీ వస్తూత్పత్తి విధానపు ప్రారంభదశలో పెట్టుబడిదారులు తమ ప్రభుత్వ యంత్రాన్ని వినియోగించి రైతాంగాన్ని బలప్రయోగంద్వారా భూములనుండి తరిమి వేయడం, మున్నగు అతి క్రూరపద్ధతులద్వారా కార్మికవర్గాన్ని సృష్టించారు.

ఉదాహరణకు 16-18 వ శతాబ్దలమధ్య ఇంగ్లండులో సాగుచేస్తున్న లక్షలాది రైతాంగాన్ని బలప్రయోగంతో భూములనుండి వెళ్ళగొట్టారు. పెట్టుబడిదారీవస్తూత్పత్తి విధానాన్నలవరచుకున్న భూస్వాములు లక్షలాది ఎకరాల సాగు భూములలో, ధాన్యం పండించడంకంటె వున్ని అమ్ముకోవడం లాభదాయకమని, పచ్చిక బయళ్ళుగా మార్చి గొర్రెల

పెంపకం ప్రారంభించారు. భూములు కోల్పోయిన రైతాంగం దేశదిమ్మరులై గత్యంతరం లేక చివరకు పెట్టుబడిదారులు కొత్తగా స్థాపించుతున్న ఫ్యాక్టరీలలో కుదిరారు.

పెట్టుబడిదారీ విధానంయొక్క అవతరణకు అవసరమగు సాధనసంపత్తి ఎలా సమకూర్చుకోబడిందో పైన చూచాము. సమాజంలోని కొలదిమంది చేతులలో విశేషంగా సంపద పోగుపడియుండడము, అధిక సంఖ్యాకులు ఉత్పత్తి సాధనాలపై పెత్తనాన్ని కోల్పోయి, వేరు జీవనోపాధి లేక తమ శ్రమశక్తినే అమ్ముకోవలసి రావడం ఎలాజరిగిందో చూచాము. ఈ రెండు పరిస్థితులు ఏర్పడినపుడే పెట్టుబడిదారీవిధానం ప్రభవించి అభివృద్ధిచెందగలుగుతుంది.

ఇలా పెట్టుబడిదారీ విధానాభివృద్ధి కవసరమైన పరిస్థితులు ఏర్పడ్డాక కార్ఖానాల దశనుండి యంత్రాలు – భారీ పరిశ్రమల దశకు అది ఎలాపరిణామం చెందిందో చూద్దాం.

వ్యాపారం బాగా అభివృద్ధి చెందుటతో చేతిపరిశ్రమలు మార్కెట్ అవసరాలను తీర్చలేకపోయాయి. అందువల్ల నూతన ఉత్పత్తి పద్ధతులు, పెద్దఎత్తున వస్తూత్పత్తి అవసరమయింది.

## పుటింగ్ ఔట్ విధానం (Putting out System)

పెద్ద ఎత్తున ఉత్పత్తి జరగాలంటె ఎక్కువ పెట్టుబడి అవసరం. ఇంత పెట్టుబడిని చేతి వృత్తులవారుగాని, చిన్న యజమానులుకాని పెట్టలేరు. కాబట్టి ధనం ప్రోగుచేసిన వర్తకులు ముందుకు వచ్చారు. ఈ వర్తక యజమానులు

పెట్టుబడి పెట్టి ముడిపదార్థాలు కొని వాటిని చేతివృత్తిదారులకు పంచిపెట్టేవారు. వారు చేసిన పనికి కూలి యిచ్చేవారు. ఉత్పత్తి అయిన సరుకును తాము తీసుకుని లాభాలకు అమ్ముకునేవారు. దీన్నే పుటింగ్ ఔట్ విధానం అనేవారు.

ఈ పద్ధతి ఇంగ్లాండులో 15 వ శతాబ్దంలోనే ప్రారంభమయింది. ముఖ్యంగా బట్టల ఉత్పత్తిలో యీ విధానం అవలంబించబడింది. ఈ విధానంలో కార్మికులకు సాధారణంగా ఉత్పత్తి పరికరాలపైన యాజమాన్యముండేది. కాని ముడి పదార్థాలపైన, ఉత్పత్తి అయిన సరుకుపైన పెత్తనం యజమానిది. అందువల్ల కార్మికులు తప్పనిసరిగా యజమానిపైన ఆధారపడవలసి వచ్చేది. పెట్టుబడిదారీ విధాన పరిణామంలో దీనిని పరివర్తన దశ యని చెప్పవచ్చు.

## కార్ఖానాల దశ - సహకార పద్ధతి
## (Co-operation and Manufacture)

క్రమంగా కొత్త కొత్త పరికరాలను కనిపెట్టడంతోనూ, అనేకమంది "స్వేచ్ఛ"గల కార్మికులు లభ్యమగుటతోనూ, వర్తక యజమానులు కార్ఖానాలు నెలకొల్పసాగారు. ఈ కార్ఖానాలలో అనేకమంది కార్మికులు పనిచేయ నారంభించారు. వీరు ఉత్పత్తి పరికరాలపైన, ఉత్పత్తి అయిన సరుకుపైన పెత్తనాన్ని కోల్పోయారు. వేతనపు కూలీలుగా తయారయ్యారు.

దీనితో అంతకుముందు ఫ్యూడల్ విధానంలో వ్యక్తిగత రైతులు, స్వతంత్రులైన చేతివృత్తి పనివారు సాగించే

ఉత్పత్తి విధానం స్థానే పెట్టుబడిదారీ ఉత్పత్తి పద్ధతి ఆచరణలోనికి వచ్చేసింది.

ఎప్పుడైతే అనేకమంది కార్మికులు ఒకరి సరసను మరొకరు పనిచేయడం ప్రారంభించారో ఉత్పత్తి పద్ధతులు అనేక విధాలుగా అభివృద్ధిచెందే అవకాశ మేర్పడింది.

కార్మికులమధ్య పరస్పర సహకారంవలన ఉత్పత్తి శక్తి పెరుగుతుంది. ఉత్పత్తి ఖర్చులు తగ్గుతాయి. సమిష్టి ఉత్పత్తివల్ల కార్మికులలో ఉత్సాహం పెరుగుతుంది. వ్యక్తిగతంగా చేయలేని పెద్దపెద్దపనులు అనేకమంది కలిసి చేయకలుగుతారు. ఈ ప్రయోజనా లన్నింటివలనా క్రమంగా పెట్టుబడిదారీ విధానం పెంపొందినకొలది సహకారం సర్వసాధారణ మవుతూవచ్చింది.

కార్ఖానాల దశలో అభివృద్ధి రెండు విధాలుగా సాగింది. ఒక వస్తువుయొక్క విడిభాగాలను తయారుచేయుటలో నిపుణత సంపాదించిన కార్మికుల నందరిని ఒక చోట చేర్చి ఉత్పత్తి చేయించుట. ఉదాహరణకు బండ్లుతయారు చేసే కార్ఖానాలలో చక్రాలు చేయుటలో నిపుణులు, పట్టాలు చేయుటలో నిపుణులు వగైరా ఒకచోట చేర్చబడేవారు. ఈ కార్మికులు మొత్తం బండినంతనూ తయారుచేయగల సాధారణ నిపుణతను కోల్పోతారు. కాని బండియొక్క భాగాలను తయారుచేయుటలో ప్రత్యేక నిపుణతను సాధిస్తారు. అలాగే రెండవ పద్ధతి: ఒక సరుకును తయారుచేయాలంటే ఒకరి తర్వాత ఒకరు కొంచెం కొంచెం పని పంచుకుచేస్తారు. ఉదాహరణకు, గుండుసూదులు తయారుచేయాలంటే ఒకడు తీగను లాగుతాడు,

మరొకడు దానిని కత్తిరిస్తాడు, యింకొకడు మొన తయారు చేస్తాడు, మరొకడు తల తయారు చేస్తాడు.

ఈ విధంగా కార్ఖానాల దశలో ఒకవైపున అనేకమంది కార్మికులు ఒకచోట చేరి పరస్పర సహకారంతో పనిచేయడం, మరొకవైపు వీరిమధ్య శ్రమవిభజన ఎక్కువగా జరగడం, ఒక్కొక్కరు ఒక్కొక్క చిన్న పనిలో ప్రత్యేక నిపుణతను సాధించడం జరిగింది.

ఇట్టి విస్తృత శ్రమవిభజనతో పాటు ఉత్పత్తి పరికరాలు కూడా చాల రకాలుగా అభివృద్ధిచెందాయి. రకరకాలైన కంటిగ్ టూల్స్ (Cutting tools) సుత్తులు, డ్రిల్‌లు, లేత్‌లు కని పెట్టబడ్డాయి.

ఈ కార్ఖానాల దశలో ఉత్పత్తి పద్ధతులు అనేక విధాల అభివృద్ధి చెందుటతోనూ, ఉత్పత్తి పరికరాలలో మార్పురావ డంతోనూ యంత్రయుగానికి నాంది ఏర్పడింది. క్రమంగా పారిశ్రామిక విప్లవానికి దారితీసింది. ఈ దశ 16 వ శతాబ్దం మధ్యకాలంలో ప్రారంభమై 18 వ శతాబ్దం ఆఖరి భాగంవరకు కొనసాగింది. 18 వ శతాబ్దం ఆఖరుకు యంత్రాల ద్వారా భారీయెత్తున పెట్టుబడిదారీ ఉత్పత్తికిఅనువైన పరిస్థితులేర్పడ్డాయి.

ఫ్యూడల్ సంకెళ్ళను పూర్తిగా నాశనం చేయనిదే, కార్ఖానాల దశనుండి పూర్తి పారిశ్రామిక పెట్టుబడిదారీ విధానం అభివృద్ధిచెందడం అసాధ్యం. ఫ్యూడల్ విధానంలో కొంత వరకుమాత్రమే పెట్టుబడిదారీ విధాన మభివృద్ధి కాగలుగు తుంది. ప్రభుత్వ యంత్రాన్ని స్వాధీనపరచుకొని, దాని నుప యోగిస్తేనే పూర్తిగా వికాసం పొందగలుగుతుంది.

ఇంగ్లండులో ఫ్యూడల్ విధానానికి, పెట్టుబడిదారీ విధానానికి మధ్య జరుగుతూవచ్చిన పోరాటం 1640 పారిశ్రామిక విప్లవంతో అంత్యదశకు చేరుకున్నది. విప్లవంలో పెట్టుబడిదారీవర్గం విజయం సాధించింది. దీనితో పెట్టుబడిదారీ విధానం నిరాఘాటంగా పురోగమించుటకు అవకాశమేర్పడింది.

## యంత్రాలు - భారీ ఉత్పత్తి

పెట్టుబడిదారీ విధానాభివృద్ధితో మార్కెట్ పెరిగింది. మార్కెట్ పెరుగుదలతో పెట్టుబడిదారులు సరుకుల ఉత్పత్తిని పెంచుటకు మార్గాలాలోచిస్తూవచ్చారు. దీనితో యంత్రాలను కనిపెట్టుట ప్రారంభమయింది. 18 వ శతాబ్దంలో ఇంగ్లాండులో పారిశ్రామికాభివృద్ధికి తోడ్పడే అనేక కొత్తకొత్త యంత్రాలను కనిపెట్టారు. 1733 లో ఫ్లైయింగ్ షటిల్, 1765 లో స్పిన్నింగ్ జెన్నీ, 1769 లో ఆవిరివల్ల నడిచే స్పిన్నింగ్ ఫ్రేమ్, 1779 లో పై రెండిటిని కలిపే స్పిన్నింగ్ మ్యూల్, 1782 లో ఆవిరియంత్రం, 1785 లో పవర్ లూమ్, 1825 లో ఆటోమాటిక్ లూమ్ వగైరాలు కనిపెట్టబడ్డాయి. వీటితో పారిశ్రామికరంగంలో విప్లవకరమైన మార్పులు వచ్చాయి. చేతిపరిశ్రమలు మూలపడ్డాయి. యంత్రాలద్వారా ఉత్పత్తి పెరిగింది. యంత్రాల నుత్పత్తిచేసే భారీపరిశ్రమలు వెలిశాయి. తత్ఫలితంగా యినుముకు, ఉక్కుకు డిమాండు పెరిగి, వాటిని కరిగించేందుకు కొత్తపద్ధతులు, కొత్తఫర్నేసులు కనిపెట్టబడ్డాయి. ఈ విధంగా యంత్రోత్పత్తియుగం ప్రారంభమయింది.

## 3 వ అధ్యాయము

# సరుకులు

పెట్టుబడిదారీ విధానంవల్ల సరుకుల ఉత్పత్తి ఎలా విశ్వ వ్యాప్తమవుతుందో పైన చూచాము. పెట్టుబడిదారీ విధానంలో వుండే వైరుధ్యాలను అవగాహనచేసుకోవాలంటే సరుకునుగూర్చి, దాని ప్రత్యేక లక్షణాలనుగూర్చి, దానికి సంబంధించిన సూత్రాలనుగురించి సమగ్రంగా తెలుసుకోవాలి.

### సరుకు అంటే ఏమిటి?

ఒక పెట్టుబడిదారుకు బట్టలమిల్లు వున్నదనుకోండి. అందులో ఉత్పత్తిఅయ్యే లక్షలకొలది గజాలబట్ట అతని స్వంత వుపయోగానికా? అలాగే మరొకనికి ఆముదపు మిల్లు, యింకొకనికి కృత్రిమదంతాల ఫ్యాక్టరీ ఉన్నాయనుకోండి. యజమాని తన మిల్లులో తయారైన ఆముదాన్ని తానే తాగుతాడా? కృత్రిమ దంతాలు తయారుచేయించే పెట్టుబడిదారు తన పళ్లూడపెరికించుకొని ఆ పళ్లు కట్టించుకొంటాడా? కాబట్టి పెట్టుబడిదారులు తమ స్వంత ఉపయోగానికి గాక, అమ్ముకుంటానికే సరుకులు ఉత్పత్తి చేస్తున్నారన్నమాట. స్వంత ఉపయోగానికై గాక, అమ్మకానికై మానవ శ్రమశక్తి వలన ఉత్పత్తి అయే వస్తువే సరుకు అంటే.

"పెట్టుబడిదారీ ఉత్పత్తి విధానంవున్న సమాజంలో ప్రత్యేక సరుకులనేకం కలసి బ్రహ్మాండమైన సరుకుల సముదాయమౌతుంది. ఈ సరుకుల సముదాయమే ఆ సమాజంయొక్క సంపద" అని మార్క్సు తన "పెట్టుబడి" అనే గ్రంథంలో వివరించాడు.

## సరుకుయొక్క రెండు విలువలు

మానవుడు తన అవసరాలను తీర్చుకొనుటకే వస్తువులను ఉత్పత్తి చేస్తాడు. ఆహారపదార్థాలు, గృహవసతులు, బట్టలు మున్నగునవిగానీ, సినీమాలు, అలంకారాలు, కళలు వగైరాలుగానీ, అన్నీ తన శారీరక మానసిక అవసరాలకోసమే ఉత్పత్తి చేస్తాడు. కాబట్టి ప్రతివస్తువు ఏదో ఒక ప్రయోజనాన్ని, ఉపయోగాన్ని మానవునియొక్క వాంఛను సంతృప్తిపరచే లక్షణాలను కల్గియుంటుంది. దీనినే ఆ వస్తువుయొక్క ఉపయోగపు విలువ అంటాము.

ఉపయోగపు విలువ ఉన్నంతమాత్రాన ప్రతివస్తువు సరుకు కానేరదు. ఉదాహరణకు మనం పీల్చేగాలి, నదీజాలలు, సూర్య కిరణాలు మొదలైనవి ఉపయోగపు విలువ కలిగినవే. మానవుని అవసరాలను తీర్చేవే. కాని అవి సరకులు కావు. మారకంకోసం ఉత్పత్తిచేసిన వస్తువులే సరుకులు.

రైతు తను తినడానికి ధాన్యం పండించుకుంటే అది ఉపయోగపు విలువగల వస్తువుగానే వుండిపోతుంది. కాని, రైతు తన ధాన్యాన్ని మార్కెట్టులో డబ్బుకు అమ్మినా, లేక యితర సరుకులతో మారకంవేసినా ఆ ధాన్యం సరుకవుతుంది.

అట్టి ధాన్యానికి యితర సరుకులతో మారకం కాగల ఒక ప్రత్యేక లక్షణం, ఒక ప్రత్యేక విలువ ఏర్పడుతుందన్న మాట. దీనినే మారకపు విలువ లేక విలువ అని పిలుస్తాము. కాబట్టి మారకపువిలువ అంటే ఉపయోగపువిలువగల ఒకరకం వస్తువు, ఉపయోగపు విలువగల మరొక రకం వస్తువుతో మారే నిష్పత్తి అన్న మాట.

ఈ విధంగా సరుకుకు ఉపయోగపు విలువ, మారకపు విలువ అనే రెండు గుణాలున్నాయి. అయితే ఈ రెండింటి మధ్య వైరుధ్యంకూడా వుంది. ఒక రైతు 6 శేర్ల ధాన్యమిచ్చి చెప్పులు కుట్టేవానిదగ్గరనుండి ఒక చెప్పులజత కొన్నాడనుకోండి. చెప్పులు కుట్టేవాడు తను తయారుచేసిన చెప్పులను తాను తొడగడంలేదు. ధాన్యానికి మారకం వేసుకుంటున్నాడు. కాబట్టి అతనికి సంబంధించినంతవరకు చెప్పులకు ఉపయోగపు విలువ లేదు. మారకపు విలువమాత్రమే ఉంది. చెప్పులకు బదులు తాను పుచ్చుకున్న ధాన్యాన్ని తాను తింటున్నాడు. కావున ధాన్యంలో తనకు ఉపయోగపు విలువ వున్నది. అలాగే రైతుకు సంబంధించినంతవరకు తన ధాన్యానికి మారకపు విలువ, తాను తీసుకున్న చెప్పులకు ఉపయోగపు విలువవున్నాయి. కాబట్టి సరుకును అమ్మేవానికి ఉపయోగపు విలువ, కొనేవానికి మారకపు విలువ కనిపించవు.

## మానవుని శ్రమనుబట్టే విలువ ఏర్పడుతుంది

ఈనాడు మార్కెట్లో మనకు అనేక రకాల సరుకులు కనిపిస్తాయి. చిన్నవి, పెద్దవి, చౌకవి, ప్రియమైనవి, రుచికర

మైనవి, సువాసన గలవి, అనేకం కనబడతాయి. అంటే అనేక రకాలైన ఉపయోగపు విలువలుగల వస్తువులు వేరు వేరు స్వరూపాల్లో, మొత్తాలలో, ప్రమాణాలలో వుంటాయి. ఈ సరుకులన్నీ ఒకదానితో ఒకటి మారకం వేయబడు తున్నాయి; కోమటి దుకాణంలో రైతులు ధాన్యం యిచ్చి కిరొసిన్, అగ్గిపెట్టెలు, చింతపండు, పంచదార వగైరాలు తెచ్చుకోవడం చూస్తున్నాము. దీనినిబట్టి ప్రతి సరుకును ఏ యితర సరుకుతోనైనా మార్చుకోవడం సాధ్యమనేది కనబడుతూంది. అయితే ఈ సరుకులన్నీ వాటి వాటి ఉపయో గాన్నిబట్టి మారుతున్నాయా? ఒకే సరుకులో ఒకరికి ఎక్కువ, ఒకరికి తక్కువ వుపయోగపు విలువ వుండవచ్చు. అలా వుండడం గూడ ఆచరణలో చూస్తాము. అలాంటపుడు వివిధ స్వరూపాలు, పరిణామాలు కలిగిన సరుకులు ఒకదానితో ఒకటి మారడానికి కొలబద్ద మరేదో వుండి వుండాలి. అదే మానవ శ్రమ.

పూర్వకాలంలో తెగలమధ్య కాని, రైతులు, వృత్తి పనివారల మధ్య గాని మారకం జరుగుచున్న రోజులలో తమ కళ్ళ ఎదుటనే ఉత్పత్తి అవుతున్న ఆయా సరుకులలో యిమిడి యున్న తమ తమ శ్రమలను ఉజ్జాయింపుగా కొలుచుకుని, మార్చుకునేవారు. మారకం అభివృద్ధి అయినకొలదీ శ్రమను యింకా జాగ్రత్తగా అంచనావేయడం జరిగేది. ఈనాడు సరుకుల మారకం ఖచ్చితంగా శ్రమ ప్రమాణం ప్రకారం జరుగుతూంది.

సరుకుల విలువ (అంటే మారకం విలువ) వాటిలో యిమిడియుండే శ్రమ మొత్తాన్నిబట్టి మారుతూ వుంటుందని ఆచరణే మనకు రుజువు చేస్తూంది. ఉదాహరణకు ఒకప్పుడు బాగా ప్రియంగావున్న వస్తువులు తర్వాత బాగా చౌకవడం మన మెరుగుదుము. చాలా సంవత్సరాలక్రితం అల్యూమినియం ఖరీదు వెండి ఖరీదుకన్న 8, 10 రెట్లు ఉండేది. కాని ఎలెక్ట్రికల్ టెక్నిక్ అభివృద్ధి అయ్యాక అల్యూమినియం సులభంగా తయారు చేస్తున్నారు. దాని నుత్పత్తిచేయుట కవసరమైన మానవశ్రమ బాగా తగ్గిపోయింది. అందువల్ల దాని ధర 1000 రెట్లు తగ్గిపోయింది.

కాబట్టి శ్రమ ఎక్కువైతే సరుకు విలువ పెరుగుతుంది. శ్రమతగ్గితే సరుకు విలువ తగ్గుతుంది.

అలాగే మానవుని ఉత్పత్తి సామర్థ్యం పెరిగితే సరుకును తయారుచేయుట కవసరమైన శ్రమ తగ్గి, దాని విలువకూడా తగ్గుతుంది. ఇదివరకు 8 గంటల కాలంలో ఒక చెప్పుల జత తయారైతే, యిపుడు 4 గంటల కాలంలోనే ఆ జత తయారయిందనుకోండి. అపుడు ఆ చెప్పుల విలువ సగానికి సగం తగ్గిపోతుంది.

కాబట్టి "శ్రమయొక్క ఉత్పత్తి సామర్థ్యం పెరుగు తరుగులకు తలక్రిందులుగా సరుకుయొక్క విలువ మారుతూంటుంది" అని మార్క్సు చెప్పారు.

సరుకులకు విలువలు వాటిలో యిమిడియుండే శ్రమను బట్టి ఏర్పడుతున్నాయని తెలుసుకున్నాం. అయితే యీ

శ్రమను కొలిచే దెలా? శ్రమ కాలాన్ని బట్టి, ఉదాహరణకు ఒక సరుకును తయారుచేయుటకు 4 గంటలు పడితే, అదే రకపు శ్రమతో మరొక సరుకును తయారు చేయుటకు 8 గంటలు పడితే రెండో సరుకు విలువ మొదటి సరుకు విలువ కన్న రెండు రెట్లుంటుంది. ఈ విధంగా శ్రమ మొత్తాన్ని శ్రమ కాలాన్ని బట్టే నిర్ణయిస్తాము. ఉదా: ఒక టన్ను యినుమును తయారుచేయుటకు 100 గంటల శ్రమకాలం పట్టి, ఒక పావుతులం వెండిని తయారు చేయుటకుకూడా 100 గంటల శ్రమ కాలమే పడితే రెండింటియొక్క విలువలు సరిసమానంగా వుంటాయి.

ఇచట ఒక సందేహం రావొచ్చు. ఒక సరుకుయొక్క విలువ దానిని తయారుచేయుటలో వెచ్చింపబడిన "శ్రమ కాలం"బట్టి నిర్ణయింప బడుతుందన్నపుడు, ఒక బద్ధకస్తుడు లేక ఒక చేతగాని కార్మికుడు ఒక సరుకును తయారుచేయుటకు ఎక్కువకాలం తీసుకుంటాడు గదా, కాబట్టి ఆసరుకు విలువ ఎక్కువ వుంటుందా? అలా ఎన్నటికీ జరగదు. సరుకు విలువ ఒక్కొక్క ప్రత్యేక కార్మికుని శ్రమకాలాన్నిబట్టి నిర్ణయించ బడదు. ఆనాటి సామాజికాభివృద్ధి, పని నిపుణత్వం, యంత్రాభివృద్ధి, ఉత్పత్తిశక్తి మొదలైనవన్నీ చూచి, సరుకును ఉత్పత్తి చేయుటకు అవసరమగు సగటు శ్రమనుబట్టి నిర్ణయించ బడుతుంది. చేమగ్గంమీద ఒక గజంబట్ట నేయడానికి 2 గంటల కాలంపడితే, మరమగ్గంమీద 1 గంటమాత్రమే పడుతుంది. సమాజంలో మరమగ్గాలపై ఉత్పత్తి ప్రధానపాత్ర వహిస్తున్నపుడు మరమగ్గాలమీద బట్టనేయుటకుపట్టే సగటు శ్రమకాలమే

బట్టవిలువను నిర్ణయిస్తుంది. అదేవిధంగా మామూలు నాగలిని ఉపయోగించి వ్యవసాయం గావించే రైతుల ఉత్పత్తిశక్తికంటె, ట్రాక్టర్లు మున్నగు యంత్రాలను, శాస్త్రీయ పద్ధతులను వినియోగించి పనిచేసే సమిష్టి క్షేత్రాలలోని రైతు ఉత్పత్తిశక్తి ఎక్కువగా ఉంటుంది. అందువల్ల యీ రెండు పద్ధతులద్వారా ఉత్పత్తిఅయ్యే సరుకులలో యిమిడియున్న శ్రమ వేర్వేరుగా వుంటుంది. ఆ మొత్తపు సరుకులోనే రెండవపద్ధతిద్వారా ఉత్పత్తిఅయ్యే దానిలో శ్రమకాలం చాల తక్కువగావుంటుంది.

కాబట్టి సరుకుయొక్క విలువ "ఆ సమాజంలో, ఆకాలంలో సాధారణ ఉత్పత్తి పరిస్థితులనుబట్టి, సగటు పని నిపుణతనుబట్టి, ఉత్పత్తి శక్తినిబట్టి అంటే సామాజికంగా అవసరమగు శ్రమ కాలాన్నిబట్టి" నిర్ణయింపబడుతుందని మార్క్సు చెప్పారు.

పైన చెప్పినదాన్నిబట్టి, ఉత్పత్తి పద్ధతులు అభివృద్ధి అయ్యేకొలదీ ఒక్కొక్క సరుకులో సామాజికంగా అవసరమగు శ్రమకాలం తగ్గి, సరుకుయొక్క విలువకూడా తగ్గవలసి యుంటుంది. కాని పెట్టుబడిదారీ సమాజంలో లాభాలే ప్రధానంగావడం వలన, యీ తరుగుదల సాధ్యంగావడంలేదు. సోషలిస్టు ఉత్పత్తి విధానంలో అలాగాక, క్రమంగా సరుకుల ధరలు తగ్గించబడుతూండడం మనం చూస్తున్నాము.

మనం యింతవరకు శ్రమ అని మామూలుగా ఉపయోగిస్తున్నాము. కాని శ్రమ అంతా ఒకటి కాదు. దర్జీవాని శ్రమ, డాక్టరు శ్రమ ఒకటి గావు. మామూలు కూలీ శ్రమ, ఇంజనీరు శ్రమ ఒకటిగావు. దర్జీపని సులభంగా నేర్చుకోవచ్చు.

మామూలు కూలిపనికి నిపుణత అక్కరలేదు. కాని ఏ డాక్టరో, ఇంజనీరో గావాలంటే 5, 6 సంవత్సరాలు పడుతుంది. కాబట్టి శ్రమకూడా సులభ శ్రమ అనీ, నైపుణ్యా శ్రమ అనీ రెండు రకాలుగా వుంటుంది. అయితే యీ రెంటిని పోల్చడం ఎలా? ఉదాహరణకు ఒక గడియారం తయారుచేయుటకు 20 గంటలు పట్టిందనుకుందాం. 20 గంటలకాలంలో శ్రమపడి ఒక మేదరి 10 తట్టలు అల్లాడనుకొందాం. గడియారం తయారు చేసిన 20 గంటలకాలం శ్రమవిలువా, మేదరి గావించిన 20 గంటలకాలం శ్రమ విలువా ఒకటిగానే లెఖ్ఖగట్టం. ఎందుచేత నంటే, గడియారాన్ని తయారుచేసేవాడు 4 లేక 5 సంవత్సరాలైనా ఆ విద్యను నేర్చుకోవాలి. దానిలో నిపుణుడు కావాలి. కాని తట్టలు అల్లడం 4-5 రోజులలో ఎవరైనా నేర్చుకోవచ్చు. అందుచేత గడియారాన్ని తయారుచేయుట కవసరమైన 20 గంటల శ్రమకాలంతో ఆ విద్యను నేర్చుకొనుటకు ఖర్చుపెట్టిన 4-5 సంవత్సరాల శ్రమనుకూడా కలుపుకోవాలి. కాబట్టి గడియారంలో యిమిడియున్న 20 గంటల నైపుణ్యశ్రమ తట్టలు అల్లడానికి ఖర్చుపెట్టిన సామాన్య శ్రమతో సమానంగాక కొన్నిరెట్లు ఎక్కువ విలువను కలిగియుంటుంది. ఈ విధంగా నైపుణ్యశ్రమ విలువ నిర్ణయించబడుతుంది.

## విలువ - ఖరీదు

ఇంతవరకూ మనం సరుకుయొక్క విలువ ఆ సరుకును తయారుచేయుటకు ఆనాటి సామాజిక ఉత్పత్తి పరిస్థితులలో అవసరమైన సగటు శ్రమకాలాన్ని బట్టి నిర్ణయించబడుతుందని చూచాం.

అయితే యీ నాడు సరుకులన్నీ వాటి అసలు విలువ ప్రకారమే, వాటిలో యిమిడియున్న శ్రమ ప్రకారమే అమ్మ బడుతున్నాయా ? బజారులో ప్రతిదినమూ అనేక సరుకులు అమ్మబడుతూంటాయి. వీటియొక్క ఖరీదులు (ధనరూపంలో సరుకుయొక్క విలువనే ఖరీదు అంటాము) నిలకడగా లేక మారుతూండడం చూస్తున్నాము. దీనికి కారణమేమిటి ?

సరుకు తయారై అమ్మకానికి సిద్ధంకాగానే, దానిని కొనే వారు తగినంతమంది వుండాలి. అప్పుడే సరుకులన్నీ అమ్ముడు పోతాయి. కొనుక్కునేవారి వాంఛలు యీడేరుతాయి. అంటే సప్లై, డిమాండులు సరిపోవాలన్నమాట. ఉదాహరణకు బజారులో అమ్మకానికి 100 బస్తాల ధాన్యం వచ్చాయను కోండి. ఈ 100 బస్తాలను కొనడానికి తగినంతమంది కొనుగోలు దారులు లేనపుడు డిమాండు తగ్గుతుంది. అందువలన ధాన్యం ఖరీదు తగ్గించి అమ్ముతారు. అంటే దాని నుత్పత్తిచేయుట కవసరమైన శ్రమకు పూర్తి ప్రతిఫలం గిట్టకుండానే అమ్మి వేయడం జరుగుతుంది. అలా గాక 100 బస్తాలకు బదులు, 200 బస్తాల ధాన్యాన్ని కొనేందుకు కొనుగోలుదారులు సిద్ధంగా ఉన్నారనుకోండి. అప్పుడు ఖరీదు పెరుగుతుంది. ప్రతి ఒక్క బస్తా ధాన్యాన్ని కొనేందుకు సరిపడినంతమంది కొనుగోలు దారులే వుంటే, ధాన్యం ఖరీదు సరిగ్గా దాని విలువతో సమా నంగా ఉంటుంది.

ఈ విధంగా సప్లై, డిమాండులనుబట్టి ఖరీదులు మారు తూంటాయి. సప్లై ఎక్కువై, డిమాండుతగ్గితే ఖరీదు తగ్గుతుంది. డిమాండు ఎక్కువై, సప్లై తగ్గితే ఖరీదు ఎక్కువవుతుంది. అంటే

సరుకుల ఖరీదులు వాటి విలువల చుట్టూ అటూ యిటూ ఊగిసలాడుతూ వుంటాయి. సరిగ్గా సప్లై, డిమాండులు సరి తూగితే సరుకులు వాటి విలువలకే అమ్ముడు పోతాయి. కాని పెట్టుబడిదారీ ఉత్పత్తి విధానం వున్నంతవరకు యిది అసంభవం. కారణమేమంటే, యీ విధానంలో ఏ యే సరుకును ఎంతెంత ఉత్పత్తి చేయాలో నిర్ణయించేవా రెవరూ లేరు. బ్రహ్మాండమైన అరాజకం వ్యాపించి వుంటుంది. ఒక 'ప్లాను' నియమం లేకుండ, ఉత్పత్తి, అమ్మకాలు జరుగుతుంటాయి. ప్రతి ఉత్పత్తిదారు గుడ్డిగా సరుకులను ఉత్పత్తి చేస్తుంటాడు. అవి అమ్ముడు పోతాయా, దానిని కొనేవాళ్ళున్నారా, లేరా అనేది ఆలోచించడు. అలా తెలుసుకునే మార్గంకూడా లేదు. దాని భవిష్యత్తేమిటో బజారు చేరాకనే తెలుస్తుంది. బజారులో ఒక సరుకు తక్కువగా వుందనుకోండి. దానిని కొనేవారు ఎక్కువ వున్నారనుకోండి. అపుడు సరుకు ఖరీదు, దాని విలువకన్నా కొంచెంఎక్కువగా వుంటుంది. కాబట్టి పెట్టుబడిదారులు లాభాపేక్షతో ఆ సరుకునే ఉత్పత్తి చేయుట కెగబడతారు. బజారులోని కా సరుకు ఎక్కువ వస్తుంది. కొనేవారు తక్కువవుతారు. మరల సరుకు ఖరీదు, విలువకన్న తగ్గుతుంది. ఈవిధంగా మార్కెట్లో సరుకుల ఖరీదు లెప్పుడూ వాటి విలువల చుట్టూ ఊగిసలాడుతుంటాయి. పెట్టుబడిదారీ ఉత్పత్తివిధానంలో విలువకు సంబంధించిన సూత్రం యీ విధంగా బహిర్గతమౌతూంటుంది. బజారు అంతా గుడ్డిగా పరుగెడుతూంటుంది. ఈ గుడ్డిశక్తికి ప్రతి ఉత్పత్తి

దారుడూ, కొనుగోలుదారుడూ లొంగవలసినదే; నలిగిపోతూ వుండవలసినదే.

విలువలనుగూర్చి బూర్జువా అర్థశాస్త్రజ్ఞుల తప్పుడు సిద్ధాంతాలు

విలువయొక్క శ్రమ సిద్ధాంతాన్ని మార్క్సుకు పూర్వమే ఆడమ్ స్మిత్, రికార్డో అనే సుప్రసిద్ధ బూర్జువా అర్థశాస్త్రవేత్తలు (18 వ శతాబ్దాంతంలోను, 19 వ శతాబ్దారంభంలోను) ప్రతిపాదించారు. ఆ రోజులలో ఫ్యూడల్ బానిసత్వం యింకా ప్రబలంగా ఉండేది. పెట్టుబడిదారీవిధానం శైశవావస్థలో వుండేది. ఫ్యూడల్ విధానాన్ని నాశనం చేయనిదే, పెట్టుబడిదారీవిధానం అభివృద్ధి కాదుగదా! అందువల్ల పెట్టుబడిదారీ అర్థశాస్త్రజ్ఞులు విలువయొక్క శ్రమ సిద్ధాంతాన్ని తీసుకున్నారు. ఫ్యూడల్ భూస్వాములు తామేమీ ఖర్చుపెట్టకుండానే భూమిపై గుత్తాధికారం సంపాదించి రైతులను దోపిడీచేస్తున్నారని విమర్శించారు. పెట్టుబడిదారులు మాత్రం అలాకాకుండా కార్మికులకు ఉత్పత్తిపరికరాలిచ్చి, సరుకులు ఉత్పత్తిచేయించి, కార్మిక శ్రమద్వారా ఉత్పత్తి ఐన విలువలో కొంతభాగాన్ని (లాభం) న్యాయంగా తీసుకుంటారని పెట్టుబడిదారుల్ని సమర్థించ పూనుకున్నారు.

స్మిత్, రికార్డోలు కార్మికుల శ్రమజనితమైన విలువలో కొంతభాగం కార్మికులకు కూలిరూపంలోను, మిగతాభాగం పెట్టుబడిదారులకు లాభాలరూపంలోను వెళ్ళుతుందని సిద్ధాంతీకరించారు. కాని కార్మికుల శ్రమయొక్క విలువయే వారికిచ్చే కూలి అనికూడ చెప్పారు. సరిసమానపు విలువగల

సరుకులుమాత్రమే మారకమవుతాయనిగదా పైన చూచాము. అలాంటప్పుడు కార్మికునియొక్క శ్రమతాలూకు విలువ అంటే కార్మికుడు సృష్టించిన విలువ, అతని కిచ్చే కూలితో సరిసమానంగా ఉండాలి. అలా అయినపుడు పెట్టుబడిదారు కింకా లాభం ఎక్కడనుండి వస్తుంది? దీనికి ఆ బూర్జువా అర్థశాస్త్రజ్ఞులు సమాధానం చెప్పలేకపోయారు. మార్క్సు తనయొక్క అదనపు విలువ సిద్ధాంతంద్వారా (దీనినిగురించి వివరం తర్వాత తెల్సుకోగలం) యీ సమస్యను పరిష్కరించారు. మార్క్సు ఎప్పుడైతే శ్రమ సిద్ధాంతం సరియైనదేనని రుజువుచేసి, అదనపు విలువ సిద్ధాంతాన్నికూడా వివరించి, పెట్టుబడిదారీ విధానంయొక్క దోపిడీ రహస్యాన్ని బట్టబయలుచేసి, ఆ విధానం నాశనంగాక తప్పదని రుజువుచేశారో, ఆనాటినుండీ బూర్జువా అర్థశాస్త్రజ్ఞులు విలువయొక్క శ్రమసిద్ధాంతాన్ని రూపుమాపుటకుగాను విలువనుగూర్చి అనేక అసంబద్ధపు, అశాస్త్రీయ సూత్రాలను సృష్టించారు.

## 1. సప్లయి డిమాండులనుబట్టి విలువ

మొట్టమొదట బూర్జువా అర్థశాస్త్రజ్ఞులు సరుకుయొక్క విలువ సప్లై, డిమాండులనుబట్టి ఏర్పడుతుందని వాదించ మొదలు పెట్టారు. ఒక సరుకుయొక్క ఖరీదు హెచ్చుటలోను, తగ్గుటలోను సప్లయి, డిమాండులకు ఎలాంటి పాత్రవున్నదో యిదివరకే చూచాము. కాని ఆ సరుకుయొక్క అసలు విలువను యివి ఎలా నిర్ణయిస్తాయో మాత్రం వీరు వివరించలేకపోయారు. డిమాండునుబట్టి సరుకు ఉంటుందన్నారు. ఉదా: ఒక

సరుకుకు డిమాండు పెరిగిందనుకోండి. కాని కొద్దికాలంలో ఆ సరుకు సప్లైకూడా తదనుగుణ్యంగానే పెరుగుతుందికదా! మరి ఆ సప్లైని నిర్ణయించే దేది? పెట్టుబడిదారీ అర్థశాస్త్రజ్ఞులు ఉత్పత్తి ఖర్చులనుబట్టి సప్లై ఉంటుందన్నారు. అంటే చివరకు సరుకుయొక్క విలువ (ఖరీదు అని వారి ఉద్దేశం) ఆ సరుకును ఉత్పత్తిచేయుటకు అవసరమైన ముడిసరకుల విలువను (ఖరీదు) బట్టి నిర్ణయించబడుతుందన్నమాట. ఖరీదు, ఖరీదును నిర్ణయించడం! ఎంత అసమంజసం!!

ఉదాహరణకు మార్కెట్లో నూరు బ్లేడులు, నూరు మోటార్ కారులు వున్నాయనుకోండి. బ్లేడులు కొనేవారు నూరుమంది, మోటార్ కార్లు కొనేవారు నూరుమంది సిద్ధంగా వున్నారనుకోండి. అంటే రెంటి విషయంలోను డిమాండులు సరితూగుతున్నవన్నమాట. వీరి సిద్ధాంతం ప్రకారం బ్లేడు ఖరీదు, మోటారుకారు ఖరీదు సరిసమానం కావాలి. కాని అలా ఎన్నటికీ జరగడంలేదని మనకు తెలుసు. కాబట్టి యీ సూత్రం తప్పు.

2. కొందరు అర్థశాస్త్రజ్ఞులు సరుకుయొక్క ఉపయోగాన్నిబట్టి దాని విలువ నిర్ధారింపబడుతుందన్నారు. ఉపయోగం ఎక్కువైతే విలువ పెరుగుతుందనీ, తక్కువైతే తగ్గుతుందనీ చెప్తారు. ఇదే నిజమైతే ప్రపంచం మొత్తంమీద ప్రతి యింటిలోనూ అత్యంతావశ్యకమైన సరుకు ఉప్పుగదా? అలాంటప్పుడు ఉప్పుయొక్క విలువ చాలా ఎక్కువవుండాలి. కాని ఉప్పు చాలా చౌకగా ఉండడం మనం చూస్తున్నాము. అలాగే బంగారంకన్నా బియ్యం జీవితానికి అత్యంతావశ్యక

మైన సరుకైనప్పటికీ, బంగారం విలువకన్న బియ్యం విలువ చాలా తక్కువ. కాబట్టి ఉపయోగాన్ని బట్టి విలువ ఏర్పడుతుందనే సూత్రం పూర్తిగా తప్పని తేలింది.

3. మార్జినల్ యుటిలిటీ సిద్ధాంతం : ఒక సరుకునుత్పత్తి చేయుటలో వివిధ పెట్టుబడిదారులకు వేర్వేరు ఉత్పత్తి ఖర్చులవుతాయికదా ? అయితే వారు మార్కెట్లో సరుకును వివిధ ఖరీదులకు అమ్మలేరు. అందకు ఒకే ఖరీదుకు అమ్మవలసియుంటుంది. అందువల్ల ఎక్కువ ఉత్పత్తి ఖర్చు అయినవాడు అంగీకరించగల కనీసఖరీదుకే మిగతావారు అమ్మవలసివస్తుంది. ఇతనినే "మార్జినల్ ఉత్పత్తిదారు" అని పిలుస్తారు.

అలాగే కొనుగోలుదారుల్లోకూడా కొంతమంది ఆ సరుకును ఎంతఖరీదైనా యిచ్చి కొనగలరు. మరికొంతమంది ఖరీదు బాగా తగ్గితే తప్ప కొనుటకు ఆసక్తి చూపరు. సరుకంతా లేక చాలాభాగం అమ్ముడుపోవాలంటే యీ ఎక్కువమంది కొనగల ఖరీదుకే అమ్మవలసి యుంటుంది. వీరినే "మార్జినల్ కొనుగోలుదారులు" అంటారు.

ఇలా, మార్జినల్ ఉత్పత్తిదారులు, మార్జినల్ కొనుగోలుదారులు యిద్దరుకూడా అంగీకరించే ఖరీదు ఒకటి స్థిరపడగలదు. అంటే ఉత్పత్తిదారుల, కొనుగోలుదారుల మార్కెట్ ప్రవర్తనపైన ఖరీదు ఆధారపడుతుంది. ఈ ఖరీదే మార్జినల్ ఖరీదు అవుతుంది. ఇదే సరుకుయొక్క అసలువిలువ. ఇదీ వీరి వాదన.

సప్లై, డిమాండులద్వారా సరుకుల విలువలు నిర్ణయింపబడతాయనే సూత్రం (దీనికికూడ ఆధారం అదే) ఎలా తప్పో

యిదివరకే వివరించబడింది. గమనించవలసిన రెండో విషయ మేమిటంటే సోషల్ డిమాండు (సాంఘికావసరాల మొత్తం)కు, ఆచరణలో ఉండే డిమాండుకు (Effective demand) సంబంధం లేదు. కార్మికులకు, తదితర తక్కువ ఆదాయంగల కష్టజీవులకు ఎన్ని వాంఛలున్నా వారి కొనుగోలుశక్తి తక్కువ గావడంవలన అవి తీర్చుకోలేరు. అందువల్ల డిమాండు అనేది ఆదాయాన్నిబట్టి ఉంటుంది. కొనుగోలుదారుల మార్కెట్ ప్రవృత్తి (Market behaviour) వారి ఆదాయంమీద ఆధార పడుతున్నప్పుడు అదే విలువను నిర్ణయిస్తుందనడం పొరపాటు.

## విలువయొక్క రూపాలు - డబ్బురూపంలోకి పరిణామం

సరుకుల విలువ ఈరోజున డబ్బురూపంలో చెప్పబడు తూంది. పెట్టుబడిదారీ అర్థశాస్త్రజ్ఞులు విలువయొక్క రూపం డబ్బురూపంలోకి ఎలా మారిందో ఆలోచించనేలేదు. మొట్ట మొదటిసారిగా మార్క్స్ యీ పరిణామాన్ని వివరించారు.

సామాన్య సరుకుల ఉత్పత్తి విధానంలో కొద్దివస్తువులు మాత్రమే మారకం వేయబడుతూన్నపుడు, వస్తువులమధ్య మారకం నేరుగా సాధారణ పద్ధతిలో ఉజ్జాయింపుగా జరిగేది. ఉదా : రెండు గిద్దల ధాన్యం=1/4 వీశె వంకాయలు. విలువయొక్క యీ రూపాన్ని ప్రాథమికరూపం లేక యాదృ చ్ఛికరూపం అని పిలుస్తారు.

మారకం అభివృద్ధి అయినకొలదీ, ఎక్కువ వస్తువులు రంగంలోకి ప్రవేశించసాగాయి. దీనితో ఒకే వస్తువు అనేక యితర వస్తువులతో మార్చవలసిన అవసరం ఏర్పడింది. ఒక

పశుచర్మం మారిస్తే రెండు ఈటెలు వచ్చేవనుకోండి. అలాగే ఒక జత చెప్పులూ, ఒక పడవ తెడ్డు వచ్చేవనుకోండి. ఇపుడు రెండు యీటెల విలువ ఒక జత చెప్పులకు లేక ఒక పడవ తెడ్డుకు సమానం అనేది తేల్చుకోవచ్చు. ఈ విధంగా విలువ యొక్క యాదృచ్ఛిక రూపం పోయి విస్తారితరూపం అమలు లోకి వచ్చింది.

మారకం మరింత అభివృద్ధియై నందలకొలది సరుకులు మార్చవలసి వచ్చినపుడు ప్రతి సరుకును అనేక యితరసరుకులతో పోల్చడం అసాధ్యమూ, అనవసరమూ అయిపోయింది. సరుకులు కల్గినవారు ఏదో ఒక సరుకుతో తమ సరుకుల విలువను పోల్చుకొన ప్రారంభించారు. ఉదా : నేతపనివారు 1ఎద్దు=20 గజాల బట్ట అని, అలాగే రైతు 1 ఎద్దు=3 బస్తాల ధాన్యమని, యీలాగునే మిగతావారుకూడా. ఇచట అన్ని సరుకుల విలువలను ఎద్దు అనే సరుకుతో కొలిచేవారు. అన్ని సరుకుల విలువలను ప్రతిబింబించే విశ్వవ్యాప్తమైన సరిసమాన వస్తువొకటి (పశువు) ఒక గ్రూపుగానూ, తక్కిన సరుకులన్నీ ఒక గ్రూపుగానూ తయారయ్యాయి.

పూర్వకాలంలో మారకపు సాధనంగా తయారయిన పశువులే ముఖ్యమైన సొమ్ముగా భావింపబడేవి. అందువలననే యీనాటికీ కొన్ని ప్రాంతాలలో పశువులకు సొమ్ములనే పేరు నిలచివుంది. విలువయొక్క యీ స్వరూపాన్ని సర్వసాధారణ రూపం అంటారు.

ధనరూపం : మారకం మరింత అభివృద్ధియై, విదేశాలతోకూడా వ్యాపారం ప్రారంభమయ్యాక, పశువు మారకపు

సాధనంగా కొంత యిబ్బంది కలిగించింది. పశువులను దూర ప్రదేశాలకుగాని, విదేశాలకుగాని తరలించుకుపోవడం చాల కష్టసాధ్యమైన పని. అలాగే వాటిని విభజించడం అసాధ్యం. అందువలన తేలికగా మోసుకొనిపోవుటకు, అనేకభాగాలుగా విభజించుటకు వీలైన మరొక సరుకు అవసరమయింది.

ఆ లక్షణాలను కలిగిన లోహాలు ముఖ్యంగా వెండి, బంగారా లిందుకు బాగా పనికివచ్చాయి. వెండి, బంగారం, లోహాలు పశువుస్థానాన్ని ఆక్రమించాయి. విశ్వవ్యాప్తమైన సరిసమాన వస్తువుగా తయారయ్యాయి. ఆనాటినుండి మారకం అంతా వెండి, బంగారం, తదితర నాణేలద్వారా జరుగుతోంది.

ఐతే మనం యిచట ఒక విషయం మరచిపోగూడదు. మానవశ్రమ ఉన్న సరుకులే ఒకదానితో ఒకటి మారతాయని చూచాము. ఇచట ప్రతి సరుకు వెండి, బంగారం నాణేలతో మారుతున్నాయంటే యీ నాణేలుకూడా సరుకులై యుండాలి. మానవుని శ్రమ వాటిలో ఉండాలి. ఎంతో కష్టపడి గనులు త్రవ్వి తీయడం, కరిగించి పోయడంద్వారానే యీ నాణేలు తయారవుతున్నాయి. కాబట్టే ధనం విశ్వవ్యాపకమైన మారకపు సాధనం కాగలిగింది.

ధనం మారకపు సాధనంగా తయారవుటలో పెట్టుబడి దారీ ఉత్పత్తి సంబంధాలలో ఉత్పత్తి అంతా గిల్టుపూత పూయబడి ఉంటుందని, అంటే వెండి, బంగారాల రూపంలో ఉంటుందని, ధనానికి మానవాతీతమైన దైవికశక్తులన్నీ ఉన్నట్లు భావింపబడుతూందని, సామాజిక అభివృద్ధివల్లనే

ధనం అనేది ఏర్పడినా, పెట్టుబడిదారీ సమాజంలో దానికి విప రీత ప్రాముఖ్యత, బలం ఏర్పడ్డాయని మార్క్సు చెప్పారు.

అలాగే ధనాన్ని గురించి లెనిన్ "మార్క్సు-ఏంగెల్సు మార్క్సిజం" అనే గ్రంథంలో యిలా చెప్పారు :

"ధనం మారకంయొక్క వృద్ధి క్రమంలోనూ, సరుకుల ఉత్పత్తి విధానంలోను వచ్చిన చిట్టచివరి రూపం. ఇట్టిదశలో మార్కెట్ ద్వారా లక్షలకొలదిగానున్న ఉత్పత్తిదార్ల మధ్య ఏర్పడిన సామాజిక సంబంధాల్ని, వ్యక్తిగత శ్రమకు గల్గిన సామాజిక సంబంధాల్ని యీ ధనం మరుగుపరుస్తుంది."

## ధనంయొక్క విధులు

ధనంయొక్క విధులు యివి :

(i) విలువలకు కొలబద్ద (Measure of value and a standard of prices) : సరుకులఉత్పత్తివిధానంలో ఏ సరుకైనా మారాలంటే దాని విలువను డబ్బురూపంలో కొలుస్తాం. ఒక సరుకును అమ్మడానికిగాని, కొనడానికిగాని ముందు దాని వెల (ధనరూపంలో విలువ) తెలిసివుండాలి. కాబట్టి విలువ యొక్క కొలబద్దగా ధనం ఉపయోగపడుతుంది.

ఆదర్శప్రాయమగు ధనం : సరుకుల విలువలను లెక్కగట్టేటప్పుడు ధనం ప్రత్యక్షంగా ఉండవలసినపని లేదు. జేబులో చిల్లికానీ లేకుండానే ధాన్యంబస్తా విలువ యిరవై రూపాయలని, అద్దం విలువ పన్నెండణాలని, కుర్చీ విలువ పదిరూపాయలని చెప్పగలము. కాబట్టి సరుకుల విలువలను కొలిచేటప్పుడు

ఊహామాత్రంగానే ధనం కొలపాత్రగా వినియోగించబడు తుంది. అందుచే దానిని ఆదర్శప్రాయమగు ధనం అంటాము.

(ii) మారకపుసాధనం : (Medium of exchange) ఒకరైతు తన దగ్గరుండే అదనపు సరుకును (ధాన్యాన్ని) అమ్మి డబ్బు తీసుకుంటాడు. ఆ డబ్బుతో తిరిగి తన కవసరమైన సరుకులు కొనుక్కుంటాడు. ఇచట ధనం రైతు అమ్మే సరుకుకు, కొనుక్కునే సరుకుకు మధ్య మధ్యవర్తిగా లేక దళారీగా పనిచేస్తున్నదన్న మాట. అంటే ధనం సరుకుల చలామణికి సాధనంగా పనిచేస్తూంది.

డబ్బు చలామణితోనే సరుకుల మారకం జరుగుతుంది. చలామణి సాధనంగా తన పాత్రను నిర్వహించాలంటె ధనం ప్రత్యక్షంగా వుండాలి. ఏ సరుకును కొనాలన్నా ధనం అవసరం.

అయితే చలామణి సాధనంగా ఉపయోగపడేటపుడు ధనం చేతులు మారుతూంటుంది. ఒకడు తన సరుకమ్మి డబ్బు తీసుకున్నాడంటే, తిరిగి ఆ డబ్బు మరొకరి కిచ్చి సరుకులు కొంటాడు. ఆ మరొకరు ఆ డబ్బుతో తన కవసరమైన సరుకులు కొనుక్కోవచ్చు. ఇలాగే నిలకడ లేకుండా ధనం ఎన్ని చేతులైనా మారవచ్చు. మారకం బాగా అభివృద్ధి చెందాక, యిలా మాటిమాటికి చేతులు మారు తున్నపుడు వెండి, బంగారం నాణేలను వాడడంవల్ల ఆ నాణేలు అరిగిపోయి వాటి విలువ తగ్గవచ్చు. అందువల్ల వెండి, బంగారం నాణేలకు బదులు, యింత విలువకు ప్రాతినిధ్యం వహిస్తాయి అనే అధికార ముద్రతోగూడి, ఆచారంగా ప్రజలచే గుర్తించబడిన రాగి, వెండి, నికిల్ వగైరా చిల్లర నాణేలు, రూపాయినోట్లు

వగైరా కాగితపు నోట్లు చలామణి సాధనాలుగా ప్రచారం లోనికి వచ్చాయి. వీటిని చిహ్నమాత్రపు డబ్బు (Token money) లేక విలువ చిహ్నములు అని పిలుస్తాము.

(iii) బాకీలుచెల్లించే సాధనం (means of payment): సరుకుల మారకం బాగా అభివృద్ధియైన తర్వాతనే, విలువ చిహ్నములు అమలులోకి వచ్చాయి. మారకం యింకా అభివృద్ధియైనదశలో అమ్మకానికి, కొనుగోలుకు ఎడబాటు వచ్చింది. సరుకులను కొనగానే డబ్బు చెల్లించ వలసిన అవసరం లేకుండా. వ్యాపారం సాగేస్థితి వచ్చింది. సరుకులను కొనేవాడు, అమ్మేవానికి యిన్నిరోజులలో డబ్బు చెల్లిస్తానని ఒక అగ్రిమెంటు వ్రాసియిస్తాడు. దీనినే మారకపు బిల్లు (Bill of exchange) అంటారు. లేదా ఒక బ్యాంకుచెక్ యిస్తాడు. ఆధునిక వ్యాపారంలో అనేక రకాలైన బాకీలు చెల్లించే విధానాలు, ద్రవ్య వ్యాపారపద్ధతులు (Financial transactions) అమలులోకి వచ్చాయి. ఈ వ్యాపారాన్ని నడిపేసంస్థలు (బ్యాంకులు వగైరా) ఏర్పడ్డాయి. ప్రతి వ్యాపారస్థుడు బ్యాంకులలో ఆస్తులు, అప్పుల (Debts and credit) లెక్కలు వుంచుకోవడం, డబ్బు ఎప్పటికప్పుడు అవసరంలేకుండానే ఆస్తులు, బాకీల అకౌంటులు సరిచేస్తూ చివరి కెప్పుడో లెక్కచూచుకునే పద్ధతి ఆచరణలోకి వచ్చింది. ఈవిధంగా ప్రతిసారి సరుకుల మారకం జరిగినపుడల్లా డబ్బు అవసరంలేకుండానే వ్యాపారం సాగించేపద్ధతులు అమలు లోకి వచ్చాయి. చివరకు లెక్కచూచి బాకీలు తేల్చుకుని

మిగిలిపోయిన బాకీ తీర్చేందుకుమాత్రమే డబ్బు అవసర మౌతుంది.

## బంగారం - విశ్వవ్యాపితంగా గుర్తించబడిన ధనం

ప్రపంచమంతటా సరుకుల మారకం అభివృద్ధి అయ్యాక, వివిధ దేశాల మధ్య సరుకులను కొనడం, అమ్మడం ప్రారంభమయింది. ఈ అంతర్జాతీయ వ్యాపారంలో ఆ యా దేశాల నాణేలకు విలువ లేదు. బంగారం, వెండి కడ్డీలు (Bullion) మాత్రమే అంగీకరించబడతాయి.

ఉదాహరణకు ఇంగ్లండుకు, ఇండియాకు మధ్య సరుకుల వ్యాపారం జరుగుతోంది. సంవత్సరాంతానికి ఇండియా ఇంగ్లండుకు పంపిన సరుకుల ఖరీదు ఎక్కువైతే, ఆ తేడా సొమ్మును ఇంగ్లండు బంగారంరూపంలో ఇండియాకు యివ్వాలి.

## కాగితపు నోట్లు - నోట్ల ముమ్మరం

ఈనాడు బంగారం, వెండి నాణెములకు బదులు కాగితపు నోట్లు యివ్వడం మామూలైంది. కాగితపునోట్లకు స్వతహాగా విలువ అనేది లేదు. వీటిని ఎప్పుడుపడితే అప్పుడు వెండి, బంగారాలలోకి మార్చుకొనడానికి వీలుంటేనే వీటికి విలువ ఉంటుంది. అందువల్ల యెన్ని కాగితపునోట్లు చెలామణిలో ఉంటే, అంత మొత్తమునకు తగినట్లు బంగారంగాని, వెండిగాని నిల్వలో ఉండాలి. దీనినే బంగారపు లేక వెండి నిల్వ (Gold or Silver reserve) అంటారు. అప్పుడే ఆ నోట్ల కొనుగోలుశక్తి స్థిరంగా ఉంటుంది.

కాని ఒకానొకప్పుడు, ముఖ్యంగా యుద్ధకాలంలోను, ఒడుదుడుకు సమయాలలోను ప్రభుత్వాలు చాలా ఎక్కువ నోట్లను అచ్చువేసి చలామణిలో పెడతారు. ఆవిధంగా ధనం విలువ తగ్గిస్తారు. ఉదా : ఇండియాలో 1939 లో 179 కోట్ల రూపాయలనోట్లు చలామణిలో ఉంటే, 1950 నాటికి సరుకుల చలామణి పెద్దగా పెరగకపోయినా, దాదాపు 1400 కోట్ల రూపాయలనోట్లు చలామణిలోకి వచ్చాయి. దీనివల్ల రూపాయి విలువ అదే నిష్పత్తిలో తగ్గిపోతుంది. ఉదా : 100 కలాలు కొనుటకు రు 1000/- కావాలనుకుంటే, ప్రభుత్వం యింకొక రు 1000/- నోట్లను అదనంగా చలామణిలోకి తెచ్చినపుడు, యిదివరకు ఒక్కొక్క కలం రు 10/-కి వస్తుంటే, యిప్పుడు రు 20/- కి ఒక కలం వస్తుంది.

## ధనాన్ని దాచడం (Hoarding)

ధనం ఆకలినిగాని, దాహాన్నిగాని తీర్చలేదు. లోహాల యొక్క ఉపయోగపు విలువను అనుభవించాలనిగాదు, మానవులు ధనాన్ని కోరేది. వ్యాపారం అభివృద్ధి చెందడంవల్ల బంగారాన్ని, వెండిని ఆభరణాలకోసం వినియోగించడంలో ప్రాముఖ్యత తగ్గిపోయింది. విశ్వవ్యాప్తమగు మారకపు విలువ కావడం వలన బంగారానికి ఎగబడడం జరుగుతూంది. దానిని నిల్వ చేయాలనే తహతహ హెచ్చింది. బంగారాన్ని ఎప్పుడైనా ఏ సరుకులోకైనా మార్చుకోవచ్చు గాబట్టే, యితరుల శ్రమవల్ల ఉత్పత్తి అయిన సరుకులపై పెత్తనం చెలాయించగల శక్తి ఉండబట్టే దాని ప్రాముఖ్యత హెచ్చింది.

రైతుకాని, చేతివృత్తి పనివాడుకాని ధనాన్ని దాచుట కవకాశమే లేదు. తమ సరుకమ్మగా వచ్చింది తమ కుటుంబాని కవసరమైన యితర జీవితావసరాలను కొనుక్కోటానికే సరి పోతుంది. కాని బానిస యజమానులు, లేక ఫ్యూడల్ భూస్వాముల విషయంలో అలా కాదు. వీరు తమ బానిసల నుండి లేక వ్యవసాయ బానిసలనుండి పిండిన అదనపు సంపద లతో విందులు, విలాసాలతో తులతూగడమే గాక, వెండి, బంగారాలను విపరీతంగా నిల్వచేసేవారు.

వ్యాపారాభివృద్ధితో ధనదేవతను ఏకాగ్రతతో కొలిచే వర్గమొకటి తయారయింది. వారే వర్తకులు, వ్యాపారస్తులు. బంగారం విశ్వవ్యాప్తమగు మారకపు విలువ గావడంతో "భౌతిక సంపదలకు విశ్వవ్యాప్త ప్రతినిధి" (మార్క్సు) గావ డంతో బంగారం కూడబెట్టాలనే తృష్ణ యెక్కువైంది. ధనం వుంటే దాన్ని ఏ క్షణానైనా ఏ సరుకులోనికైనా మార్చుకో వచ్చు. సరుకును అమ్మకుని ధనంగా మార్చుకోవడం కష్టం గాని, ధనం వెచ్చించి సరుకులుగా మార్చుకోటానికి క్షణం పట్టదు.

ఈనాడు వీలైనంత ఎక్కువ ధనాన్ని కూడబెట్టుటకు లాభాపేక్ష పెట్టుబడిదారులను ప్రోత్సహిస్తూంటుంది. ఐతే యీనాడు ధన్నాన్ని చూస్తూ మురిసిపోయే పెట్టుబడిదారు ఎవ్వడూ వుండడు. కార్మికులను విపరీతంగా దోపిడీచేసి, ఉత్పత్తిని విస్తరింపజేసి, అధికలాభాలు సంపాదించాలని చూస్తాడు. ఐనా ఒకొక్కప్పుడు ఉత్పత్తిని విస్తరింపజేయూ

లంటే చాలా ధన మవసరమవుతుంది. అందువల్ల ధనాన్ని కూడబెట్టడ మవసరమవుతుంది.

## సరుకుల ఇంద్రజాల శక్తి

## (Fetishistic character of commodities)

మానవులు తమ శ్రమను వెచ్చించి సృష్టించిన సరుకుల మారకం అభివృద్ధి అగుటతో సరుకుల మారకం ద్వారా మానవుల మధ్య సంబంధాలు అభివృద్ధి అవుతూ వచ్చాయి. మారకంద్వారానే మానవుల సామాజిక సంబంధాలు పెరిగి, మానవుని వ్యక్తిగత శ్రమ సామాజిక శ్రమలో భాగంగా తయారయింది.

కాని సరుకుల ప్రాబల్యం ఎక్కువైనకొలదీ, మారకపు రూపాలు మారుతున్నకొలదీ, సరుకుల నుత్పత్తి జేసే మానవుల మధ్య నేరుగా సంబంధాలు తగ్గిపోతూ వచ్చాయి. ధనరూపం వచ్చాక యివి పూర్తిగా మరుగున పడ్డాయి. మానవుల మధ్య సంబంధాలుగా గాక, సరుకుల మధ్య సామాజిక సంబంధాలుగా పైకి కనిపిస్తున్నాయి. ఉదా: మాదిగవాని చెప్పులు, దర్జీవాని చొక్కాలు మారకం వేసుకోవాలంటే వా రిద్దరిమధ్య నేరుగా మారకం జరగదు. మార్కెట్‌ద్వారానే జరుగుతుంది. మార్కెట్టులో చెప్పులు, చొక్కాలు ఒకదాని కొకటి ఎదురుగా నిల్చుని బేరాలు సాగిస్తున్నట్లు కనబడుతుంది. ఈ విధంగా పెట్టుబడిదారీ ఉత్పత్తి విధానంలో మానవుల మధ్య ఉండే వుత్పత్తి సంబంధాలు, సరుకుల కదలికగా, సరుకుల మధ్య సంబంధాలుగా కనిపిస్తాయి. సరుకులకు విచిత్రమైన సామాజిక ధర్మా లేర్పడతాయి.

ఉత్పత్తి సంబంధాల నిజస్వరూపం సరుకుల మార్పిడి వెనుక దాగి యుంటుంది.

ఒక సరుకుకు రంగు, బరువు మొదలైన గుణాలున్నట్లుగానే విలువగూడా సహజగుణంగా కనిపిస్తుంది. ఈ విలువ మానవ శ్రమ ఫలితమనే విషయం మరుగున పడిపోతుంది. ఒక వస్తువునుండి వచ్చే వెలుగు కిరణాలు కంటినరంమీద పడి మెదడుకు వస్తురూపాన్ని తెలియజేస్తాయి. కాని యీ కిరణ ప్రసారాన్ని మరచిపోయి మనకంటి నరంతో సంబంధంలేని వస్తువుగానే దానిని చూస్తాము. అలాగే మెదడునుండి అనుభవంద్వారా తలయెత్తిన భావాలు మెదడునుండి దూరమైపోయి దైవికాలుగా తయారయి, ప్రత్యేక అస్తిత్వాన్ని కల్గి యున్నట్లు కనబడుతూ మానవ సమాజంపై తిరిగి తమ ప్రభావాన్ని ప్రసరిస్తాయి. ఇదే విధంగా సరుకులు మానవ శ్రమ జనితాలైనా మానవశ్రమతో సంబంధంలేని ప్రత్యేక అస్తిత్వం కలిగినవాటిలా కనబడతాయి.

ఒక ఉత్పత్తిదారుని అదృష్టమంతా అతని సరుకులపై ఆధారపడి యుంటుంది. తన సరుకులు అమ్ముడుపోతేనే ఉత్పత్తిని కొనసాగించగలుగుతాడు. లేకపోతే దివాళాతీసి నాశన మవుతాడు. రైతు తాను ఉత్పత్తి చేసిన ధాన్యాన్నో, పొగాకునో, పసుపునో, వేరుశనగనో సరసమైన ధరకు అమ్మ కల్గితేనే, తన కవసరమైన జీవితావసరాలను కొనుక్కోగలడు. లేకపోతే మాడిపోవలసివస్తుంది. తన సరుకు అమ్ముడుపోక పోవడానికి కారణమేమిటి? మొత్తం ఆర్థిక జీవితంలో కల్గిన మార్పులే కారణం. ఆర్థిక సంక్షోభం వచ్చివుండవచ్చు.

కాని సాధారణ రైతుకు యీ కారణాలు తెలియవు. ఖర్మ గాబోలునని పొరపాటుపడటం జరుగుతుంది. ఈ విధంగా పెట్టుబడిదారీ సమాజంలో సరుకులు మానవులను శాసించే స్థితికి వచ్చాయి. అందువల్లనే యీ సమాజంలో సరుకులకు ఒక ఇంద్రజాలశక్తి వచ్చింది.

సరుకుల ఉత్పత్తికి సంబంధించిన యీ వైరుధ్యాన్ని, యీ తలక్రిందులైన సత్యాన్ని మార్క్స్ మొట్టమొదట బట్టబయలు చేశారు. సరుకుల మధ్య సంబంధాలనుగాక, మానవుల మధ్య సంబంధాలను గురించి, వర్గసంబంధాలను గురించి ఆలోచించాలనీ, సరుకులకు అధిపతులైన పెట్టుబడిదారీవర్గానికీ, సరుకులను సృష్టించే శ్రామికవర్గానికీ మధ్య గల సంబంధాలను పరిశీలించడం ప్రధానమనీ ఆయన చెప్పారు.



4 వ అధ్యాయము

# పెట్టుబడిదారీ దోపిడీయొక్క రహస్యం

పెట్టుబడిదారీ సమాజంలో ఒక వైపున కొద్దిమంది పెట్టుబడిదారుల చేతులలో అనంతమైన సంపదలు ప్రోగుపడు తూండడం, రెండవవైపు కోట్లకొలది కార్మికులు చాలీచాలని కూలీడబ్బులతో అగచాట్లు పడుతూండడం చూస్తున్నాము. పెట్టుబడిదారులు, "మేము పెట్టుబడి పెట్టినందుకు న్యాయమైన ప్రతిఫలంగా మాకు లాభం వస్తూంది. కార్మికులు ఉత్పత్తి చేస్తున్నందుకు ప్రతిఫలంగా వారికి కూలి గిడుతూంది" అని చెబుతారు. ఐతే పెట్టుబడిదారులు రాను రాను సంపన్నులు గావడానికి, కార్మికులు నిరంతరం బీదరికంతో బాధపడడానికి కారణమేమిటి? అసలు లాభం అంటే ఏమిటి? అది ఎక్కడి నుండి, ఎలా వస్తుంది అనేది పరిశీలిద్దాము.

## లాభాన్నిగూర్చి పెట్టుబడిదారీ సిద్ధాంతాలు

పెట్టుబడిదారీ అర్థశాస్త్రజ్ఞులు లాభాలకు మూల మేమిటో తెల్పకుండా మరుగుపరచేందుకు అనేక తప్పుడు సిద్ధాంతాలను ప్రచారం చేస్తుంటారు.

1. యస్. పి. న్యూమన్, లిట్రాన్సీ, కాండిలాల్ అనే వారు చౌకగా కొని ప్రియంగా అమ్మటద్వారా అంటే కేవలం సరుకుల మారకంద్వారా పెట్టుబడిదారులకు లాభాలు

వస్తున్నాయని వాదించారు. ఆధునిక పెట్టుబడిదారీ సమాజంలో అప్పుడప్పుడు సరుకును చౌకగా కొని, ప్రియంగా అమ్మటద్వారా వ్యక్తిగత పెట్టుబడిదార్లు యెక్కువ లాభం సంపాదించుట కవకాశమున్న మాట నిజమే. కాని మొత్తం పెట్టుబడిదారీవర్గం సంపాదించే విపరీత లాభాలకు మూలం యిది కానేకాదు.

పెట్టుబడిదారీ సమాజంలో సరుకుల మారకంలో ఎక్కువ భాగం పెట్టుబడిదారుల మధ్యనే జరుగుతూంటుంది. ఒక ముడి సరుకును (ముడి యినుము) ఉత్పత్తి చేసే పెట్టుబడిదారు విడిభాగాలను (యినుప ఊచలు, గొట్టాలు) ఉత్పత్తి చేసే ఒక పెట్టుబడిదారుకు తన సరుకమ్మితే, యీ రెండవ పెట్టుబడిదారు పూర్తి సరుకును (సైకిళ్లు) తయారు చేసే పెట్టుబడిదారుకు తన విడిభాగాలను అమ్మినపుడు, ఆ మూడవ పెట్టుబడిదారు తన సైకిళ్ళను హోల్‌సేల్ వర్తకుని కమ్మితే, అతడు చిల్లర వర్తకుని కమ్ముతాడు. వీరుగాక రంగంలో అనేకమంది కంట్రాక్టర్లు వుండవచ్చు. సరుకు యింత మంది పెట్టుబడిదారుల చేతులు మారినపుడు ఏ ఒక్క పెట్టుబడిదారైనా చౌకగా కొని, ప్రియంగా అమ్మకలిగితే, మరొక పెట్టుబడిదారు నష్టపోతున్నాడనేది స్పష్టం. మొత్తం పెట్టుబడిదారీవర్గానికి దీనివల్ల ప్రయోజనం లేదనేది స్పష్టమే.

పరస్పరం పెట్టుబడిదారుల మధ్యనే గాక, పెట్టుబడిదారులు, రైతులు తదితరఉత్పత్తిదారులమధ్య వ్యాపారం జరుగుతూంటుంది. ఉదాహరణకు అమెరికా, ఇంగ్లండు, యూరోపియన్ దేశాలలోని గుత్తపెట్టుబడిదారులు ముడిపదార్థాల

నుత్పత్తిచేసే వలస ప్రైతాంగంనుండి సరుకులను చౌకధరలకు కొని, లాభాలు సంపాదించడం చూస్తున్నాము. ఇచట కొద్దిపాటి బలమైన గుత్తసంస్థలు పోటీలు లేకుండాచేసుకొని, చిన్న ఉత్పత్తిదారులను దోపిడీచేయుటద్వారా ప్రత్యేక లాభాలను సంపాదిస్తున్న మాట నిజమే. కాని మొత్తం పెట్టుబడిదారీ సమాజంలో వచ్చే లాభాలకు మూలం యిది కాదు.

పోతే వినిమయదారులకు సరుకు లమ్మడంద్వారా లాభం వస్తుందా ? ఒక సరుకుయొక్క ఖరీదు ఆ సరుకుయొక్క అసలు విలువకు అటూయిటూ వూగిసలాడుతూంటుందని చూచాము. అలాంటపుడు అందులోనూ పోటీ విపరీతంగా వుండే పెట్టుబడిదారీవిధానంలో వినిమయదారులకు సరుకు లమ్మడంద్వారానే లాభం రాదనేది స్పష్టం.

కాబట్టి మొత్తంగా చూచినపుడు, పెట్టుబడిదారీ సమాజంలో లాభం, చౌకగా కొని ప్రియంగా అమ్మటద్వారా రావడం లేదనేది రుజువవుతుంది.

2. మార్షల్, పిగూ అనే పెట్టుబడిదారీ అర్థశాస్త్రజ్ఞులు వాంఛావిసర్జన సిద్ధాంతము లేక స్వయం దారిద్ర్య సిద్ధాంతం అనే మరొక సిద్ధాంతాన్ని లేవదీశారు. పెట్టుబడిదారు తనకు లభించిన వాటాను తన వాంఛలకొరకై దుబారాగా ఖర్చుపెట్టకుండా, పొదుపుగా వాడుకొని నిల్వచేస్తాడనీ, ఈ నిల్వచేస్తున్నదే లాభం అనీ వీరి వాదన. వాంఛలను విసర్జించే పెట్టుబడిదారులెవరైనా వున్నారా ? వాంఛావిసర్జనే లాభాలకు మూలమైతే ప్రతి పిసినిగొట్టూ కోటికి పడగలెత్తేవాడే !

3. ప్రయత్నం - నిరీక్షణ : కార్మికుడు ఉత్పత్తికై ప్రయత్నిస్తున్నాడు. తన్మూలంగా కూలిని పొందుతున్నాడు. ధనం దాచుకుని నిరీక్షించడంద్వారా పెట్టుబడిదారుకు లాభం వస్తుంది అని యీ సిద్ధాంతం చెబుతుంది. ఐతే రూ. 1000/- పెట్టెలో దాచి, నిరీక్షిస్తూ కూర్చుంటే అవి పిల్లలు పెట్టి రూ. 1100/- అవుతాయా? పెట్టుబడిని చలామణిలో పెట్టినపుడే అది వ్యాప్తిచెందుతుంది. కాబట్టి యీ సిద్ధాంతంకూడా హాస్యాస్పదమైనదే.

లాభాలకు మూలమేమిటో తెల్సుకోవాలంటే మార్కెట్ రంగాన్ని వదలిపెట్టి ఫ్యాక్టరీలో ప్రవేశించి ఉత్పత్తి క్రమాన్ని పరిశీలించవలసియుంటుంది.

పెట్టుబడిదారీ ఉత్పత్తియొక్క చలనక్రమం : ఉత్పత్తి కుటీర పరిశ్రమలనుండి పెట్టుబడిదారీవిధానంలోకి మారుటలో ధనం ప్రముఖపాత్ర వహిస్తుందని తెలుసుకున్నాం. సాధారణ సరుకుల మారకవిధానంలో ధనం మారకపు సాధనంగామాత్రమే పనిచేస్తుంది. సరుకును అమ్మి ధనం సేకరించి తిరిగి సరుకు కొనడం జరుగుతుంది. దీనినే గుర్తుల రూపంలో చెప్పాలంటే - స - ధ - స ( స = సరుకు; ధ = ధనం,) రూపంలో నడుస్తుంది.

కాని పెట్టుబడిదారీవిధానంలో యీ క్రమం తలక్రిందులౌతుంది. పెట్టుబడిదారు ధనంతో ప్రారంభిస్తాడు. ఫ్యాక్టరీ, భవనాలు, యంత్రాలు, ముడిపదార్థాలు, కార్మికుని శ్రమశక్తి- వీటిని కొని, నూతన సరుకుల నుత్పత్తి చేస్తాడు. ఈ నూతన సరుకుల నమ్మి, తిరిగి ధనం సంపాదిస్తాడు. నిరంతరం యిదే

క్రమం కొనసాగిస్తూంటాడు. ఈ విధంగా పెట్టుబడియొక్క చలనక్రమంలో ప్రారంభస్థానం, గమ్యస్థానంకూడ ధనమే. గుర్తులలో చెప్పాలంటే ధ – స – ధ క్రమంలో ఉంటుంది. ఐతే ఈ క్రమంలో మొదట పెట్టుబడి పెట్టిన ధనమూ, చివర సంపాదించే ధనమూ ఒక్కటే అయినపుడు, పెట్టుబడి పెట్టే పిచ్చివాడెవడూ వుండడు. ఎక్కువ ధనాన్ని సంపాదించగలిగితేనే యీ క్రమాన్ని కొనసాగిస్తాడు. కాబట్టి యీ క్రమాన్ని గుర్తులలో చెప్పాలంటే నిజానికి యీ క్రింది విధంగా ఉంటుంది.
ధ – స – ధ–' (ధ–' = ధ + అదనపు ధనము.)

ధ, ధ–' ఎలా అయింది, ధనం అదనపు ధనాన్ని ఎలా సంపాదించింది, ఈ అదనపు ధనం, అంటే లాభం ఎక్కడ నుంచి వచ్చింది అనేదే సమస్య.

సరుకుయొక్క విలువ: సరుకు విలువలో మూడు భాగాలుంటాయి. ఫ్యాక్టరీ, భవనాలు, యంత్రాలు మొదటి భాగం. ఇవి చాలాకాల ముంటాయి. నెమ్మదిగా అరుగుతూ, శిథిల మవుతాయి. పెట్టుబడిదారు వీటి అరుగు తరుగుల విలువను "డిప్రీసియేషన్" అనే పేరుతో క్రొత్తసరుకుల విలువలో చేరుస్తాడు. ఉదా: భవనం 50 ఏళ్ళు పనిచేస్తుందంటే దాని మొత్తం విలువలో 1/50 వ వంతున్నూ, యంత్రం 20 సంవత్సరాలు పనిచేస్తుందంటే దానిమొత్తం విలువలో 1/20 వ వంతున్నూ మొత్తం ఉత్పత్తయిన సరుకుల విలువలో చేరుస్తాడు.

క్రొత్త సరుకులను సృష్టించుట కవసరమైన ముడి పదార్థాలు, బొగ్గు, చమురు లేక విద్యుచ్ఛక్తి, వగైరాలు

రెండవభాగం. ఇవి ఎప్పటికప్పుడే ఖర్చు అవుతాయి. వీటియొక్క విలువనుకూడా పెట్టుబడిదారు క్రొత్త సరుకుల విలువలో ఉత్పత్తి ఖర్చులు (Manufacturing expenses) అనేపేరుతోనో లేక ముడి పదార్థాల ఖర్చులనే పేరుతోనో చేరుస్తాడు.

పోతే కార్మికులు యంత్రాన్ని వుపయోగించి ముడి పదార్థాలను క్రొత్త సరుకులుగా రూపొందించుటద్వారా క్రొత్తసరుకుకు చేర్చిన విలువ మూడవభాగం.

ఈ మూడుభాగాలు కలిపి సరుకుయొక్క విలువ అవుతాయి. పైనచెప్పినట్లు భవనాలు, యంత్రాలు, ముడి పదార్థాలు, బొగ్గు, చమురు వగైరాల విలువ యథాతథంగా కొత్త సరుకుల విలువలో చేరిపోగా, మిగిలినది కార్మికులు సమకూర్చిన విలువ భాగం. ఈ విలువభాగంలో కార్మికులకు కూలి యివ్వగాకూడా, పెట్టుబడిదారుకు కొంతవిలువ మిగు ల్తుంది. కాబట్టి కార్మికులు సృష్టించే నూతన విలువ వారికిచ్చే కూలికన్న ఎక్కువే ననేది స్పష్టమే కదా.

కార్మికుల కిచ్చే కూలి వారి శ్రమయొక్క వెలయే (విలువయొక్క ధనరూపం) నని పెట్టుబడిదారులు చెబుతారు. కార్మికుల శ్రమయొక్క విలువ ఎంత ? వారు సృష్టించిన నూతన విలువే వారి శ్రమయొక్క విలువ. అలాంటపుడు అదంతా కూలిక్రింద యిచ్చేస్తున్నారా ? ఇస్తే పెట్టుబడిదారు కేమి మిగులుతుంది ?

కాబట్టి కార్మికుడు పెట్టుబడిదారుకు అమ్మేకునేది దేనిని-శ్రమనా లేక మరిదేనినైనానా-అనేది లోతుగా పరిశీలించాలి.

## శ్రమ శక్తి - శ్రమ

కార్మికుడు పెట్టుబడిదారు కొలువులో చేరేటపుడు కొంత కూలీకి ఒక గంటో, ఒక రోజో, ఒక వారమో, ఒక నెలో పనిచేయుటకు కుదురుతాడు. ఇచట కార్మికుడు అమ్ముకునేది తన శ్రమనా? తను శ్రమ చేయకముందే, సరుకులను ఉత్పత్తి చేయకముందే, తన శ్రమద్వారా సృష్టించిన నూతన విలువ ఎంతో తెలియకముందే అమ్ముకుంటున్నాడుకదా? అలాంటపుడు శ్రమను అమ్ముకుంటున్నాడనడం పొరపాటు. ఐతే కార్మికుడు దేని నమ్ముతున్నాడు, పెట్టుబడిదారు దేనిని కొంటున్నాడు?

"ప్రతి మానవునిలోను మానసికంగాను, శారీరకంగాను పనిచేయగల సామర్థ్యం ఒకటి వుంటుంది. ఏదైనా ఒక వుప యోగపు విలువను తయారుచేయాలంటే యీ మానసిక శారీరక సామర్థ్యాన్ని ఉపయోగించవలసియుంటుంది. ఇలా ఉపయోగించగల మానసిక, శారీరక సామర్థ్యపు మొత్తాన్నే శ్రమశక్తి అంటాము." (మార్క్స్- కాపిటల్ నుండి)

కార్మికుడు పెట్టుబడిదారు కొలువులో చేరేటపుడు ఒక గంటో, ఒకరోజో, ఒకవారమో, ఒక నెలో తన యీ సామర్థ్యాన్ని, శ్రమశక్తిని అమ్ముకుంటున్నాడన్న మాట. అంతేగాని శ్రమ నమ్ముకోవడంలేదు. తాను శ్రమద్వారా సరుకులలో చేర్చిన నూతనవిలువ నమ్ముకోవడంలేదు. సరుకులో నూతన విలువను చేర్చుటకు వెచ్చించిన శ్రమకు, కూలికి అమ్ముకునే శ్రమశక్తికి మధ్యగల వ్యత్యాసాన్ని గమనించడం చాలా ముఖ్యం.

శ్రమశక్తియొక్క విలువ : కార్మికుడు పెట్టుబడిదారుకు తన శ్రమశక్తి నమ్ముకుంటాడు. కాబట్టి శ్రమశక్తికూడా పెట్టుబడిదారీ విధానంలో ఒక సరుకుగా తయారవుతుంది. ఒక సరుకుయొక్క విలువ దాని నుత్పత్తిచేయుట కవసరమైన శ్రమకాలాన్నిబట్టి నిర్ణయింపబడుతుందని పైన చూచాము. శ్రమశక్తి అనే సరుకుయొక్క విలువకూడా దాని నుత్పత్తిచేయుట కవసరమైన శ్రమకాలాన్నిబట్టి నిర్ణయింపబడుతుందన్న మాట.

శ్రమశక్తి సజీవుడైన మానవునిలోనే ఉంటుంది. మానవుడు జీవించియుండాలంటే తిండి, బట్ట, యిల్లు వగైరా జీవితావసరాలుండాలి. ఐతే మానవుడు ఎప్పుడో వొకసారి నశిస్తాడు. అతనితోపాటే అతని శ్రమశక్తి నశిస్తుంది. అందువలన శ్రమశక్తి ఎల్లపుడూ ఉండాలంటే కార్మికుల సంతాన సృష్టి జరుగుతుండాలి. అంటే కార్మికునితోపాటు, ఆతని కుటుంబానికికూడా జీవితావసరా లున్ననాడే శ్రమశక్తి నిలిచియుంటుంది. కాబట్టి శ్రమశక్తియొక్క విలువ కార్మికునియొక్క, అతని కుటుంబంయొక్క జీవితావసరాలైన తిండి, బట్ట, యిల్లు మొదలైన సరుకుల విలువకు (ఈ సరుకులలో యిమిడియున్న శ్రమకాలానికి) సరిసమానంగా వుంటుంది.

ఐతే కొన్ని పరిస్థితులనుబట్టి శ్రమశక్తియొక్క విలువలో తేడా లుంటుంటాయి. చేసే పనినిబట్టి అవసరమైన ఆహార పదార్థాలు, బట్టలు వగైరాల మొత్తం మారుతుంటాయి. కొన్ని పనులకు నిపుణత అవసరం. నిపుణత సంపాదించేకాలంలో కార్మికుడు జీవించుటకు, తదితర ఖర్చులకు కొంత ఖర్చవుతుంది. ఈ ఖర్చులన్నీ అతని శ్రమశక్తియొక్క విలువలో చేర

వలసియుంటుంది. కార్మికుని సహజసిద్ధమైన కోర్కెలు, అవసరాలు, తిండి, బట్టలు, యిళ్ళు వగైరా తన దేశంయొక్క వాతావరణాన్ని బట్టి, నైసర్గిక పరిస్థితులను బట్టి మారుతుంటాయి. ఉదా:- చలిదేశాలలో వున్నిబట్ట లుంటేగాని బ్రతుకలేరు. వేడిదేశాలలో యివి అక్కరలేదు. అంతే కాదు. కార్మికునియొక్క జీవితావసరాలు, సౌకర్యాలు వగైరాలు ఆయాదేశాల చారిత్రకాభివృద్ధినిబట్టి, నాకరికతాభివృద్ధినిబట్టి ఆచారాలు, అవసరాలనుబట్టి ఉంటాయి.

పెట్టుబడిదారీ సమాజంలో ఎల్లప్పుడూ నిరుద్యోగులైన కార్మికు లుంటూనేవుంటారు (వివరణ తరువాత అధ్యాయంలో వస్తుంది). వీరి నుపయోగించి పెట్టుబడిదారులు సాధారణంగా కూలి శ్రమశక్తి విలువను దాటి పెరగకుండా చూడ కలుగుతారు.

## అదనపు విలువ

శ్రమశక్తి అనే సరుకు ఒక ప్రత్యేక లక్షణం గల సరుకు. ఈ సరుకు తన విలువకన్న ఎక్కువ విలువను సృష్టించగలుగుతుందనే విషయం పైన చూచాము. దీని నర్థంచేసుకున్నామంటే లాభాలయొక్క రహస్యం తెలిసిపోతుంది. కార్మికుడు సృష్టించే విలువకూ, అతని శ్రమశక్తి విలువకూ మధ్యగల తేడాయే లాభం. ఈ విధంగా కార్మికుడు తన శ్రమశక్తి విలువను మించి ఉత్పత్తి చేసే విలువనే అదనపు విలువ అంటాం. ఈ అదనపు విలువయే లాభం.

ఒక ఉదాహరణ తీసుకుందాం. 1952 జూన్ మాసంతో అంతమైన అర్థ సంవత్సరంలో చిట్టివలస జూట్ మిల్ యజమానుల లెఖ్ఖలప్రకారం :

సరుకుల అమ్మకంద్వారా
జమ రు. 1,30,53,180

యంత్రాలు, భవనాల అరుగుదలక్రింద

| | | | |
|---|---|---|---|
| | ఖర్చు | రు. | 1,10,000 |
| ముడిపదార్థాలు వగైరాల | ఖర్చు | రు. | 1,03,81,835 |
| జీతాల బిల్లు | | రు. | 11,03,725 |

జమ : రు. 1,30,53,180 — ఖర్చు : 1,15,95,550

అదనపు విలువ = 1,30,53,180 — 1,15,95,550

= 14,57,630 రూపాయలు

కార్మికులు నూతనంగా సృష్టించిన విలువ మొత్తం 11,03,725+14,57,630 = 25,61,355 రూపాయలు. దీనిలో కార్మికులకు కూలిక్రింద యిచ్చిన భాగం 11,03,725 రూపాయలుమాత్రమే. కార్మికుడు సృష్టించిన విలువలో ఒకభాగం మాత్రమే కార్మికునికి కూలిరూపంలో యివ్వబడింది. రెండవ భాగం పెట్టుబడిదారు లాభంక్రింద తీసుకుంటున్నాడు. కాబట్టి కార్మికుని పనిదినంలో రెండు భాగా లున్నాయి. తన స్వంతానికి పనిచేసేభాగం, పెట్టుబడిదారుకు లాభం చేకూర్చిపెట్టే భాగం (అంటే కార్మికుడు ఉచితంగా పనిచేసేభాగం). పై ఉదాహరణలో కార్మికులు తమకోసం, పెట్టుబడిదారుకోసం చేసేపని 11,03,725 : 14,57,630 అంటే ఉజ్జాయింపుగా

3½ : 4½ నిష్పత్తిలో ఉంటుంది. అంటే ప్రతి కార్మికుడు రోజుకు చేసే 8 గంటల పనిలోను 3½ గంటలు తన జీవితావసరాలను సంపాదించుకొనుటకు శ్రమచేస్తాడు. దీనినే అవసరశ్రమ అంటారు. మిగిలిన 4½ గంటలలో పెట్టుబడిదారుకు అదనపు విలువను సృష్టించి పెడతాడు. దీనినే అదనపు శ్రమ అంటారు. కాబట్టి లేబర్ (కార్మిక) మార్కెట్ ఎలావున్నప్పటికీ పెట్టుబడి దారుకు ఎంతో కొంత లాభం రాకతప్పదు.

మార్క్సుయొక్క అదనపు విలువ సిద్ధాంతం పెట్టుబడి దార్ల దోపిడీ రహస్యాన్ని నగ్నంగా బయటపెడుతూంది. మార్క్సిస్టు ఆర్థిక సిద్ధాంతాలకు కీలకమంతా యీ అదనపు విలువ సిద్ధాంతంలోనే వున్నది. కనుకనే పెట్టుబడిదారీ అర్థ శాస్త్రజ్ఞులు ఆయన అదనపు విలువ సిద్ధాంతాన్ని తప్పని రుజువుచేయుటకు తాపత్రయపడుతూంటారు. పదే పదే విమర్శిస్తుంటారు. కాబట్టి యీ సిద్ధాంతాలను మార్క్సిస్టులు ఎట్టి పరిస్థితులలోను వికృతం కానీయకూడదు.

అదనపు శ్రమఫలితాల్ని దోపిడీచేయడం అటు ఆదిమ కమ్యూనిస్టు సమాజం, యిటు సోషలిస్టు సమాజం మినహా యిస్తే, మిగతా అన్ని సమాజాల్లోనూ వున్నది. పురాతన మానవులు ప్రకృతితో పోరాడి అతికష్టంమీద తమ జీవనా ధారాన్ని సంపాదించుకొంటున్నప్పుడు వారి మధ్య వర్గ భేదాలు పొడచూపలేదు. బానిస, వ్యావసాయిక బానిస విధానంలో సామాన్య ఉత్పత్తివిధానంమాత్రమే వుండడం వల్లనూ, యజమానుల, భూస్వాముల కోర్కెలకు ఒక పరిమితి ఉండుటవల్లనూ, మార్కెట్ విస్తరించకపోవుటవల్లనూ

అదనపు శ్రమదోపిడి కొక పరిమితి వుండేది. కాని పెట్టుబడిదారీ సమాజంలో దీని కెట్టి పరిమితి లేదు. ఉత్పత్తి, పునరుత్పత్తి క్రమంలో అదనపు విలువ పునః పునః సృష్టించబడుతుంది. కార్మికుని పీల్చి పిప్పిచేయుటకు పెట్టుబడిదారు యెన్ని పైశాచిక పద్ధతులనైనా అవలంబిస్తాడు.

సోషలిస్టు సమాజంలో పరిశ్రమలపైన యాజమాన్యం కార్మికవర్గానిదే. దోపిడీచేసేవర్గం, దోపిడీచేయబడేవర్గం అనేవి లేవు. అందువల్ల అదనపుశ్రమ అనేదే ఉండదు. అయితే కార్మికులు అవసరశ్రమకాలంకన్నా కొంచెం ఎక్కువే పని చేస్తారు. వారు యీ విధంగా సృష్టించే అదనపు వస్తు సముదాయమంతా సోషలిస్టు పరిశ్రమల అభివృద్ధికీ, తమ సమిష్టి ప్రయోజనాలకూ, శ్రామిక ప్రభుత్వ రక్షణకూ, అంటే తిరిగి తమకోసమే వినియోగించబడుతుంది. కాబట్టి సోవియట్ దేశంలో అదనపు విలువ సృష్టించబడుతూందనడం అభూత కల్పనమాత్రమే. సోవియట్ యూనియన్‌లో ఉన్నది 'స్టేట్ కాపిటలిజం' అని ట్రాట్స్కీ-స్టులు సాగించే దుష్ప్రచారం తమ విద్రోహ చర్యలను కప్పిపుచ్చుకొనుటకు ముసుగుమాత్రమే.

## అదనపు విలువ రేటు (దోపిడీ నిష్పత్తి)

పెట్టుబడిదారు పెట్టే పెట్టుబడిలో మూడు భాగా లుంటాయని చూచాము. ఫ్యాక్టరీ భవనాలు, యంత్రాలు మొదటి భాగం; ముడిపదార్థాలు, బొగ్గు, చమురు వగైరా రెండవ భాగం; కార్మికుల కూలి మూడవభాగం. ఇందులో మొదటి రెండుభాగాలు నూతన విలువను సృష్టించవని, వాటి విలువలు

యథాతథంగా నూతన సరుకులో చేరిపోతాయని చూచాము. వీటియొక్క విలువలో మార్పు రాదు. అందువల్ల పెట్టుబడి దారుయొక్క యీ భాగాన్ని మార్కు స్థిరపెట్టుబడి అని పిలిచారు. మూడవభాగమైన కార్మికుల కూలిభాగం తన విలువనే కాక, అదనపు విలువనుకూడ సృష్టిస్తుంది. అంటే మార్పు చెందుతుంది. అందువలన యీ భాగాన్ని అస్థిరపెట్టుబడి లేక మార్పుచెందే పెట్టుబడి అని పిలిచాడు.

అదనపు విలువకు, కార్మికులకూలికి అంటే అస్థిరపెట్టుబడికి మధ్యగల నిష్పత్తియే అదనపు విలువరేటు అవుతుంది. దీనినే దోపిడీ నిష్పత్తి అనికూడ అంటారు. గణితంలో చెప్పాలంటే :

$$\text{అదనపు విలువరేటు} = \frac{\text{అదనపు విలువ}}{\text{అస్థిర పెట్టుబడి}}$$

గుర్తులలో చెప్పాలంటే;

$$\frac{\text{అ. వి}}{\text{అస్థి. పె}}$$

పైన యిచ్చిన చిట్టీవలస జూట్‌మిల్లు ఉదాహరణను బట్టి అదనపు విలువ 14,57,630 రూపాయలైతే, అస్థిరపెట్టుబడి 11,03,725 రూపాయలు. కాబట్టి యిచట

$$\text{అదనపు విలువరేటు} = \frac{14,57,630}{11,03,725} \times 100$$
$$= 132\%$$

ఈ అదనపు విలువ రేటు దోపిడీ తీవ్రతను మాత్రమే (Degree of exploitation) తెలియజేస్తుంది. దోపిడీ మొత్తాన్ని తెలియజేయదు. ఉదాహరణకు అదనపుశ్రమ, అవసరశ్రమ 5 : 5 నిష్పత్తిలో ఉన్నపుడు, దోపిడీ పరిమాణం 100% అవుతుంది. అదనపుశ్రమ, అవసరశ్రమల నిష్పత్తి 6 : 6 కు పెరిగినట్లయితే దోపిడి పరిమాణం 100% వున్నప్పటికీ మొత్తం దోపిడీమాత్రం 5 గంటలనుండి 6 గంటలకు అంటే యిదివరకటికన్న 20% పెరిగిందన్నమాట.

## అదనపు విలువను హెచ్చుచేయుటకు మార్గాలు

పెట్టుబడిదారు నిరంతరం తన లాభాన్ని పెంచుకోవాలని చూస్తుంటాడు. అందువల్ల తనకు చేతనైన పద్ధతు లన్నింటి ద్వారా కార్మికులు సృష్టించిన విలువలో కార్మికుల భాగం (కూలి) తగ్గించి తనభాగం (అదనపు విలువ) యెక్కువ చేసుకోవాలని ప్రయత్నిస్తూనే వుంటాడు. అంటే దోపిడీ నిష్పత్తి పెంచుటకు కృషి చేస్తూనే వుంటాడు.

పెట్టుబడిదారు అస్థిర పెట్టుబడిని పెంచుటద్వారా, అంటే కార్మికులసంఖ్యను పెంచుటద్వారా అదనపు విలువ మొత్తాన్ని హెచ్చించవచ్చు. 100 మంది కార్మికులవల్ల రూ. 2,500/- అదనపు విలువ వస్తూంటే, 200 మందివలన రూ. 5000/- రావచ్చు. కాని యిందుకు తన ఫ్యాక్టరీని విస్తరింపనైనా చేయాలి; లేదా కొత్త ఫ్యాక్టరీనైనా నిర్మించాలి. పెట్టుబడిదారువద్ద అంత పెట్టుబడిగాని, వుత్పత్తి సాధనాలుగాని వుంటే అలా చేస్తాడు. ఆ అవకాశాలు లేనపుడు

యితర మార్గాలద్వారా ఎక్కువ అదనపు విలువ సంపాదించుటకు ప్రయత్నిస్తాడు.

పనిగంటల పొడిగింపు : అఖండ అదనపు విలువ :

కార్మికుల కూలిని పెంచకుండా పని గంటలను పెంచుట ద్వారా అదనపు విలువను యెక్కువ చేయవచ్చు. ఉదా : రోజులో పనిగంటలు 10 అనుకుందాం. ఇందులో 5 గంటల అవసర శ్రమ, 5 గం|| అదనపు శ్రమ అనుకుందాం.




అవసర శ్రమ 5 గం|| అదనపు శ్రమ 5 గంటలు అవుతుంది. గంటకు 0–8–0 నూతన విలువ సృష్టిస్తున్నాడనుకుంటే మొదటి ఉదాహారణలో రూ. 2–8–0; రెండవ ఉదాహారణలో రూ. 3–8–0 అదనపు విలువ వస్తుందికదా. ఈ విధంగా పనిగంటల పొడిగింపుద్వారా హెచ్చుచేసే అదనపు విలువ అఖండ అదనపు విలువ (absolute surplus Value) అనబడుతుంది.

పారిశ్రామిక పెట్టుబడిదారీ విధానపు మొదటి రోజులలో పెట్టుబడిదారులు సర్వసాధారణంగా పనిగంటలను హెచ్చుచేయడంద్వారానే హెచ్చు అదనపు విలువను గుంజు

టకు ప్రయత్నించేవారు. ఈ దోపిడీని సమర్థిస్తూ ఇంగ్లండులో 1837 లో ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయంలో అర్థశాస్త్రాధ్యాపకుడుగా పనిచేస్తున్న నాసాసీనియర్ అనే ప్రముఖుడు అఖరుగంట సిద్ధాంతాన్ని లేవదీశాడు. బ్రిటిష్ ప్రత్తి మిల్లులలో కార్మికులు రోజుకు పనిచేసే 14-16 గంటలలో ఆఖరు గంటలోమాత్రమే పెట్టుబడిదారుకు లాభం సృష్టించి పెడతారని రుజువుచేయుటకు పూనుకున్నాడు. కాని యీ సిద్ధాంతం తప్పని తరువాత రుజువుచేయబడింది.

మార్క్స్ తన "పెట్టుబడి" అనే గ్రంథంలో ఆరోజులలో పెట్టుబడిదారులు నిర్దాక్షిణ్యంగా పిల్లలు, స్త్రీలు, పురుషులు అనే విచక్షణ లేకుండా రాత్రింబగళ్ళు, రోజుకు 18-20 గంటలవరకుకూడా యెలా పనిచేయించేవారో అనేక ఉదాహరణలు యిచ్చారు. ఇంగ్లండులో చార్టిస్టు ఉద్యమం వచ్చేవరకు యిలాగే కొనసాగింది. మెక్సికో బంగారపు గనులలో రోజుకు 18-20 గంటలవరకు పనిచేయించేవారు. చాంగ్-కై-షేక్ పరిపాలనా కాలంలో చైనాలో చాలా పరిశ్రమలలో 16-18 గంటలవరకు పనిచేయించేవారు. ఫాసిస్టు జపాన్‌లో బాలబాలికలు రాత్రిపూటకూడ ఫ్యాక్టరీలలోనే జీవించాల్సి వచ్చేది.

భారతదేశంలో 1852-80 వరకు కార్మికులచేత ఫ్యాక్టరీలలో రోజుకు 12 నుండి 23 గంటలవరకు పనిచేయించుకునేవారు. ఆదివారం శెలవులు లేవు. 5, 6 సంవత్సరాల పిల్లలచేత కూడా పెద్దవాళ్ళతో సమానంగా పనిచేయించుకునేవారు. 1905 – 7 లలో వచ్చిన సంక్షోభానంతరం బొంబాయి

కార్మికులు పనిగంటలు తగ్గించాలని సమ్మె చేస్తే, 1911 లో రోజుకు 11 గంటలు పని నిర్ణయిస్తూ శాసనం వచ్చింది. కాని వర్గచైతన్యంతో కూడిన కార్మికోద్యమం లేకపోవుటవలన శాసనాలన్నీ కాగితాలమీదే వుండిపోయాయి. తిరిగి 1920 సమ్మెపోరాటాలద్వారా రోజుకు 10 గంటల పనిని సాధించారు. 1930-34 పోరాటాలు 9 గంటల పనిని సాధించాయి. యుద్ధానంతర పోరాటవెల్లువను గమనించిన కాంగ్రెసు ప్రభుత్వం 1946 లో రోజుకు 8 గంటల పని నిర్ణయించింది.

ఇదే విధంగా ప్రపంచమంతటా కార్మికవర్గ పోరాటాల ఫలితంగానే రోజుకు 8 గంటల పనిని సాధించుకోవడం జరిగింది.

మనం దేశంలో యీనాటికీ వ్యవసాయ కూలీలు, పాలేళ్లు, చిన్న చిన్న పరిశ్రమలలోని కార్మికులు పనిగంటల నియమం లేకుండానే దోచుకోబడుతున్నారు.

కార్మికుల్లో వర్గచైతన్యం ఎక్కువై, పోరాటాలద్వారా తక్కువ పనిగంటలను సాధించినకొలదీ, (అంతేకాదు. పని గంటలు తక్కువైనా ఉత్పత్తి తగ్గదని ఆచరణలో రుజువయింది కూడా) పెట్టుబడిదారులు తక్కువ పనిగంటలలోనే (8 - 10 గంటలలోనే) కూలిని పెంచకుండా, ఎక్కువ పని చేయించుకుని అంటే కార్మికుని శ్రమను తీవ్రతరం చేయుటద్వారా (Intensity of labour) అదనపు విలువభాగాన్ని పెంచుకునే పద్ధతులు (ముఖ్యంగా 19 వ శతాబ్దం మధ్యభాగంనుండి అవలంబిస్తూ వచ్చారు.

శ్రమతీవ్రతను పెంచుటకనేకపద్ధతులున్నాయి. అందులో (1) కార్మికులపైన అజమాయిషీని (supervision) కఠినతరం

చేయుట, ఖచ్చితంగా క్రమశిక్షణ నమలు పరచుట ఒంటికి, దొడ్డికి వెళ్ళకుండా నిర్బంధించుట, భోజన కాలాన్ని తగ్గించుట, ఆలస్యంగా వచ్చినా, పని మానివేసినా జరిమానాలు వేయుట ద్వారా కార్మికులచేత యెక్కువ పని చేయించుతూంటారు.

2. కూలియిచ్చే పద్ధతులు : కంట్రాక్టు కూలివిధానం. ఉత్పత్తిని బట్టి కూలి అనేసరికి కార్మికులు సహజంగా కష్టపడి యెక్కువ సరుకు ఉత్పత్తిచేస్తారు. పైకి చూచినట్లయితే ఉత్పత్తి పెరిగిన కొలదీ కూలి పెరుగుతున్నట్లు కనబడుతుంది. కాని నిజానికి యిలా కొద్దికాలంమాత్రమే జరుగుతుంది. ఆచరణలో గంటల కూలి నాధారంచేసుకుని నిర్ణయించబడిన రేటు ప్రకారమే కంట్రాక్టు కూలిరేటు నిర్ణయించబడుతూంటుందని కార్మికులు గ్రహించగలరు. ఉత్పత్తిరేటు పెరగగానే, కంట్రాక్టు కూలిరేట్లు తగ్గించబడుతూంటాయి. అంతేకాదు. ఒకవేళ తాత్కాలికంగా గంటల కూలికన్నా, కంట్రాక్టు కూలి విధానం వలన కార్మికునికి యెక్కువ లభించినా, ఆ పెరుగుదల కార్మికుని శ్రమ తీవ్రత కనుగుణ్యంగా వుండదు. కార్మికులు చాలాయెక్కువ అదనపు విలువను సృష్టిస్తారు. అందులో కొద్దిగామాత్రమే తమకు గిడుతుంది. మిగతాదంతా పెట్టుబడిదారు కాజేస్తాడు.

3. కన్వేయర్ బెల్టు-యంత్రవేగాన్ని పెంచే తదితర పద్ధతులు:- దీనినే ఫోర్డుపద్ధతి అంటారు. ఈ విధానాన్ని ఆధునిక ఫ్యాక్టరీ నిర్మాణంలో చాలా పరిశ్రమలలో ప్రవేశపెడుతున్నారు. ఈ విధానంలో ఒక బెల్టు తిరుగుతూంటుంది. ఒక్కొక్కచోట నిర్ణీత టైముప్రకారం నిలచి యుంటుంది.

వివిధ భాగాల నమర్చే కార్మికులు అక్కడక్కడ నిల్చుంటారు. బెల్టు ఎవరి దగ్గరకు వస్తే వారు ఆపనిని పూర్తిచేయాలి. బెల్టు వేగాన్నిబట్టి పని నడవాలి. కార్మికుడు కొంచెంసేపుకూడ విలంబన చేయకూడదు.

ఇలాంటిదే టైలర్ విధానం మరొకటి: శ్రమను శాస్త్రీయపద్ధతులపై వినియోగించే విధాన మిది. ఎవరు ఎక్కడ ఉండాలి, ఏ పనిముట్టు ఎక్కడ వుండాలి, కార్మికుడు ఎంత వేగంగాను, సులువుగాను కాళ్ళు చేతులు కదల్చగలడు, యివన్నీ నిపుణులు నిర్ణయించి ఆప్రకారం ఉత్పత్తిచేయిస్తారు.

ఈ పద్ధతులను మన భారతదేశంలోకూడా అమలు పరుచుటకు తీవ్రప్రయత్నం జరుగుతూంది.

4. బుజ్జగింపు పద్ధతులు: (Cajoling methods) ట్రేడ్ యూనియన్ ఉద్యమం బలపడి కార్మికుల రాజకీయ శక్తి యినుమడించినకొలది, పెట్టుబడిదారులు నిర్బంధపద్ధతులలో దోపిడీచేయడం కష్టం. అందువల్ల కార్మికులకు లాభాలను పంపకం చేస్తామని (Profit sharing), పెన్షన్ స్కీములని, ఉత్పత్తి బోనస్‌లని ఎరచూపించి, ఎక్కువపని చేయించుకో చూస్తుంటారు. (వీటిని గురించి వివరాలు తరువాత అధ్యాయంలో చదువగలరు.)

5. చెమటోడ్చి పనిచేయించుట (Sweating labour system): ఇంగ్లండులో సూదులు, లేసులు తయారు చేసే పరిశ్రమలలోను, మన దేశంలో మైకా, తోళ్ళు, బీడీలు, తేయాకు తోటలు, పొగాకు వగైరా పరిశ్రమలలోను యీ పద్ధతి యింకా వున్నది. దీనిప్రకారం ఫలానాసంఖ్య లేక

తూకంగల వస్తువులు తయారుచేస్తే యింతకూలి యివ్వబడు తుందని పెట్టుబడిదారు అంటాడు. కార్మికకుటుంబాలు తమ యిండ్లవద్దనే యీపని చేయవచ్చు. కూలి చాలా తక్కువ ఉండుటవలన రాత్రింబగళ్ళు కుటుంబమంతా కష్టపడితేగాని జీవితం గడవదు. ఈవిధంగా కండలను కరగించే పద్ధతిగాన 'చెమటోడ్చే పద్ధతి' అని పేరుపెట్టారు.

## తారతమ్యపు అదనపు విలువ (Relative Surplus Value)

పనిగంటలను పొడిగించుటద్వారాను, శ్రమ తీవ్రతను పెంచుటద్వారాను కార్మికుడు సృష్టించే విలువలో అదనపు విలువ భాగాన్ని ప్రత్యక్షంగా హెచ్చుచేసుకోవడం జరుగు తుందని తెలుసుకున్నాము. ఇతర పద్ధతులద్వారాకూడా అద నపు విలువను పెంచవచ్చు.

రోజులో పనిగంటలు 10 అనుకోండి. దానిలో 8 గంటలు అవసర శ్రమ. 2 గంటలు అదనపు శ్రమ అను కోండి.




పనిగంటలు, శ్రమ తీవ్రత స్థిరంగా వుంటూనే అవసర శ్రమ భాగాన్ని తగ్గించినట్లయితే, అదనపు శ్రమభాగం పెరిగి అదనపు విలువ పెరుగుతుంది. పై బొమ్మలో అవసర శ్రమను క ఖ నుండి (8 గం॥నుండి) క ఖ'కు (7 గం॥కు) తగ్గించగలిగితే అదనపు శ్రమ 2 గంటలనుండి 3 గంటలకు పెరుగుతుందిగదా.

ఐతే పనిగంటలు, శ్రమ తీవ్రత స్థిరంగా వుంటూనే అవసర శ్రమ తగ్గించేందుకు మార్గాలేమిటి ?

1. ప్రత్యక్షంగా కార్మికుల కూలిని తగ్గించడం మొదటి పద్ధతి. వీలైనపుడు అల్లా కార్మికులపైన పెట్టుబడిదారులు దాడి చేస్తూనేవుంటారు. కాని కూలిని ఒక పరిమితి దాటి తగ్గించడం సాధ్యంగాదు. కార్మికుడు పనిచేయగలిగియుండాలంటే కొన్ని కనీస జీవితావసరా లవసరంగదా.

2. ఇతర పద్ధతులద్వారాకూడా కూలితో పోల్చి నపుడు, తారతమ్యంగా అదనపు విలువను హెచ్చుచేసుకో వచ్చు. ఉత్పత్తి పద్ధతులలో అభివృద్ధి జరిగి, కార్మికునియొక్క ఉత్పత్తిశక్తి పెరిగినట్లయితే తారతమ్యంగా కూలికన్నా అద నపు విలువ పెరుగుతుంది. కార్మికుల జీవితావసర సరుకుల విలువలు ఏకారణంచేతనైనా తక్కువైనపుడుకూడ కూలిభాగం తగ్గి అదనపు విలువభాగం ఎక్కువవుతుంది.

కార్మికుని ఉత్పత్తిశక్తి ఎప్పుడు పెరుగుతుంది ? యంత్రాలలోను, ఫాక్టరీ నిర్మాణాలలోను సాంకేతికంగాను అభివృద్ధిని సాధించిననాడు (Rationalisation) కార్మికుల ఉత్పత్తిశక్తి పెరుగుతుంది. ఈవిధంగా ఉత్పత్తి శక్తులలో మార్పులు తెచ్చిన పెట్టుబడిదారుకు సరుకుయొక్క ఉత్పత్తి ఖర్చులు తగ్గుతాయి.

తన సరుకు మామూలు మార్కెట్ విలువకు అమ్ము కుంటే తప్పనిసరిగా ఎక్కువ అదనపు విలువ వస్తుంది. కాని లాభంకోసం పెట్టుబడుదారులమధ్య నిరంతరం తీవ్రమైన పోటీ వుంటూనే వుంటుంది. ఈ అభివృద్ధికరమైన మార్పులను

కొన్నాళ్ళకు అందరు పెట్టుబడిదారులూ ప్రవేశపెడ్తారు. దానితో సరుకులు తమ సామాజిక విలువకే అమ్ముడుపో నారంభిస్తాయి. మొదటి పెట్టుబడిదారుకు కలిగిన ప్రత్యేక అవకాశం పోతుంది. కాబట్టి ఈ పద్ధతివలన తాత్కాలికంగా మాత్రమే అదనపు విలువను ఎక్కువ చేసుకోగల్గుతారు.

ఐతే ఎప్పుడైతే పెట్టుబడిదారులందరూ అభివృద్ధికరమైన మార్పులు ప్రవేశపెడ్తారో అప్పుడు సరుకులయొక్క సామాజిక విలువ తగ్గవచ్చు. ఆవిధంగా శ్రమశక్తి విలువ తగ్గుటకవకాశముంది. ఇలా జరిగిననాడు మొత్తం పెట్టుబడిదారీ వర్గానికి ఎక్కువ అదనపు విలువ రావచ్చు. నిజానికి ఆధునిక పెట్టుబడిదారీ విధానంలో అదనపు విలువ రేటు ఈ విధంగానే పెరుగుతూంది.



5 వ అధ్యాయము

# కూలి - దోపిడీ కొక ముసుగు



పెట్టుబడిదారీ అర్థశాస్త్రజ్ఞులు కూలిని 'శ్రమయొక్క విలువ' అని, 'శ్రమయొక్క వెల' అని నిర్వచిస్తారు. ఆరకంగా చెప్పి, కార్మికుల కళ్ళుగప్పి దోపిడీని కప్పిపుచ్చుతారు. మార్క్స్ యీ నిర్వచనం తప్పని రుజువుచేసి, దానిని పటాపంచలుచేశారు.

కార్మికుడు రోజుకు 12 గంటల చొప్పున పనిచేయుటకు రూ. 3/- కూలికి తన శ్రమశక్తి నమ్ముకున్నాడనుకోండి. అతను 12 గంటల పనిచేస్తే రూ. 6/- విలువను సృష్టిస్తున్నాడనుకోండి. అతని కిచ్చే రూ. 3/- కూలి అతని 6 గంటల శ్రమ వలన సృష్టించబడుతుంది. మిగతా 6 గంటల అదనపు శ్రమ వలన సృష్టించిన విలువ పెట్టుబడిదారుకు పోతుంది. అతని శ్రమశక్తి విలువ రూ. 3/- మాత్రమే. కాని అతని శ్రమ విలువ రూ. 6/-. అయితే పెట్టుబడిదారులు శ్రమశక్తి విలువనే శ్రమ విలువ అనుటవల్ల, కార్మికుని 12 గంటల శ్రమ విలువ 3 రూపాయలే గాబోలుననిపిస్తుంది. కార్మికుడు తన శ్రమకు పూర్తి ప్రతిఫలం గిడుతూందనుకుంటాడు. తన శ్రమలో 6 గంటలకే పూర్తి ప్రతిఫలం గిట్టిందనీ, మిగతా 6 గంటల కాలంలో పెట్టుబడిదారుయొక్క లాభంకొరకు ఊడిగం చేశానని సాధారణ కార్మికు డెలా గ్రహించగలడు.

ఈ విధంగా 'కూలి' అనే ముసుగులో అవసర శ్రమ, అదనపు శ్రమ భాగాలు పనిగంటలలో కనబడనీయకుండ బూర్జువా అర్థశాస్త్రం కార్మికుల కళ్ళు గప్పుతుంది.

పూర్వం బానిస సమాజంలో బానిస చేసే శ్రమఅంతా (భోజనం పోను) అదనపు శ్రమగానే స్పష్టంగా తెలిసేది. వ్యవసాయ బానిసత్వ దశలో ఖచ్చితంగా వ్యవసాయ బానిస తన కుటుంబానికి చేసే శ్రమ ఎంతో, యజమానికి చేసే శ్రమ ఎంతో తెలిసిపోయేది. కాని పెట్టుబడిదారీ విధానంలో కార్మికులు "సర్వ స్వతంత్రులు"గా కనబడడం, తమ శ్రమకు పూర్తి ప్రతిఫలం గిడుతున్నట్లు గోచరించడం చూస్తాము. దోపిడీ రహస్యం తెలియడం కష్టం.

కూలి - పెట్టుబడిదారుల సిద్ధాంతాలు :

(i) జీవితావసరాల వెలనుబట్టి కూలి, లేక నిర్దిష్ట కూలి సూత్రం (Iron Law of wages) – రికార్డో.

రికార్డో తన సూత్రాన్నిలా వివరించాడు : "శ్రమ యొక్క సహజ వెల కార్మికుని కుటుంబానికవసరమైన ఆహారం, తదితర వసతులయొక్క వెలనుబట్టి నిర్ణయింపబడుతుంది. వీటి వెల తగ్గితే కూలి తగ్గుతుంది. హెచ్చితే కూలి హెచ్చుతుంది." అయితే కూలిలో హెచ్చుతగ్గులుండడం రికార్డో గమనించాడు. అందువల్ల సప్లై డిమాండు సూత్రంప్రకారం కార్మికులసంఖ్య ఎక్కువైనపుడు కూలి తగ్గుతుందని, తగ్గినపుడు ఎక్కువవుతుందని వ్రాశాడు. శ్రమయొక్క మార్కెట్ వెల ఎల్లపుడు సహజవెలకు చేరక తప్పదని ఋజువు చేయుటకు

మాల్థూస్‌యొక్క అధిక జనాభా సిద్ధాంతం ఆధారంగా చేసుకుని "కార్మికులు ఎట్టి పరిస్థితులలోనైనా తమ జీవిత నిర్వాహణకు, సంతానాభివృద్ధికి అవసరమైన ఖర్చుకన్న తక్కువగాగాని, ఎక్కువగాగాని కూలిని పొందలేరు" అని తన సూత్రాన్ని ముగించాడు.

(ii) మాల్థూస్‌యొక్క అధిక జనాభా సిద్ధాంతం (1789)

మాల్థూస్ తన సిద్ధాంతాన్ని క్లుప్తంగా యిలా వివరించాడు: (i) జీవితావసర వస్తువుల పరిమితినిబట్టి జనసంఖ్య తప్పకుండ పరిమిత మవుతుంది. (ii) బలవత్తరమైన అవరోధాలుంటే తప్ప, జీవితావసర సరుకు లెక్కువగా లభ్యమైనకొలది జనసంఖ్య పెరుగుతుంది. (iii) జీవితావసర వస్తువుల పరిమితిని మించి జనాభా పెరగగానే, వాటి కనుగుణ్యంగా జనసంఖ్య తిరిగి తగ్గక తప్పదు.

దీనిని సమర్థించుటకుగాను మాల్థూస్ యీ క్రింది అబద్ధాన్ని సృష్టించాడు. ఆహార పదార్థాలఅభివృద్ధికన్న జనసంఖ్య అభివృద్ధి చాలా ఎక్కువగా ఉంటుందట. ప్రతి 25 సంవత్సరాలలోను ఆహార పదార్థాల ఉత్పత్తి 1 : 2 : 3 : 4 : 5 ... (అరిథ్మెటిక్ ప్రోగ్రెషన్) నిష్పత్తిలో పెరిగితే, జనాభా అభివృద్ధి 1 : 2 : 4 : 8 : 16 : 32 ... (జామెట్రిక్ ప్రోగ్రెషన్)లో జరుగుతుందని, అంటే రెండు శతాబ్దాలలో ఆహార పదార్థాలు 9 రెట్లు పెరిగితే, జనాభా 256 రెట్లు పెరుగుతుందని, తత్ఫలితంగా జనాభా ఎక్కువ త్వరగా పెరుగుటవలన ఆహార పదార్థాల కొరత ఏర్పడక తప్పదని యితని వాదన. అందువలన జనాభాను తగ్గించుటకు ప్రయత్నించాలిగాని, కూలి చాలదని

ఆందోళనచేయుటవలన ప్రయోజనముండదని అంటాడు. జనాభానుతగ్గించేందుకు మానవులు స్వయంగా బ్రహ్మచర్యం అవలంబించుట, సంతాననిరోధన అమలుపరచుటద్వారా కృషిచేయాలి. అలా చేయనపుడు ప్రకృతిశక్తులే, ప్లేగు మొదలైన అంటుజాడ్యాలు, కఱవుకాటకాలు, భూకంపాలు జనాభాను తగ్గిస్తాయి. ఈ ప్రకృతి శక్తులకు బలి గాదలచుకోకపోతే మానవులు తమంతట తామే నివారణోపాయాల నవలంబించడ మవసరమని మాల్థూస్ వ్రాశాడు.

డాక్టర్ కాన్య అనే అర్థశాస్త్రిజ్ఞుడు మాల్థూస్ సిద్ధాంతాన్ని కొద్దిగా సవరించి, అవసర జనసంఖ్య సిద్ధాంతాన్ని సృష్టించాడు. ఈ సిద్ధాంతం ప్రకారం పారిశ్రామికాభివృద్ధి యొక్క ఆయాదశలలో ఒక్కొక్కరికి వచ్చే ఆదాయం తగ్గకుండా ఉండాలంటే, జనసంఖ్య కొక నిర్ణీత పరిమితి ఉండాలి. అంతకన్న ఎక్కువవుంటే ఆదాయం తగ్గుతుంది. తక్కువ వుంటే జనసంఖ్య చాలక, ఉత్పత్తి తగ్గి ఆదాయంకూడా తగ్గుతుంది. అందువల్ల ఉత్పత్తి స్థాయినిబట్టి జనసంఖ్యను నిలకడగా ఉంచుటకు కృషిచేయాలని యితడు వివరించాడు.

మాల్థూస్ సిద్ధాంతం తప్పని ఏనాడో రుజువయింది. ఆహారపదార్థాల, జనాభాల అభివృద్ధి నిష్పత్తి అతను చెప్పినట్లు ఉండదు. జనాభా అభివృద్ధితోపాటు యంత్రాభివృద్ధివలన, నూతన ప్రాంతాలలో వ్యవసాయాభివృద్ధి జరుగుటవలన శాస్త్రాభివృద్ధివలన, సహజ సంపదలను కొత్తగా కనిపెట్టుట వలన ఉత్పత్తి నిరంతరం పెరుగుతూనేఉన్నది. సోషలిస్టు దేశాలలో జనాభా అభివృద్ధితోపాటు, జీవనస్థాయి రానురాను

ఎక్కువవుతూండడం చూస్తూనేఉన్నాము. కాబట్టి కార్మికుల కూలి తగ్గిపోతుందన్నా, లేక పెరగడంలేదన్నా ప్రధానకారణం పెట్టుబడిదారుల లాభాపేక్ష, ఉత్పత్తి పరికరాలపైన పెట్టుబడిదారులకు పెత్తనముండడం, జాతీయసంపద పెరుగుతున్నా దానిలో అధికభాగం పెట్టుబడిదారీవర్గం చేతులలో ప్రోగుపడడమేగాని, జనాభా పెరుగుదల కానేకాదు. అలాగే కరువుకాటకాలకు, యుద్ధాలకు కారణం పెట్టుబడిదారుల స్వార్థమే.

పెట్టుబడిదారీవర్గం ఈ బూజుపట్టిపోయిన సిద్ధాంతాన్ని యీనాటికీ ప్రచారంలో పెడుతుంటారు. తమ యుద్ధోన్మాదచర్యలను సమర్థించుకొనుటకు, కరువుకాటకాలను ప్రకృతిసిద్ధమైన మారణోపాయాలుగా చిత్రించుటకు ప్రయత్నిస్తున్నారు. భారత పెట్టుబడిదారీవర్గ ప్రతినిధులైన మోక్షగుండం విశ్వేశ్వరయ్య, టి. యస్. వెంకట్రామన్, డాక్టర్ చంద్రశేఖరంలాంటి ప్రొఫెసర్లు కరువును పరిష్కరించాలంటే సంతాననిరోధం అవసరమని పనిగట్టుకుని ప్రచారంచేస్తూ వచ్చారు.

### (iii) కూలిఫండు సిద్ధాంతం (జె. యస్. మిల్)

ఇంగ్లండులో కార్మికులు అప్పుడప్పుడే ట్రేడ్‌యూనియన్లు నిర్మించుకుని ఎక్కువ కూలికొరకు సమ్మెలు ప్రారంభించిన రోజుల్లో యీసిద్ధాంతం సృష్టించబడింది. పెట్టుబడిదారులు శ్రమశక్తిని కొనుటకు ప్రత్యేకించగల పెట్టుబడినిబట్టి ఎంతమంది కార్మికులను వినియోగించాలి, ఎంత కూలి యివ్వాలి అనేవి నిర్ణయమవుతుందని యీసూత్రం చెబుతుంది. కూలి అనేది "పెట్టుబడి మొత్తము, జనసంఖ్యల నిష్పత్తిపైన ఆధార

పడియుంటుంది. పోటీమూలంగా యిదొక్కటే కూలిని నిర్ణ యించే సూత్రం" అని మిల్ చెప్పాడు.

కూలి పెరగాలంటే, కూలినిమిత్తం ప్రత్యేకించబడ్డ ఫండు పెరగాలి. ఈఫండు పెరగాలంటే, మొత్తం సంపద పెరగాలి. అంటే, కార్మికులు ఎక్కువ విలువలు సృష్టించాలి. లేదా, యీ ఫండు స్థిరంగాఉండి, కూలి పెరగాలంటే కార్మికుల సంఖ్య తగ్గాలి. కొంతమంది కార్మికులు ట్రేడ్ యూనియన్ ఆందోళనద్వారా జీతాలు పెంచుకోగలిగితే, యీ ఫండు తగ్గిపోయి మిగతా కార్మికుల కూలి తగ్గుతుంది; లేదా నిరుద్యోగు లౌతారు. లేక తక్కువ కూలి కంగీకరిస్తే ఎక్కువమంది కుద్యోగాలు దొరుకుతాయి. ప్రభుత్వం బీదవాళ్ల సహాయం నిమిత్తం పెట్టుబడిదారులపై పన్నులువేస్తే, యీ ఫండు తగ్గిపోయి బీదవాళ్ళసంఖ్య ఎక్కువవుతుంది. లేక, కూలి పెంచాలని శాసనాలుచేస్తే సరుకుల ఖరీదులు పెంచవలసివస్తుంది. అపుడు కొనుగోలుదారులంతా నష్టపడతారు.

ఈ సిద్ధాంతం కార్మికులను, ప్రజలను చాలాకాలం మోసం చేయగలిగింది. 1876 లోనే ఫ్రాంసిస్ వాకర్ అనే అర్థశాస్త్రవేత్త దీనికి సమాధానం చెప్పాడు. కార్మికుని కూలి, అతడు ఉత్పత్తిచేసిన సరుకుల విలువలో నూతన విలువ భాగాన్నుండి యివ్వబడుతుందేగాని, పెట్టుబడిదారుదగ్గర నిల్వ యున్న పెట్టుబడినుండి గాదని నిరూపించాడు. అదీగాక పరిశ్రమ లాభదాయకంగా ఉన్నకొలదీ, అదనపు విలువ పెరిగి, పెట్టుబడి పెరుగుతూంటుంది. కార్మికుల ఉత్పత్తిశక్తిని, శ్రమ తీవ్రతను యీసూత్రం పూర్తిగా విస్మరించింది. ఉత్పత్తిశక్తి, శ్రమతీవ్రత

పెరిగినకొలదీ, అదనపు విలువభాగం పెరుగుతూనే ఉంటుంది. మొత్తం పెట్టుబడి పెరుగుతుంది. కూలి పెంచుతూనే అదనపు విలువనుకూడ పెంచుకోవచ్చు.

### (iv) మార్జినల్ ఉత్పత్తి శక్తినిబట్టి కూలి
### (జె. బి. క్లార్కు, జెవాన్సులు)

పైన వివరించిన సూత్రాలలో కార్మికుల ఉత్పత్తిశక్తి వగైరాల ప్రసక్తే లేదని గుర్తించి, అర్థశాస్త్రజ్ఞులు యీ సూత్రాన్ని సృష్టించారు.

శ్రమశక్తికి డిమాండు పెట్టుబడిదారు ఎంత పెట్టుబడి పెట్టుటకు సిద్ధంగా ఉన్నాడు అనేదానికన్న, ఉత్పత్తయిన సరుకునుబట్టి యుంటుందనీ, చలామణీ అయ్యే పెట్టుబడి స్థిరంగా ఉండక మారుతూంటుందనీ, కార్మికుల ఉత్పత్తిశక్తి పెరిగిన కొలదీ, యీ పెట్టుబడికూడా పెరుగుటవలన శ్రమశక్తికి డిమాండు పెరుగుతుందనీ, అయితే, యెంతమంది కార్మికులను యెంత కూలిపైన వినియోగించాలనేది మార్జినల్ ఉత్పత్తి శక్తినిబట్టి పెట్టుబడిదారులు నిర్ణయించవలసి యుంటుందనీ యీ సూత్రం చెబుతుంది.

ఒక సరుకుయొక్క విలువ మార్జినల్ ఖరీదునుబట్టి యెలా నిర్ణయింప బడుతుందన్నారో అలాగే, శ్రమశక్తి అనే సరుకు విలువ అదనంగా వినియోగించబడే ఒక్కొక్క కార్మికుడు ఉత్పత్తిచేసే సరుకులలోని నూతన విలువకు సరి సమానంగా ఉంటుంది. వీరు చేసే యీ ఉత్పత్తిని మార్జినల్ ఉత్పత్తియనీ, వీరి ఉత్పత్తిశక్తిని మార్జినల్ ఉత్పత్తిశక్తియనీ పిలుస్తారు. ఈ క్రింది ఉదాహరణ దీనిని వివరిస్తుంది.

ఒకఫ్యాక్టరీలో 100 మంది కార్మికులు రోజుకు రూ300/- విలువను సృష్టిస్తున్నారనుకోండి. మరో 10 మంది వినియోగించబడితే మొత్తం రూ 325/- విలువ సృష్టించగలరనుకోండి. అంటే, అదనంగా 10 మందిని వినియోగించుటవలన వచ్చిన అదనపు విలువ రూ 25/- మాత్రమే. అంటే, ఒక్కొక్కడు సగటున రూ 2-8-0 విలువనుమాత్రమే సృష్టిస్తున్నాడు. కాబట్టి 100 మందికన్న ఎక్కువమందిని వినియోగిస్తే పెట్టుబడిదారుకు లాభం తగ్గుతుంది. రెండవది రూ 2-8-0 కన్న ఎక్కువ కూలియిస్తే ఆ పరిశ్రమ కొనసాగదు. అందువల్ల కార్మికుల డిమాండు వెల యింతకన్న పెంచుట సాధ్యంగాదు. కాబట్టి,ఆనాటికుండే పెట్టుబడినిబట్టి, సహజ సంపదల సౌలభ్యాన్ని బట్టి, టెక్నిక్ అభివృద్ధి, ఉత్పత్తిస్థాయినిబట్టి ప్రతిఒక్కరికి పని దొరకాలంటే కూలి నిర్ణీతంగానే ఉంటుంది. ఇంతకన్న ఎక్కువ కూలి కావాలంటే, కొంతమంది నిరుద్యోగులవక తప్పదు—అని యీ సూత్రం చెబుతుంది.

ఈ సూత్రం ఉత్పత్తిశక్తి పెరిగితే,కూలి పెంచవచ్చుననే దానిని నామమాత్రంగా అంగీకరిస్తూంది. కాని, శ్రమశక్తి సప్లై, చలామణీ పెట్టుబడి స్థిరంగాఉన్నట్లే భావిస్తూంది. శ్రమశక్తి సప్లై ఎక్కువై కార్మికుల డిమాండు తగ్గినప్పుడు, లేక పెట్టుబడి సప్లై ఎక్కువై కార్మికుల డిమాండు పెరిగినపుడు కూలి యెలా మారుతుందో వివరించడంలేదు.

కార్మికుల సంఖ్య తక్కువగా ఉన్నపుడు మార్జినల్ ఉత్పత్తిశక్తి ఎక్కువవుతుంది. అపుడు కూలి పెరగవలసియుంటుంది. అలాగే కొత్తగా, కనిపెట్టబడిన లేక పరిశ్రమలు

అప్పుడే అభివృద్ధియవుతూన్న ఒక దేశంలో కార్మికులు తక్కువగా ఉన్నపుడు చాల ఎక్కువ సంపదను ఉత్త చేతులతోనే సృష్టించగలుగుతారు. ఇలాంటిచోట్ల కూలి ఎక్కువగా ఉంటుంది.

అందువల్ల యీ సూత్రం అర్థశాస్త్రజ్ఞులు చెబుతున్నట్లు, కూలిని నిర్ణయించుట కెంతమాత్రం తోడ్పడదు. పైగా, కార్మికుల ఉత్పత్తిశక్తి పెరిగితేనే, అంటే, కార్మికులు కష్టపడి పనిచేసి ఎక్కువ విలువను సృష్టిస్తేనే కూలి పెరుగుతుందనే దురభిప్రాయం కలిగించుటకు, దోపిడీ నెక్కువచేయుటకు ఉద్దేశింపబడింది.

## (V) మార్షల్ యొక్క సప్లై డిమాండు సూత్రం

పై సూత్రాలలో శ్రమశక్తియొక్క సప్లై, డిమాండులు, పెట్టుబడియొక్క సప్లై విషయం లేవని చూచాము. మార్షల్ తన సూత్రంలో యీ లోపాలను సరిదిద్దుటకు ప్రయత్నించాడు.

మార్షల్ వివరణ క్లుప్తంలో యీక్రింది విధంగా ఉంది: శ్రమశక్తికి డిమాండు అనేది అనేక విషయాలపై ఆధారపడుతుంది. వీటిలో ప్రధానమైనది పెట్టుబడియొక్క సప్లయి. ఆ పెట్టుబడి సప్లయి పెట్టుబడిదారుల త్యాగంపైన ఆధారపడి యుంటుంది. తాము వెంటనే అనుభవించాలనే వాంఛను వదలివేసి, తమ ఖర్చులు తగ్గించుకుంటూ, మిగిలిన డబ్బును పెట్టుబడి పెట్టవలసియుంటుంది. తాము పెట్టిన పెట్టుబడికి యింతలాభం రావాలిఅనే ఆశ సహజంగా ఉంటుంది. పెట్టు

బడి మొత్తం ఎక్కువైనకొలదీ యీ ఆశ పెరుగుతుంది. తాను తిరిగి యెంత రావాలని కోరుతాడో, దానిని పెట్టుబడి యొక్క సప్లై వెల అంటాము. ఒక సంవత్సరంలో వచ్చే వివిధ పెట్టుబడుల మొత్తాలయొక్క సప్లై వెలలను ఒక పట్టీగా తయారుచేసి గ్రాఫుగీయవచ్చు.

అదేవిధంగా కూలియొక్క హెచ్చుతగ్గులనుబట్టి శ్రమశక్తి సప్లై మారుతూంటుంది. శ్రమశక్తికికూడ ఒక డిమాండు వెల ఉంటుంది. ఈ డిమాండు వెల మార్జినల్ ఉత్పత్తిశక్తినిబట్టి నిర్ణయింపబడుతుంది. ఈ రెండు గ్రాఫులు కలిసినచోట కూలి నిర్ణయించబడుతుంది.

శ్రమశక్తిసప్లై మార్షల్ చెప్పినట్లు కూలియొక్క హెచ్చుతగ్గులనుబట్టి ఎల్లెడల మారుతుందని చెప్పడం పొరపాటు. ఇది అనేక విషయాలపైన ఆధారపడి యుంటుంది.

(1) కార్మికుల సంఖ్యనుబట్టి – జనాభాలో బీదవారి సంఖ్యనుబట్టి, (2) కూలి ప్రమాణంపైన, (3) పనిగంటల పైన, (4) శ్రమ తీవ్రతపైన.

ఒక్కొక్కప్పుడు కూలి తగ్గినా, శ్రమశక్తి సప్లై పెరగవచ్చు. కుటుంబంలో ఒక్కరే పనిచేస్తున్నపుడు కూలి తగ్గి, జీవితావసరాలకు సరిపోనపుడు కుటుంబంలోని వారందరు ఉద్యోగంకొరకు ప్రాకులాడవచ్చు. స్త్రీలు, పసిపిల్లలుకూడ పనిలో ప్రవేశించవచ్చు. లేక, కూలి చాలనపుడు కార్మికులు ఎక్కువ గంటలు పనిచేయుటకు, ఎక్కువ శ్రమతీవ్రతకు అంగీకరించవచ్చు. అపుడుకూడ పనిచేస్తున్న కార్మికులసంఖ్య పెరగకపోయినా శ్రమశక్తి సప్లై ఎక్కువైనట్లే.

## మార్క్స్ సమిష్టి బేరపుశక్తి సూత్రం

కార్మికుని కూలి అతని శ్రమశక్తియొక్క విలువయని చెబుతూ, మార్క్స్ యీ శ్రమశక్తియొక్క విలువ ఎలా నిర్ణయించాలో తెలియజేశారు (దీని నింతకుముందే వివరించడం జరిగింది). ఆ విలువమేరకు కూలి గిడితేనే, కార్మికులు సహజంగా ఆరోగ్యంగా ఉండగలుగుతారు. అందువల్ల యీ జీవితస్థాయిని కల్పించే ఆదాయం అవసరం.

కాని, పెట్టుబడిదారులు నిరంతరం కార్మికుల కూలిని తగ్గించేందుకు ప్రయత్నిస్తూనే ఉంటారు. పెట్టుబడిదారుల యీ దాడిని కార్మికులు తమయొక్క సమిష్టి శక్తిద్వారానే త్రిప్పి కొట్టగలుగుతారు. కాబట్టి, కార్మికులయొక్క కూలిప్రమాణం వారి సమిష్టిబేరపు శక్తిపైన ఆధారపడి యుంటుందని మార్క్స్ చెప్పారు.

## కూలి ప్రమాణం

అయితే ఆయా దేశాలలోని చారిత్రక, సాంఘిక పరిస్థితులు, ఆచారాలు, అలవాట్లు మొదలైనవాటినిబట్టి నిర్ణీతమైన జీవనస్థాయి (Standard of life) ఉంటుందని పైన చూచాము. కాని పెట్టుబడిదారులు ఏదేశంలోనైనా కార్మికుల కూలిప్రమాణాన్ని తగ్గించేందుకు ప్రయత్నిస్తూనే ఉంటారు. అయినప్పటికి కొన్ని పరిస్థితుల కారణంగా కొన్ని చోట్ల కూలి ఎక్కువ యివ్వకతప్పదు. దీనికి కారణం ఆదేశాల కార్మికులపై పెట్టుబడిదారుల అభిమానం కాదు. స్థానిక పరిస్థితులు, పారిశ్రామికాభివృద్ధి, నిపుణత, ఉత్పత్తిశక్తి, కార్మికోద్యమబలం దీనికి కారణాలు.

ఉదా: అమెరికాకు ఇంగ్లీషువారు వలసపోయినపుడు విస్తారమైన భూఖండాలు, సహజ సంపద ఉండి కూలీలకు కొరత ఏర్పడుటచే మొదటినుండి కూలిప్రమాణాం చాలా ఎక్కువగానే ఉండేది. ఇంగ్లండులో పరిశ్రమలు, టెక్నిక్ అభివృద్ధి యగుటవలన కూలిప్రమాణం కొంచెం ఎక్కువగా ఉంటుంది. వెనుకబడిన ఇండియా, ఆఫ్రికా మొదలైన దేశాలలో కూలి చాలా తక్కువ.

ఉదాహరణకు గనుల లోపల పనిచేసే కార్మికుల రోజు కూలి తీసుకుంటే అమెరికాలో రూ 9-0-0, ఇంగ్లండులో రూ 7-12-0, ఇండియాలో రూ 0-8-0 —— 1-0-0 కూలి (1948 లో) ఉండేవి.

అలాగే 1900 - 1902 మధ్య ఏడాది వేతనాలు (డాలర్లలో)

| | | | |
|---|---|---|---|
| అమెరికా | 463 | ఆస్ట్రియా | 167 |
| ఇంగ్లండు | 258 | రష్యా | 97 |
| జర్మనీ | 237 | జపాను | 55 |

పెట్టుబడిదారీ విధానం అభివృద్ధియైనకొలదీ వివిధ దేశాల మధ్యనేగాక, ఒకేదేశంలో వివిధ ప్రాంతాలమధ్య, ఒకే పరిశ్రమలో స్త్రీ, పురుష, బాలురమధ్య, వివిధపరిశ్రమల మధ్య కూలిప్రమాణంలో తేడాలుంటాయి. దీనికి కారణం పెట్టుబడిదారులు వీలైనంతవరకు స్థానిక పరిస్థితుల నాధారం చేసుకుని, సాధ్యమైనంత తక్కువకూలి యిచ్చి ఎక్కువ దోపిడీ చేయాలని ప్రయత్నించడమే.

ఉదా: భారతదేశంలో

(అ) ఒకే పరిశ్రమలో ప్రాంతాలనుబట్టి తేడాలు.

బట్టల పరిశ్రమలో 1946 సంవత్సరంలో ఒక్కొక్క కార్మికుని సగటు ఆదాయం (రూపాయలలో)

| | | | |
|---|---|---|---|
| బెంగాలు | 486 | ఢిల్లీ | 754 |
| బొంబాయి | 847 | మద్రాసు | 441 |
| మధ్యప్రదేశ్ | 495 | ఉ. ప్ర. | 602 |

(లేబర్ ఇయర్ బుక్)

(ఆ) ఒకే పరిశ్రమలో ఒకే పనిచేసేవారికి ప్రాంతాలను బట్టి తేడాలు.

1948 వ సంవత్సరంలో బట్టల పరిశ్రమలో డాఫర్ల నెలసరి సగటు ఆదాయం (రూపాయలలో)

| | | | |
|---|---|---|---|
| బొంబాయి | 82-0-0 | నాగపూర్ | 61-7-0 |
| అహ్మదాబాద్ | 94-5-0 | బెంగాల్ | 50-2-5 |
| మధుర | 64-7-0 | ఇండోర్ | 71-0-0 |

(లేబర్ ఇయర్ బుక్)

(ఇ) వివిధ పరిశ్రమలలో పనిచేసే కార్మికుల కూలిలో తేడాలు.

1946 వ సంవత్సరంలో కార్మికుని సగటు ఆదాయం (రూపాయలలో)

| | | | |
|---|---|---|---|
| బట్టల పరిశ్రమ | 625 | లోహాలు | 600 |
| పత్తి | 722 | రసాయన పరిశ్రమ | 492 |
| జూట్ | 425 | కాగితాలు | 638 |
| ఇంజనీరింగ్ | 696 | చర్మం, తోళ్లు | 558 |
| మందుగుండు | 721 | మింట్ | 859 |

(లేబర్ ఇయర్ బుక్)

(ఈ) స్త్రీల, పురుషుల, పిల్లల కూలిప్రమాణంలో తేడాలు.

అస్సాం టీ తోటలలో 1948 జూన్‌లో రోజువారీ సగటు ఆదాయం.

| | | |
|---|---|---|
| పురుషులు | 1- 1-6 | |
| స్త్రీలు | 0-15-6 | |
| పిల్లలు | 0- 8-0 | (లేబర్ ఇయర్ బుక్) |

**జీవనభృతికోసం (Living wage) భారత కార్మికుల పోరాటం**

పైన వివరించినదానినిబట్టి ఒకే పరిశ్రమలో పనిచేస్తున్నా ప్రాంతాలవారీ, పరిశ్రమలవారీ, స్త్రీ పురుష భేదాల పేరుతో, కూలిప్రమాణంలో తేడా లున్నాయని తేలుతుంది. ఇంత వరకు భారతదేశంలో కనీస జీవనభృతి కొరక నిర్ణయం లేదు. జీవనభృతికోసం భారత కార్మికవర్గం అనేక పోరాటాలు జరిపింది.

"ప్రథమ ప్రపంచయుద్ధ ప్రారంభంవరకు ఎక్కువ జీతాల కోసం పోరాటం నిర్మాణయుతంగా జరుగలేదు. కార్మికుడు తనను తాను పోషించుకోవడమేగాక, తన కుటుంబాన్నికూడా పోషించవలసిన బాధ్యత వున్నదని పెట్టుబడిదారు లంగీకరించే వారు కాదు. బ్రతకదలచుకుంటే స్త్రీకాని, పిల్లకాని పని చేయవలసిందేననేది వాళ్ల అభిప్రాయం. 1920 ప్రాంతంలో అధిక వేతనాలకొరకు తీవ్రమైన ఉద్యమం బయలుదేరింది. ఒకే పరిశ్రమలో, ఒకే ప్రదేశంలో పనిచేసే కార్మికుల జీతాలు ఒకేవిధంగా ఉండాలనే ఉద్యమంవల్ల జీతాలలో తేడాలు తొలగించబడ్డాయి.

"అయితే జీతాలను స్థిరీకరణ చేయాలనే ఉద్యమం అన్ని ప్రాంతాలకూ, అన్ని పరిశ్రమలకూ ప్రాకలేదు. జీతాలను స్థిరీకరించాలని 1897 లో పెట్టుబడిదారులే కోరారు. పెట్టుబడిదారులలో ఉండే వైరుధ్యాలే యిందుకు కారణం. 1928 లో బొంబాయి కార్మికులు సమ్మెచేసి, జీతాల స్థిరీకరణను సాధించుకున్నారు. జీతాల స్థిరీకరణ సమస్యతోపాటు కనీస జీతం, జీవనభృతి అనే సమస్యలు చర్చలోకి వచ్చాయి. చాలా ప్రదేశాలలో పోరాటాలద్వారా కార్మికులు కనీస జీతాన్ని సాధించుకున్నారు. కార్మికుడు తన జీతంతోనే కుటుంబాన్నికూడా పోషించవలసియుంటుందనే సిద్ధాంతంకూడా ఆనాటినుండీ అంగీకరించబడింది. కేంద్ర ప్రభుత్వంచే నియమించబడిన సెంట్రల్ పేకమిషన్ తన రిపోర్టులో యీ విషయాన్ని అంగీకరించింది. రైల్వేపనివారు, తదితర ప్రభుత్వోద్యోగులకు యీ సిద్ధాంతం వర్తింపజేసి, కనీస జీతం నెలకు రూ 30/- నిర్ణయించారు. ప్రయివేటు యజమానులకుకూడా యిదే ప్రమాణమయింది. కనీస జీతం రూ 30/- ఉండాలనీ (ధరలు పెరగకముందు), నైపుణ్యాన్నిబట్టి వేతనాలు పెంచాలనీ ఆందోళన ప్రారంభమయింది. దేశవ్యాపిత ఉద్యమం బయలుదేరింది. రూ 30/- జీతం కనీసంలో కనీసం అయినప్పటికీ, కార్మికోద్యమంలో చీలికలవల్ల జీవనభృతికోసం కార్మికులు సాగించే పోరాటం ఫలించలేదు. జీవనభృతి సిద్ధాంతాన్ని అంగీకరించుటకు బదులు, కనీస జీతాలచట్టం (Minimum-wages Act) అంటూ చేసి కొన్ని పరిశ్రమలలో జీతాలను నిర్ణయంచేశారు."

(యస్. ఏ. డాంగే, ట్రేడ్ యూనియన్ కార్యకర్తల సమావేశంలో యిచ్చిన రిపోర్టునుండి)

ఈనాటికీ జీవనభృతికోసం పోరాటం సాగుతూనేఉంది. ఈనాటి పెరిగిన ధరలను దృష్టిలో పెట్టుకుని, అఖిలభారత ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు కనీస జాతీయ జీవనభృతి నెలకు రూ 100/- ఉండాలని నిర్ణయించి ఆందోళన చేస్తూంది.

## నిజమైన కూలి-నగదు కూలి

ఇదే సందర్భంలో నిజమైన కూలికి (Real wages) నగదు కూలికి (Nominal wages) మధ్య తేడాను గమనించ వలసియుంటుంది.

పెట్టుబడిదారీ విధానంలో కూలి ధనరూపంలో యివ్వ బడుతుంది. కార్మికుడు డబ్బు తినడుగదా. దానితో జీవి తావసర సరుకులను కొనుక్కుంటాడు.

అయితే సరుకుల ధరలు స్థిరంగా ఉండవు. బంగారం విలువ తగ్గినా, లేక సరుకుల ధరలు పెరిగినా, లేక నోట్ల ముమ్మరంమూలంగా రూపాయియొక్క కొనుగోలుశక్తి పడిపోయినా కార్మికుల కూలికి విలువ తగ్గుతుంది. అంటే జీవనస్థాయి తరుగుతుంది.

ఉదా : రోజుకూలి రూ 0-8-0 అనుకోండి. బియ్యం శేరు 1 కి 4 అణాలయితే 2 శేర్లు వస్తాయి. కూలి రూ 1/-కి పెరిగిందనుకోండి. దానితోపాటు బియ్యంధర శేరు రూపాయి అయిందనుకోండి. అపుడు శేరుబియ్యంమాత్రమే కార్మికుడు కొనగలడు. అంటే 'నగదుకూలి' రెట్టింపు అయినా 'నిజమైన కూలి' సగానికి సగం పడిపోయిందన్నమాట.

భారతదేశంలో 1939-'49 మధ్య నోట్ల ముమ్మరం, ధరల పెరుగుదలవలన నగదుకూలి పెరిగినా, నిజమైనకూలి ఎలా తగ్గిపోయిందో యీ క్రింది టేబుల్ తెలియజేస్తుంది.

| సంవత్సరం | కార్మికుల సగటు నగదు కూలి | సగటు నిజమైన కూలి |
|---|---|---|
| 1939-40 | 287.5 | 287.5 |
| 40-41 | 307.7 | 293.0 |
| 41-42 | 324.5 | 282.2 |
| 42-43 | 424.8 | 291.0 |
| 43-44 | 525.0 | 212.6 |
| 44-45 | 586.5 | 234.6 |
| 45-46 | 595.8 | 235.5 |
| 46-47 | 619.4 | 237.3 |
| 47-48 | 738.3 | 249.5 |
| 48-49 | 806.0 | 240.0 |

(ఈస్టరన్ ఎకానమిస్టు, స్వాతంత్ర్య సంచిక-1949)

మరోవిధంగా చూద్దాం. సరుకుల ధరలు 1939 లో 100 ఉంటె, 1948 లో 400 కు పెరిగాయి. అదే సమయంలో కార్మికుల కూలిమాత్రం 100 నుండి 250 కి పెరిగింది. అంటె నిజమైన కూలి 1939 తో పోలిస్తే 1948 నాటికి 62.5% వరకు తగ్గాయని స్పష్టం.

కాబట్టి కార్మికునికి ఎంత డబ్బు ముడుతుందో అనేది కొలబద్ద కాదు. అది 'నగదు కూలి' మాత్రమే. ఈ కూలి

యొక్క కొనుగోలుశక్తిని అంటె, దానితో ఎన్ని జీవితావసర సరుకులను కార్మికుడు కొనగలుగుచున్నాడా అనేది గీటురాయి.

## కూలి - వర్గపోరాటం

పెట్టుబడిదారీవర్గం కార్మికులు సృష్టించే నూతన విలువలో ఎక్కువభాగాన్ని కాజేసేందుకు అనేక పద్ధతు లవలంబిస్తుంటారని పైన చూచాము. దీనివలన కార్మికులయొక్క, పెట్టుబడిదారులయొక్క ప్రయోజనాలు ఒకదాని కొకటి పూర్తిగా విరుద్ధంగా తయారవుతాయి. పనిరోజులో తమతమ భాగాల నెక్కువచేసుకునేందుకు, కార్మికులు కూలి పెంచుకునేందుకు, పెట్టుబడిదారులు లాభాలను పెంచుకునేందుకు, కార్మికవర్గం కూలిపని విధానాన్నే అంతమొందించేందుకు, పెట్టుబడిదారీవర్గం దానిని నిలబెట్టేందుకు పోరాటం సాగిస్తూనే ఉంటుంది.



వర్గపోరాటం అనేక రూపాలలో సాగుతుంది. అందులో ప్రధానమైనది, ప్రత్యక్షమైనది, అతి ముఖ్యమైనది ఫ్యాక్టరీ లోపల జరుగుతుంది. కూలిని తగ్గించివేసేందుకు, కార్మికుల నుండి వీలైనంత ఎక్కువ పనిచేయించుకుని ఎక్కువ అదనపు విలువను గుంజేందుకు పెట్టుబడిదార్లూ, రెండవవైపున తమ జీవన పరిస్థితులను బాగుపరచుకునేందుకు కార్మికులూ నిరంతరం పోరాడుతూనే ఉంటారు. ఈ పోరాటమే వర్గపోరాటానికి ఆర్థిక పునాది.

పెట్టుబడిదారీ ఉత్పత్తియొక్క లక్ష్యం లాభాలు. లాభాలు పెంచుకోటానికి పెట్టుబడిదారుల కొకటే రాజబాట. ఉత్పత్తి ఖర్చులు తగ్గించడం. ఉత్పత్తిఖర్చులు తగ్గాలంటె కార్మి

కుల కూలినైనా తగ్గించాలి, లేదా కూలి అలాఉంటూనే శ్రమ భారాన్ని పెంచాలి.

పెట్టుబడిదారులు మొదటినుండీ తమ లాభాలదాహంతో అభివృద్ధికరమైన కార్మిక శాసనాలకు వ్యతిరేకంగా పోరాడుతూనేవచ్చారు. గతశతాబ్దంలో 10 గంటల పని దినానికి వ్యతిరేకంగా, బాల బాలికలచేత పనిచేయించకూడదనే శాసనానికి, ఆరోగ్యభీమా చట్టాలకు వ్యతిరేకంగా పోరాడారు. ఈనాటికీ గృహావసతులు, సాంఘికభీమా చట్టాలను అమలు జరపకుండా ప్రతిఘటిస్తూనే ఉన్నారు. కార్మికవర్గం అనేక వీరోచిత పోరాటాలు జరిపిన పిమ్మటనే, ఏ చట్టమైనా అంగీకరింపబడి అమలులోకి వచ్చేది.

మన దేశంలో కార్మికవర్గం అడుగడుగునా ప్రతిచట్టానికి పోరాటాలు జరిపి సాధించుకోవలసివచ్చింది. 1911 లో 11 గంటల పనిని, 1920 లో 10 గంటల పనిదినాన్ని, 1934లో 9 గం పనిని, 1946 లో 8 గంటల పనిని సాధించుకున్నది. అలాగే 1890 లో ఆదివారం సెలవు, 9 సంవత్సరాలలోపు పిల్లలు పనిచేయకూడదనే చట్టం సాధించుకుంది. 1923 లో నష్టపరిహారచట్టం, 1926 లో ట్రేడ్ యూనియన్, ఫ్యాక్టరీ ఆక్టులు, 1936 లో జీతాల బట్వాడాచట్టం సాధించుకోగలిగింది.

కార్మికులు తమ సంఘాలలో సంఘటితమై, ఐక్యకార్యాచరణకు పూనుకున్నపుడు లాభాల విధానానికి ప్రమాదం వస్తుంది. అందువల్ల చాలాకాలంవరకు కార్మికులకు సంఘాలు పెట్టుకునే హక్కుకు వ్యతిరేకంగా పెట్టుబడిదారులు పోరాడారు. చివరకు అది లాభం లేదనుకున్నపుడు ఆ హక్కులను పరిమితం

చేస్తూ శాసనాలు తయారుచేస్తున్నారు. (ఉదాహరణకు ఇంగ్లండులో 1927 లో చేయబడిన ట్రేడ్ డిస్ప్యూట్సు, ట్రేడ్ యూనియన్ ఆక్టు, అమెరికాలో 1947లో తయారుచేసిన టాఫ్ట్-హార్ట్లీచట్టం యిలాంటివే.) మన భారత ప్రభుత్వంకూడ ట్రేడ్ యూనియన్ హక్కులను పరిమితంచేయ పూనుకుంటూంది. ట్రేడ్ యూనియన్లను గుర్తించకుండా అవరోధాలు కల్పించడం, ట్రేడ్ యూనియన్లలో కార్మికులుతప్ప మిగతావారుండగూడదని నిషేధించడం, పోటీ సంఘాలను నెలకొల్పడం, ప్రజోపయోగకర సర్వీసులనే పేరుతో సమ్మెలను నిషేధించడం చేస్తూంది. కార్మికుల పోరాటాలు తీవ్రతర మవుతాయనుకున్నపుడు పెట్టుబడిదారులు ప్రభుత్వ యంత్రాన్నుపయోగించి ట్రేడ్ యూనియన్లనే నిషేధించడంకూడా కద్దు. ఉదాహరణకు మనదేశంలో 1948 నుండి 1951వరకు అనేక కార్మిక సంఘాలు నిషేధించబడ్డాయి. పెట్టుబడిదారుల ప్రయోజనాలను రక్షించేందుకు ప్రభుత్వం పోలీసుబలాన్ని వినియోగించడం తరచుగా జరుగుతూంటుంది. మన దేశంలో ఎన్నిమాట్లు తుపాకులు కాల్చారో, ఎంతమంది ట్రేడ్ యూనియన్ కార్యకర్తలను జైళ్లలో పెట్టారో లెక్కేలేదు.

ఇక పెట్టుబడిదారులు ఈ వర్గపోరాటంలో తమ స్వాధీనంలో ఉన్న రేడియోలు, పత్రికలు, యితర ప్రచార సాధనాలను ఎంత విరివిగా ఉపయోగిస్తారో మనకు తెలుసు. వీటి ద్వారా కార్మికవర్గాన్ని గందరగోళపరుస్తుంటారు. వర్గ సామరస్య సిద్ధాంతం, అహింసా సిద్ధాంతం, యిలాంటి వెన్నో కార్మిక వ్యతిరేక సిద్ధాంతాలను ప్రచారంచేస్తూంటారు.

వర్గ పోరాటంయొక్క ప్రత్యక్ష బహిరంగరూపం సమ్మెలు, లాకౌట్‌లు. మన దేశంలో 1907 లో బొంబాయి కార్మికులు పనిగంటల తగ్గింపుకొరకు సమ్మెచేశారు. తిరిగి 1920 లో దేశమంతటా పనిగంటల తగ్గింపుకొరకు సమ్మె పోరాటాలు జరిగాయి. 1930–'34 మధ్య మరొక సమ్మె వెల్లువ. 1941–'49 వరకు జరిగిన సమ్మెలవివరాలు యీక్రింద యివ్వబడ్డాయి. ఇవన్నీ ముఖ్యంగా కరువుభత్యం, జీతాల హెచ్చింపుకు జరిగాయి.

| సంవత్సరం | సమ్మెచేసిన కార్మికుల సంఖ్య | సమ్మెదినాలు |
|---|---|---|
| 1941 | 2,91,054 | 33,50,503 |
| 1942 | 7,72,653 | 57,79,965 |
| 1943 | 5,25,088 | 23,42,287 |
| 1944 | 5,50,015 | 34,47,306 |
| 1945 | 7,47,530 | 40,54,499 |
| 1946 | 19,61,948 | 127,17,762 |
| 1947 | 18,40,784 | 165,62,666 |
| 1948 | 16,52,418 | 106,32,800 |
| 1949 | ... | 47,00,000 |

(ఆగస్టు వరకు)

(ఈస్టరన్ ఎకానమిస్టు నుండి)

ఈనాడుకూడా రేషనలైజేషన్, రిట్రెంచిమెంట్‌లకు వ్యతిరేకంగాను, జీతాల పెరుగుదలకు సమ్మెలు జరుగుతూండడము చూస్తూనే ఉన్నాము. వీటిలో గమనించదగినవి

కాన్పూర్ జౌళి కార్మికుల సమ్మె, డార్జిలింగు తేయాకు కార్మికుల సమ్మె.

పెట్టుబడిదారీ విధానంయొక్క సంక్షోభం తీవ్రతరమైన కొలదీ కార్మికులు తమ తక్షణ ఆర్థిక కోర్కెలకు జరిపే పోరాటాలు రాజకీయ పోరాటాలతో సమ్మిళిత మవుతూంటాయి. పెట్టుబడిదారీ విధానంలో కార్మికవర్గం వీరోచితంగా జరిపే రోజువారీ పోరాటాలు కూలిని, శ్రమశక్తి విలువకన్న తగ్గించేందుకు చేసే దాడిని ప్రతిఘటించేతవరకే తోడ్పడవచ్చు. "అంత మాత్రంచే కార్మికవర్గం పెట్టుబడిదారుల దాడిని ప్రతిఘటించడం మానివేస్తారా? తాత్కాలికంగా తమపరిస్థితులను బాగుపరచుకోటానికి, అప్పుడప్పుడు లభించే అవకాశాలను సద్వినియోగం చేసుకోకుండా మానివేస్తారా?" అని ప్రశ్నించి మార్క్సు యిలా జవాబు చెప్పారు: "అలా చేస్తే వారు ఉద్ధరించడానికికూడ వీలులేనంత దుస్థితికి దిగజారిపోతారు. కార్మికులు తాము జరిపే రోజువారీ పోరాటాలను ఎక్కువ అంచనా వేయగూడదు. తాము యీపోరాటాన్ని సాగించేది అసలు వ్యవస్థతో కాదని, దానియొక్క ఫలితాలతోనని మరచి పోకూడదు" ('విలువ, ఖరీదు, లాభం' అనే గ్రంథనుండి) అయితే యీ పోరాటాలలో కార్మికులు తమబలాన్ని, అనుభవాన్ని పెంపొందించుకోగలుగుతారు. ఈరోజువారీ పోరాటాలు కార్మికులు చిట్టచివరకు పెట్టుబడిదారీ వ్యవస్థమీాద జరుపవలసిన గొప్పపోరాటానికి తయారుచేసే పాఠశాలలాంటివని ఏంగెల్సు అన్నారు. కార్మికవర్గంయొక్క ఆర్థిక పోరాటాలు రాజకీయ పోరాటాలతో సమ్మిళితమైపోకతప్పదు.

మన దేశంలో 20 వ శతాబ్దప్రారంభంలో కార్మికవర్గం సాగించిన పోరాటాల ప్రాతిపదికపైన 1920 లో అఖిలభారత ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు ఏర్పడింది. తరువాత కొద్ది కాలానికే కార్మికవర్గంయొక్క చైతన్యం యినుమడించి పెట్టు బడిదారీ విధానం ఉన్నంతవరకు తమకు భద్రతలేదని గ్రహిం చింది. కార్మికవర్గ ప్రతినిధులలో చిత్తశుద్ధిగలవారు కొందరు మార్క్సిస్టు సిద్ధాంత పునాదులపైన పనిచేసే విప్లవకర పార్టీ యొక్క అవసరాన్ని గుర్తించి, అటువంటి పార్టీని (కమ్యూనిస్టు పార్టీని) నిర్మించారు. ఆనాటినుండి కార్మికవర్గంయొక్క దైనం దిన పోరాటాలు, కార్మికవర్గ నాయకత్వాన అధికారాన్ని హస్తగతం చేసుకుని, ప్రజాతంత్ర ప్రభుత్వాన్నేర్పరచేందుకు జరిగే విస్తృత పోరాటంతో మిళితమయ్యాయి.

కార్మికవర్గం పాఠాలు నేర్చుకొనే పాఠశాలలలాంటివి ట్రేడ్ యూనియన్‌లు. ఈపాఠాలద్వారా వచ్చిన అనుభవంతో వారు పెట్టుబడిదారీ వర్గంపైన అంతిమ విజయం సాధించ గలుగుతారు.

మార్క్సు యీ క్రింది విధంగా వ్రాశారు :

“కూలి పద్ధతి చాలా హీనమైనదే. కాని కూలిరేటు హెచ్చింపుకై జరిగే పోరాటాలనుగూర్చి, ఇవే సర్వార్థ మోక్షములని భావించకూడదు. కూలి హెచ్చింపుకై పోరాటమనేది పెట్టుబడిదారీ విధానంవల్ల కలిగిన ఫలితాలతో పోరాడడమేగాని, మొత్తం ఆవిధానంతో కాదు. అసలు యీ దారిద్ర్యానికి కారణమైనవాటితో గాదు. అంతకంతకు దుర్భరం అవుతూన్న తమ పరిస్థితితో పోరాడుచున్నారేగాని,

అసలు యీ పరిస్థితుల గతినే, మార్గాన్నే మార్చుటకుగాదు. ఈ దైనందిన పోరాటాలు చాలా అవసరమే. క్రమక్రమంగా తమ జీవితాలను కబళించేసే పెట్టుబడియొక్క దురాక్రమణకు, మార్కెటు ఒడుదుడుకులకు వ్యతిరేకంగా జరిపే పోరాటాలు అవసరమే. కాని యివి తాత్కాలిక ఉపశమనములేగాని, పూర్తిరోగనివారణ కుపకరించేవి కావు. తమ దారిద్ర్యానికీ, బాధలకూ కారణమైనప్పటికి యీ ప్రస్తుత వ్యవస్థవల్లనే, రెండవవైపున సమాజాన్ని అభ్యున్నతివైపుకు కొనిపోవ డానికి, ఉత్తమ ఆర్థిక వ్యవస్థను నిర్మించటానికీ అనువైన భౌతిక పరిస్థితులన్నీ ఏర్పడి ఉన్నవని కార్మికులు గుర్తించాలి. కాబట్టి వారి నినాదం 'న్యాయమగు రోజుపనికి న్యాయమగు కూలి' అనేది కాదు. 'కూలి పద్ధతి నశించుగాక' అనే విప్లవ వినాదమే వారి సరియైన నినాదం."

(విలువ – ఖరీదు – లాభం)



ఆ ర వ అ ధ్యా య ం

# పెట్టుబడి సంచయము - దాని చారిత్రక పరిణామం

## పెట్టుబడి అంటే యేమిటి ?

పెట్టుబడిని సాధారణంగా మూడువిధాలుగా వర్ణిస్తారు :

(i) ఉత్పత్తి సాధనాలైన యంత్రాలు, యంత్రపరికరాలు, ఫాక్టరీలు, భవనాలు, గనులు వ్యవసాయం చేసే భూములు వగైరాలు, ఆహారపదార్థాలు, ముడిపదార్థాలు, సగం రూపొందిన సరుకులు, పూర్తి సరుకులు—వీటన్నింటి యొక్క మొత్తమే పెట్టుబడి.

(ii) ఉత్పత్తి సాధనాలను కొనడానికి, కూలి చెల్లించడానికి, ముడిపదార్థాలను కొనడానికి వినియోగించే ధనం యొక్క మొత్తమే పెట్టుబడి.

(iii) ప్రభుత్వ సెక్యూరిటీలు, కంపెనీల స్టాక్‌లు, వాటాలు, పేరుధనం, ఋణంగా యిచ్చిన ధనం మొదలైనవి పెట్టుబడి.

ఇవన్నీ యథార్థాలే అయినప్పటికీ, పెట్టుబడినిగురించి యివి పూర్తిగా చిత్రించవు.

అన్ని సామాజిక విధానాలలోనూ ఉత్పత్తి సాధనా లున్నాయి, ఉంటాయి. కాని వాటంతటవి అదనపు విలువను గుంజలేవు.

## పెట్టుబడి ఒక నిర్ణీత సామాజిక సంబంధం

పెట్టుబడిదారీ విధానంలో ప్రధాన లక్షణ మేమిటి? సమాజంలోని సంపదా, ఉత్పత్తి సాధనాలు, జీవనాధారాలు అన్నీ కొద్దిమంది పెట్టుబడిదారుల గుత్తాధికారంలో ఉంటాయి. కార్మికుల చేతులలో యివేవీ ఉండవు. తమ శ్రమశక్తిని పెట్టుబడిదారీ వర్గాని కమ్ముకుంటే బ్రతకడమూ, లేకపోతే ఆకలితో మాడడమూ తప్ప కార్మికవర్గానికి గత్యంతరముండదు. పెట్టుబడిదారీవర్గం తమ చేతులలో ఉన్న సంపదను, ఉత్పత్తి సాధనాలను ఉపయోగించి, శ్రమశక్తి నమ్ముకుంటే తప్ప బ్రతకలేని కార్మిక వర్గాన్ని దోపిడీచేసి అదనపు విలువను గుంజుతారు. ఇలాంటి సమాజవ్యవస్థలో ఉత్పత్తి సాధనాలు, వివిధ సరుకులు కష్టజీవులపై దోపిడీ సాధనాలుగా తయారవుతాయి.

కాబట్టి ధనము, ఉత్పత్తి సాధనాలు, వివిధ రకాలు సరుకులు, వాటాలు వగైరా లేవీకూడా వాటంతటవి పెట్టుబడి గావు. ఇవన్నీ కలిసి కొన్ని నిర్ణీత చారిత్రక, సామాజిక పరిస్థితులలో అంటే ఒక ప్రత్యేక సామాజిక వ్యవస్థలో దోపిడీ సాధనాలుగా మారుతున్నాయి. అందువలననే పెట్టుబడియనేది ఒక నిర్ణీతమైన సామాజిక సంబంధమని మార్క్సు చెప్పారు. పెట్టుబడి అంటే "ఒక ప్రత్యేకమైన, చరిత్ర నిర్ణయించిన సామాజిక సంబంధమ"ని లెనిన్ చెప్పారు.

## సజీవ శ్రమపై పెత్తనంచేసే నిర్జీవ శ్రమయే పెట్టుబడి

స్థూలదృష్టికి ఉత్పత్తి సాధనాలన్నీ భవిష్యదుత్పత్తికి తోడ్పడే సాధనాలుగా కనబడతాయి. కాని నిజానికి వేమిటి? ఎక్కడనుండి వచ్చాయి? పెట్టుబడిదారు వీటిని సృష్టించాడా? లేదు. ఇవన్నీ కార్మికులు వారం క్రిందటో, నెలక్రిందటో, సంవత్సరంక్రిందటో సృష్టించినవే. అంటే యివన్నీ కార్మికుల యొక్క శ్రమ జనితాలే. అయితే ఆ శ్రమ యిప్పుడు సజీవంగా లేదు. యంత్రాలు పన్ముట్ల రూపాన్ని ధరించిన నిర్జీవ శ్రమగా ఉన్నది.

అయితే ఉత్పత్తి సాధనాలు వాటంతటవి నూతన విలువలను సృష్టించలేవు. వాటికి కార్మికశ్రమ-అంటే సజీవ శ్రమ - తోడు కావాలి. ఉత్పత్తి సాధనాలపైన - అంటే నిర్జీవ శ్రమపైన - యాజమాన్యంగల పెట్టుబడిదారులు, కార్మికులను అంటే సజీవశ్రమను దోపిడీచేసి, అదనపు విలువను గుంజుతారు. కాబట్టి నిర్జీవశ్రమ సజీవశ్రమను దోపిడీ చేస్తూంది. ఈ విధంగా ఉత్పత్తి సాధనాలరూపం ధరించిన నిర్జీవశ్రమయే పెట్టుబడి అవుతూంది. మార్క్సు పెట్టుబడిని యీ క్రిందివిధంగా చిత్రించారు: "పెట్టుబడి అన్నది నిర్జీవశ్రమ. రక్తం త్రాగుతూ బ్రతికే గండభేరుండ పక్షివలె యీనిర్జీవ శ్రమ సజీవశ్రమను పీల్చి పిప్పిచేస్తూ బ్రతుకుతుంది."

## పెట్టుబడియొక్క చలనక్రమం (Turnover of capital)

నిరంతర చలనంలో ఉంటేనే పెట్టుబడి జీవిస్తుంది. ఒక ఫ్యాక్టరీగాని, యంత్రంగాని మూసేసి కూర్చుంటే క్రమంగా

శిథిలమై నశించిపోతుంది. పెట్టుబడిదారు కేమాత్రమూ లాభం సంపాదించిపెట్టలేదు. ఫ్యాక్టరీనిగాని, యంత్రాన్నిగాని విని యోగిస్తూన్నపుడు అవి తమ విలువలను, ముడిపదార్థాలు వగైరాల విలువలను తిరిగి సంపాదించడమేగాక కార్మికులు సృష్టించిన నూతన విలువనుకూడ సంపాదించిపెట్టి, కార్మికుల కూలి పోను అదనపు విలువనుకూడ చేకూర్చిపెడతాయి. కాబట్టి పెట్టుబడి జీవించి యుండడమంటే లాభాన్ని సంపాదించిపెట్టడమన్నమాట. పెట్టుబడిని ఉపయోగిస్తాంటేనే అది జీవిస్తూంటుంది. నిరంతరం వివిధ రూపాలు ధరిస్తూంటేనే బ్రతుకుతూంటుంది. ధనరూపంనుండి ముడిపదార్థాలు, యంత్రాలు, కూలి వగైరాలలోకి మారి, నూతన సరుకులుగా మారి, తిరిగి ధనరూపంలోకి మారుతూండాలి. ఈ క్రమం మాటిమాటికీ కొనసాగుతూంటేనే పెట్టుబడి పెంపొందగలుగుతుంది.

ఈక్రమాన్నే పెట్టుబడియొక్క చలనక్రమ మంటాము. ఈ క్రమం గనుక ఏ కారణం చేతనైనా ఆగిపోతే, పెట్టుబడి నిర్వీర్యమవుతుంది. లాభాలురావు. క్రమంగా తగ్గిపోయి నశించిపోతుంది. అయితే పెట్టుబడియొక్క చలనక్రమం అనేక విషయాలపైన ఆధారపడియుంటుంది. (వివరాలు పెట్టుబడిదారీ సంక్షోభం అనే అధ్యాయంలో చూడగలము.)

## పెట్టుబడి సంచయము (Accumulation of capital)

గత అధ్యాయంలో పెట్టుబడిదారు లాభ తృష్ణకు అంతులేదని, అదనపు విలువను పెంచుకోటానికి అనేక పద్ధతు లవలంబిస్తాడని తెలుసుకున్నాము. లాభం లేనిదే పెట్టుబడి జీవించలేదు.

ప్రతి పెట్టుబడిదారూ వీలైనంత ఎక్కువలాభం సంపాదించేందుకు తనతోటి పెట్టుబడిదారులతో పోటీపడుతూనే ఉంటాడు. నిరంతరం తన సంపదను వృద్ధిచేసుకోలేని పెట్టుబడిదారురంగంనుండి నిష్క్రమించక తప్పదు. పెట్టుబడిదారీ విధానంలో యిదొక సహజ సూత్రం. పోటీలో తట్టుకుని, లాభాలింకా ఎక్కువ సంపాదించాలంటే పరిశ్రమలను విస్తరింపజేసి, టెక్నిక్‌ను అభివృద్ధిచేసి కార్మికుల నెక్కువగా దోపిడీచేయుట ద్వారానే సాధ్యమవుతుంది. ఇవన్నీ చేయాలంటే అదనపు విలువలో అధికభాగాన్ని పెట్టుబడికి కలిపి, ఆ పెట్టుబడిని పెంచుటద్వారానే సాధ్యమవుతుంది. ఈ విధంగా అదనపు విలువను పెట్టుబడిక్రింద మార్చడాన్నే పెట్టుబడియొక్క సంచయం అంటాం.

పెట్టుబడిదారు యీ క్రింది విధంగా తన అదనపు విలువను వినియోగించవచ్చు.

అ) పరిశ్రమను విస్తరింపజేయవచ్చు; లేదా నూతన పరిశ్రమను నెలకొల్పవచ్చు.

ఆ) బ్యాంకులలో ధనరూపంలో నిల్వచేసుకుని వడ్డీ సంపాదిస్తూ, అదనువచ్చినపుడు తిరిగి పరిశ్రమలలో పెట్టవచ్చు.

ఇ) వ్యాపారపెట్టుబడిగా వినియోగించవచ్చు.

ఈ) ఫైనాన్సు పెట్టుబడిగా మార్చవచ్చు. (అదనపు విలువను వెనుకబడిన వలసదేశాలకు రవాణాచేసి, అచట చౌకగా ముడిపదార్థాలను శ్రమశక్తిని కొని, దోపిడీద్వారా ఎక్కువ లాభాలు సంపాదించవచ్చు. వీటినిగురించి వివరాలు తర్వాత అధ్యాయాలలో తెలుసుకోగలం.)

## పెట్టుబడియొక్క సమీకరణ - కేంద్రీకరణలు

పెట్టుబడిదారులమధ్య నిరంతరం పోటీ జరుగుతూనే ఉంటుంది. ఒకరినిమించి ఒకరు ఉత్పత్తి పద్ధతులలో సాంకేతికాభివృద్ధిని సాధించి, ఎక్కువలాభాలు సంపాదించాలని చూస్తూనే ఉంటారు. ఈ పోటీలో నిలబడ గలిగినవారి చేతులలో అధికాధికంగా పెట్టుబడి సమీకరించబడుతూంటుంది.

సాంకేతికాభివృద్ధిని సాధించిన పెట్టుబడిదారీ సంస్థలు ఎక్కువ లాభాలు సంపాదించ గలుగుతాయి. ఎక్కువ పెట్టుబడి వారి చేతులలో పోగుపడు తూంటుంది. ఈ పెట్టుబడితో తిరిగి నూతనయంత్రాలను ప్రవేశపెట్ట గలుగుతారు. పెద్ద ఎత్తున నిర్మాణం అభివృద్ధిచేసుకోగలుగుతారు. పరిశ్రమలను విస్తరింపచేసుకోగలుగుతారు. ఈ విధంగా ఈ సంస్థలు మరింత పెద్దసంస్థలు కాగలవు. కొన్నికొన్ని పెద్ద భారీ పరిశ్రమలలో వీరు తప్ప చిన్నచిన్న పెట్టుబడిదారులు ప్రవేశించుటకు వీలులేకుండా పోతుంది (ఉక్కు, యినుము వగైరా పరిశ్రమలలో). చిన్నచిన్న పెట్టుబడిదారులు రంగంలోనుండి నిష్క్రమించనైనా నిష్క్రమిస్తారు; లేదా చిన్న పరిశ్రమలలోనైనా పెట్టుబడి పెడతారు. ఈ చిన్న పరిశ్రమలలోకూడా అనేకమంది చిన్నపెట్టుబడిదారులమధ్య పోటీఉండనే ఉంటుంది. అప్పుడప్పుడు పెద్ద పెట్టుబడిదారులు ఈ పరిశ్రమలలో ప్రవేశించి, వీరిని నెట్టివేయడంకూడా కద్దు. సంక్షోభసమయాల్లో చిన్నచిన్న పెట్టుబడిదారు లనేకమంది దివాళాతీయడమో, లేక తమ పరిశ్రమలను పెద్ద పెట్టుబడిదారుల కమ్మివేసుకోవడమో జరుగుతుంది.

ఈ విధంగా లాభాలద్వారా వ్యక్తిగత పెట్టుబడులు పెరుగుదలను పెట్టుబడి సమీకరణ అని, చిన్నచిన్న పెట్టుబడిదారులు నాశనమవుతూ, వారి పెట్టుబడి పెద్ద పెట్టుబడిదారుల పెత్తనంలోకి పోవడాన్ని పెట్టుబడి కేంద్రీకరణ అని పిలుస్తారు.

మన దేశంలోనే పెట్టుబడి సమీకరణ ఎలా జరుగుతూందో, యీ క్రింది ఉదాహరణలు తెలియజేస్తాయి. బిర్లా గ్రూపుకుచెందిన హిందూస్తాన్ సుగర్ మిల్స్ అనే కంపెనీ పెట్టుబడి యీ క్రిందివిధంగా పెరిగింది.

| | 1945 | 1947 | 1949 | 1951 |
|---|---|---|---|---|
| చెల్లించబడిన మూలధనం | 15 లక్షలు | 15 లక్షలు | 35 లక్షలు | 50 లక్షలు |
| రిజర్వు ఫండు | 15 లక్షలు | 1 లక్ష 50 వేలు | 15 లక్షల 50 వేలు | 12 లక్షల 50 వేలు |

అదేవిధంగా, టాటాలోకో మోటివ్ & ఇంజనీరింగ్ కంపెనీ లిమిటెడ్ వారు పెట్టుబడిని ఎలా సమీకరించారో చూడండి.

| | 1946 | 1948 | 1950 | 1951 |
|---|---|---|---|---|
| చెల్లించబడిన మూల ధనం | 1,00,00,000 | 1,99,92,250 | 2,00,00,000 | 3,50,00,000 |
| రిజర్వు ఫండు | | | 10,00,000 | 16,00,000 |

ఇదేవిధంగా, పెట్టుబడి కేంద్రీకరణకూడ జరిగింది. మొదట్లో రెండుమూడు పరిశ్రమలతో ప్రారంభించిన టాటా, బిర్లా, దాల్మియా, సింఘానియా వగైరా పెట్టుబడిదారులు యీనాడు ఒక్కొక్కరు 80, 90 పరిశ్రమలవరకుకూడ తమ

యాజమాన్యం క్రిందికి తెచ్చుకోగలిగారు. నెమ్మదిగా గుత్త పెట్టుబడిదారులుగా పరిణామం జెందారు.

(పై ఉదాహరణలు ఇన్వెస్టర్స్ ఎన్సైక్లో పీడియా 1951 – '52 నుండి యివ్వబడ్డాయి.)

## పెట్టుబడిదారీ ధన సంచయంయొక్క చారిత్రక పరిణామం

### 1. చిన్న చిన్న పెట్టుబడిదారులు చితికిపోవుట

ధనసంచయం జరుగుతూన్న కొలదీ, సమాజంయొక్క సంపద బడా పెట్టుబడిదారుల చేతులలో కేంద్రీకరింపబడు తూన్న కొలదీ, పోటీలో నిలబడలేని చిన్న పెట్టుబడిదారులు చితికిపోతూనే ఉంటారు. వీరు చితికినకొలదీ బడా పెట్టుబడి దారులు మరింత బలపడతారు.

అయితే చిన్న పెట్టుబడిదారులు పూర్తిగా నాశనంగారు. తిరిగి తిరిగి తలయెత్తుతూనే ఉంటారు. చిన్న వ్యాపారస్థులు, చేతివృత్తులవారు, వ్యక్తిగత ఉత్పత్తిదారులైన రైతులు, షాపు యజమానులు, చిన్న సంస్థల యజమానులు ఉంటూనే ఉంటారు. కాని రానురాను ఆర్థికంగా వీరి బలమూ, పెత్తనమూ ఉత్పత్తిలో భాగమూ తగ్గుతూంటాయి. బడాపెట్టుబడిదారులు శక్తివంతులవుతుంటారు. వీరి దయా దాక్షిణ్యాలపై చిన్న పెట్టుబడిదారులు ఆధారపడతారు. ఈ విధంగా ప్రతిరోజూ, ముఖ్యంగా సంక్షోభసమయాలలో చిన్న పెట్టుబడిదారులు

తలక్రిందులైపోవడమో లేక కార్మికవర్గంలో చేరిపోవడమో జరుగుతూనే ఉంటుంది.

## 2. కార్మికవర్గ దోపిడీ అత్యధికమగుట

పెట్టుబడి సమీకరణ, కేంద్రీకరణలు జరిగినకొలదీ కార్మికుల దోపిడీ నిష్పత్తి పెరుగుతూంటుంది. పెట్టుబడిదారులు యంత్రాభివృద్ధినిగాని, సాంకేతికాభివృద్ధినిగాని సాధిస్తున్నా రంటే కార్మికుల శ్రమభారాన్ని తగ్గించేందుకు గాదు. ఎక్కువ అదనపు విలువను గుంజేందుకే వీటి నుపయోగిస్తారు. మన దేశంలో యీనాడు ప్రవేశపెడుతున్న రేషనలైజేషన్ పద్ధతులవల్ల కలిగే దుష్ఫలితాలు చూస్తూనేవున్నాము. బట్టలు, జనపనార పరిశ్రమలలో నూతన యంత్రాలను, నూతన ఉత్పత్తి పద్ధతులను ప్రవేశపెట్టుటద్వారా కార్మికుల శ్రమ భారం 2-2½ రెట్లు పెంచబడుతూంది. యజమానులు విపరీత లాభాలు గుంజుతున్నారు. ఒక్కొక్క పరిశ్రమలో కొన్ని వేల మంది కార్మికులను నిరుద్యోగులుగా చేస్తున్నారు.

ఒకవైపు పెట్టుబడిదారుల చేతులలో ఎక్కువ సంపదలు ప్రోగుపడుతూంటాయి. రెండోవైపు కార్మికుల కూలి భాగం తగ్గిపోతూ, దరిద్రం పెరుగుతూంటుంది. ఉదాహరణకు భారతదేశంలో క్రమానుగతంగా ఒకవైపున పారిశ్రామికాదాయం పెరుగుతూంటే రెండోవైపున దానిలో కార్మికుల కూలిశాతం యెలా తగ్గుతూందో యీ క్రింది అంకెలు తెలియజేస్తాయి.

| సంవత్సరం | పారిశ్రామికాదాయం (కోట్ల రూపాయలలో) | కూలిభాగం కోట్ల రూపాయలలో | శాతం |
|---|---|---|---|
| 1939-40 | 370.0 | 181.27 | 48.99% |
| 40-41 | 406.2 | 198 47 | 48.86% |
| 41-42 | 602.0 | 317.49 | 52.74% |
| 42-43 | 956.0 | 472 72 | 49.44% |
| 43-44 | 1240.0 | 622.8 | 50 22% |
| 44-45 | 1112.0 | 537.6 | 48.34% |
| 45-46 | 1033.8 | 489.4 | 47.35% |
| 46-47 | 938.2 | 406.56 | 43.33% |
| 47-48 | 980.0 | 490.92 | 50.01% |
| 48-49 | 1154.5 | 544.63 | 47.17% |

(ఈస్టరన్ ఎకానమిస్టు నుండి).

1939-47 వరకు పాకిస్తాన్‌తో కలసిన భారతదేశం లెక్కలు. కార్మికుల భాగంలో గుమస్తాల, తదితర ఉద్యోగుల జీతాలు, బోనసులు వగైరా తీసివేస్తే కార్మికుల భాగం యింకా తక్కువగానే ఉంటుంది.

టెక్నిక్ అభివృద్ధియై కార్మికవర్గంయొక్క ఉత్పత్తి శక్తి పెరుగుతూంటే, కార్మికుల కూలి యెలా తగ్గుతూందో యీ క్రింది వివరాలు స్పష్టంగా తెలియజేస్తాయి.

అమెరికాలో కార్మికుల ఉత్పత్తిశక్తి పెరుగుదల, కూలి తగ్గుదల.

| సంవత్సరం | కార్మికుని సగటు ఉత్పత్తిశక్తి | కూలి ప్రమాణం |
|---|---|---|
| 1939 | 100 | 100 |
| 1940 | 106 | 98 |
| 1941 | 117 | 96 |
| 1942 | 127 | 95 |
| 1943 | 135 | 93 |
| 1944 | 135 | 95 |
| 1945 | 138 | 94 |

భారత దేశంలోకూడా ఒకవైపు పారిశ్రామికోత్పత్తి పెరుగుతూంటే కార్మికుల కూలి తగ్గుతూంది.

| సంవత్సరం | సగటు పారిశ్రామికోత్పత్తి | సగటు కూలి ప్రమాణం |
|---|---|---|
| 1939 | 100 | 100 |
| 39–40 | 110 3 | 100 |
| 40–41 | 114.2 | 102.92 |
| 41–42 | 123 2 | 92.19 |
| 42–43 | 125.5 | 101.22 |
| 43–44 | 126.8 | 73 94 |
| 44–45 | 121.7 | 81.25 |
| 45–46 | 120.0 | 81.22 |
| 46–47 | 105.0 | 82.19 |

(ఈస్టరన్ ఎకానమిస్టు నుండి)

పై లెక్కలను చూచినపుడు ఒకటి స్పష్టమవుతుంది. క్రమంగా పెట్టుబడిదారీవర్గం మధ్య కార్మికవర్గం మధ్య అఖాతం పెరుగుతూంటుంది. బూర్జువా అర్థశాస్త్రజ్ఞులు, వారి తొత్తులైన సోషల్ డెమోక్రట్లు వర్గ సంఘర్షణ సన్నగిలుతూందనీ, పెట్టుబడిదారీ విధానంలో వర్గసామరస్యం సాధించవచ్చుననీ పలికే ధర్మపన్నాలన్నీ వట్టి బూటకాలని రుజువవుతుంది.

దరిద్రంతోపాటు, కార్మికవర్గ నిరుద్యోగ సైన్యంకూడ పెరుగుతూంటుంది. పెట్టుబడిదారీ విధానం అభివృద్ధి అయ్యేకొలదీ ఒకవైపు క్రమంగా బీదరైతులు, చిన్న వృత్తిదారులు నిరాధారులై కార్మికవర్గంలో కలుస్తూంటారు. రెండవవైపు టెక్నిక్ అభివృద్ధియై, మానవశ్రమకు బదులు యంత్రశక్తి ఉపయోగం ఎక్కువైన కొలదీ, ఉత్పత్తిశక్తి పెంపొందే కొలదీ మరికొంతమంది నిరుద్యోగులౌతారు. అంటే అసలు కొత్త ఉద్యోగాలే ఉండవనిగాదు. విస్తరణ జరిగినపుడు కొంతమంది కొత్తగా ఉద్యోగాలలో నియమింపబడినా, ఉద్యోగాలు, వృత్తులు క్రమంగా పోగొట్టుకునేవారి సంఖ్య వీరికన్న చాలా ఎక్కువ ఉంటుంది. ఈ విధంగా కార్మిక రిజర్వు సైన్యం నిరంతరం పెరుగుతూనే ఉంటుంది. 'అదనపు జనాభా' ఉన్నట్లు గోచరిస్తుంది.




అ=కొత్త కార్మికులు ఈ=తిరిగి ఉద్యోగం లభించినవారు
ఆ=ఉద్యోగం దొరకని వారు ఉ=నిరుద్యోగులలో రిటైర్ అయ్యేవారు
ఇ=తొలగించబడ్డవారు ఊ=ఉద్యోగులలో రిటైర్ అవుతున్న వారు

ఈ నిరుద్యోగ రిజర్వుసైన్యం పెట్టుబడిదారీ వర్గాని కొక వరప్రసాదం. సుభిక్షా కాలంలో పెట్టుబడిదారులకు కావలసిన అదనపు కార్మికులను యిది సప్లైచేస్తుంది. మాంద్యం ఉన్నపుడు వీరిని చూపించి, కొలువులోఉన్న కార్మికుల వేత నాల కోతకు తోడ్పడుతుంది.

సంపద వృద్ధియైనకొలదీ కష్టజీవుల దరిద్రం ఎలా పెరుగు తుందో వివరిస్తూ, మార్క్స్ "పెట్టుబడి" అనే గ్రంథంలో యిలా వ్రాశారు :

"సమాజసంపద వృద్ధియైనకొలదీ, పెట్టుబడి, దాని శక్తి ప్రాబల్యం పెంపొందేకొలదీ, దాని పర్యవసానంగా కార్మిక వర్గం సంఖ్య పెరిగినకొలదీ, కార్మికుల ఉత్పత్తిశక్తి అతి

శయించేకొలదీ నిరుద్యోగులగు కార్మికుల సంఖ్య, పారిశ్రామిక రిజర్వు సైన్యంకూడ పెరుగుతుంది. . .పనిలో నియుక్తులైన కార్మికుల సంఖ్యను నిరుద్యోగులగు కార్మికుల సంఖ్యతో పోల్చినపుడు నిరుద్యోగుల సంఖ్య పెరిగినకొలదీ కార్మికుల దరిద్రం, బాధలూ హెచ్చుతాయి. కార్మికవర్గంలో యీ విభాగాలు ఎక్కువైనకొలదీ దరిద్రం మరింత పెరుగుతూంటుంది. పెట్టుబడిదారీ సంపత్సంచయంయొక్క పరమసత్యం యిదే.

". . .ఒకవైపున సంపద ప్రోగుపడుతూంటే దాని పర్యవసానంగా రెండవవైపున దారిద్ర్యం, క్రుంగదీసే శ్రమభారం, బానిసత్వం, మూఢత్వం, క్రూరత్వం, మానసిక పతనం యివన్నీ పెంపొందుతుంటాయి."

## (iii) ఉత్పత్తి - వినిమయానికి వైరుధ్యం

ప్రతి పెట్టుబడిదారూ తన లాభాల నిమిత్తం కార్మికులనెక్కువగా దోపిడీచేస్తాడు. కూలి తగ్గిస్తూంటాడు. కార్మికుల కొనుగోలుశక్తి రాను రాను పడిపోతుంటుంది. దీనితో క్రమంగా మార్కెట్ క్షీణిస్తూంటుంది. ధన సంచయంయొక్క యీ పరిణామమువలన పెట్టుబడిదారులు పరిష్కరించలేని వైరుధ్యాన్ని, ఉత్పత్తికి -సరుకుల అమ్మకానికి మధ్య వైరుధ్యాన్ని ఎదుర్కోవలసివస్తుంది.

## (iv)వర్గకలహం తీవ్రమవుతుంది:-

వివిధ పారిశ్రామిక సంస్థల మధ్య, రాష్ట్రాల, దేశాల మధ్య సంబంధాలు ఎక్కువై ఒక పరిశ్రమతో మరొక పరిశ్రమ పెనవేసుకుపోతుంది. దీనితో వివిధ వ్యక్తుల శ్రమ సమైక్యత

పొంది, వారి మధ్య అదృశ్యములగు సంబంధాలేర్పడతాయి. లక్షలాది కార్మికుల మధ్య సన్నిహిత సంబంధం నెలకొంటుంది. శ్రమ సామాజికమవుతుంది. అయితే ఉత్పత్తి సాధనాలపై ప్రయివేటు యాజమాన్యముండుటవలన లాభాలు కొద్దిమంది వ్యక్తుల చేతులలో ప్రోగుపడతాయి. అశేష ప్రజాసామాన్యం దారిద్ర్యానికి గురియౌతారు. తత్ఫలితంగా వర్గకలహం తీవ్రతర మవుతూంటుంది.

ఈ విధంగా పెట్టుబడిదారీ విధానం ఆర్థిక సుస్థిరత్వాన్ని గాని, సామాజిక సుస్థిరత్వాన్ని గాని సాధించలేకపోతుంది. ప్రతి దేశంలోను మాటిమాటికీ ఆర్థిక, రాజకీయ సంక్షోభాలకు, యుద్ధానికి దారితీస్తుంది. పెట్టుబడిదారీయాజమాన్యంలో ఉన్నంతకాలమూ ప్రతియంత్రము, ప్రతి నూతన ఉత్పత్తి సాధనము మానవుని శ్రమభారాన్ని ఎక్కువ చేయుటకు, దోపిడీ నెక్కువచేయుటకు వినియోగించబడుతుంది. అదనపు విలువను సృష్టించిపెట్టుటకు, దాని పర్యవసానంగా వచ్చే వైరుధ్యాలను పెంపొందించేందుకు తోడ్పడుతుంది. తత్ఫలితంగా రానురాను పెరిగే దారిద్ర్యం, నిరుద్యోగం, వలసదోపిడీ, యుద్ధాలపీడ యివన్నీ తయారవుతాయి. ఇటువంటి పరిస్థితులలో పెట్టుబడిదారీ విధానంలో కార్మికవర్గంయొక్క, ప్రజాసామాన్యంయొక్క పరిస్థితి బాగుపడుతుందని వాదించడం హాస్యాస్పదం ! ఏదైనా ఒక దేశంలో తాత్కాలికంగా కార్మికుల జీవనస్థాయి కాస్త మెరుగుగా ఉండవచ్చు. ఇంగ్లండు లాంటి దేశాలలో వలస ప్రజలను దోపిడీచేయుటద్వారా తమ దేశంలోని కార్మికులలో కొందరికి ఎక్కువ జీతాలిచ్చి

వారిని పెట్టుబడిదారీ ఏజంట్లుగా తయారుచేసుకోవచ్చు. (వీరినే కార్మికప్రభువర్గమంటారు. కాని వీరి పరిస్థితికూడ సంక్షోభసమయాల్లో చితికిపోతూంటుంది) అయితే రెండవ వైపున లక్షలాది ప్రజాసామాన్యం, వలస అధీన దేశాల కార్మికులు, రైతులు, చెమటోడ్చి పనిచేయించే పరిశ్రమలలోని కార్మికులు, భూములనుండి వెళ్లగొట్టబడిన రైతాంగం, చిన్న వ్యాపారస్థులు, వృత్తిదారులు వీరంతా నిరంతరం పెట్టుబడిదారీ జగన్నాధ రధచక్రాలక్రిందపడి నలుగుతూ అంతులేని దారిద్ర్యానికి, దౌర్భాగ్యానికి గురి అవుతూనేఉంటారు.



# 7 వ అధ్యాయము

# అదనపు విలువ పంపకం

పెట్టుబడిదారులు కార్మికులను దోచుకొనుటద్వారా అదనపు విలువ సంపాదిస్తున్నారు. కాని యీ అదనపు విలువ అంతా వారి చేతుల్లోనే ఉండదు. పెట్టుబడిదారీ విధానంలో జరిగే సామాజికోత్పత్తిలో రకరకాల బాధ్యతలను నెరవేర్చే అనేకమంది యితర పెట్టుబడిదారులు, వర్తకులు, భూస్వాములువగైరా లుంటారు. అదనపు విలువను వీరందరూ పంచుకుంటారు.

కష్టజీవులు ఉత్పత్తిచేసే మొత్తం అదనపువిలువ వివిధ పారిశ్రామిక, వర్తక పెట్టుబడులు, అరువు, బ్యాంకు పెట్టుబడులమధ్య ఏవిధంగా పంపకమవుతుందో పరిశీలించుదాం.

## పెట్టుబడియొక్క అంగనిర్మాణం
## (Organic composition of capital)

పెట్టుబడిదారీ వ్యవస్థలో లక్షోపలక్షల రకాల పరిశ్రమ లుంటాయి. వాటిలో పెట్టబడే పెట్టుబడి మొత్తాలలో స్థిర పెట్టుబడికి, అస్థిర పెట్టుబడికి మధ్య తేడాలుంటాయి. ఉదా: క్వారీ పరిశ్రమలోకన్న ఎలెక్ట్రిసిటీ ఉత్పత్తి పరిశ్రమలో స్థిర పెట్టుబడిభాగం ఎక్కువగాను, అస్థిర పెట్టుబడిభాగం తక్కువగాను ఉంటుంది. ఈ విధంగా అస్థిర పెట్టుబడి భాగంకన్న, స్థిర

పెట్టుబడిభాగం ఎక్కువగా కలిగియుండే పరిశ్రమలో పెట్టుబడి యొక్క అంగనిర్మాణం ఘనంగా ఉన్నదంటాము. క్వారీల లాంటి పరిశ్రమలలో స్థిర పెట్టుబడిభాగంకన్న, అస్థిర పెట్టుబడి భాగం ఎక్కువగా ఉన్నపుడు ఆ పెట్టుబడియొక్క అంగ నిర్మాణం లఘువుగా ఉన్నదంటాము. కాబట్టి స్థిర పెట్టుబడి, అస్థిర పెట్టుబడులమధ్య సంబంధాన్ని లేక నిష్పత్తిని, అంగ నిర్మాణం అంటాము. ఇంకొకవిధంగా చెప్పాలంటే కార్మికుల సజీవ శ్రమకు, ముడిసరుకులు, యంత్రాలు మొదలైనవాటిలో యిమిడియున్న నిర్జీవ శ్రమకు మధ్యగలనిష్పత్తే అంగనిర్మాణం అన్నమాట. లేక ఒక సామాజిక దశలో కార్మికుడు ఉత్పత్తి చేయుటకు ఎంత ముడిసరుకు, యంత్రనిర్మాణం అవసరమవు తుందో తెలియజేసే సంబంధాన్నే పెట్టుబడియొక్క అంగ నిర్మాణ మంటాము. స్థిరపెట్టుబడి సి. అనుకుంటె, అస్థిర పెట్టు బడి వి. అనుకుంటె పెట్టుబడియొక్క అంగనిర్మాణం సి/వి అవు తుంది. స్థిరపెట్టుబడికి మొత్తం పెట్టుబడికి గల నిష్పత్తినికూడ అంగనిర్మాణ మనవచ్చు. రెండవపద్ధతే సర్వసాధారణంగా వాడబడుతుంది.

$$\frac{\text{సి}}{\text{సి}+\text{వి}} = \text{క్యు (అంగనిర్మాణం)}$$

ఉదా : చెప్పుల పరిశ్రమలో స్థిర పెట్టుబడి రు. 600, అస్థిర పెట్టుబడి రు. 400 అనుకోండి.

అలాగే బట్టల పరిశ్రమలో స్థిరపెట్టుబడి రు. 900, అస్థిరపెట్టుబడి రు 100 అనుకోండి. అపుడు చెప్పుల పరిశ్రమలో

అంగనిర్మాణం: $\frac{\text{సి}}{\text{సి}+\text{వి}} = \frac{600}{1000} = \frac{3}{5} = .6$ ఉంటుంది.

బట్టల పరిశ్రమలో అంగనిర్మాణం :

$$\frac{\text{సి}}{\text{సి}+\text{వి}} = \frac{900}{1000} = \frac{9}{10} = .9$$ ఉంటుంది.

2. (a) లాభం రేటు : పెట్టుబడిదారు అదనపు విలువనుగురించి అసలు ప్రస్తావించడు. అదనపు విలువ పెట్టుబడిదారీ సమాజంలో దోపిడీకి లోలబడ్డకాబట్టి, దానిని కప్పిపుచ్చుతాడు. అదనపు విలువను పెట్టుబడిదారులు 'లాభమని' పిలుస్తారు. లాభం పెట్టుబడి మీద వచ్చే ప్రతిఫలంగా చిత్రించి అది న్యాయసమ్మతమైనదని వాదిస్తారు. ఈ లాభం పెట్టుబడిదారుకతి ప్రియమైనది. అందువల్ల పెట్టుబడిదారు ఎల్లపుడూ తన లాభం రేటు పెరుగుతుందా తగ్గుతుందా, అనే చూచుకుంటాడు. లాభం రేటు అంటే అదనపు విలువకు, స్థిర పెట్టుబడి, అస్థిర పెట్టుబడుల మొత్తానికి గల నిష్పత్తి అంటే $\frac{\text{సి}}{\text{సి}+\text{వి}}$ అన్న మాట

లాభం రేటు పి అనుకుంటే పి $= \frac{\text{స}}{\text{సి}+\text{వి}}$ అవుతుంది.

3. లాభం రేటు దేనిపైన ఆధారపడి యుంటుంది ?

(a) అదనపు విలువ రేటుపైన:- పెట్టుబడిదారు రూ 1000/- పెట్టుబడిపెట్టి, అందులో స్థిర పెట్టుబడి క్రింద 900 రూ. కూలి క్రింద 100 రూ. ఖర్చుపెడతాడనుకోండి. అదనపు విలువ రేటు 100% అనుకుంటే, రూ 100/- లాభం వస్తుంది. అదనపు విలువ

రేటు 150% అనుకుంటె లాభంరూ150/-వస్తుంది. సంవత్సరానికి ఒకసారి ఉత్పత్తిక్రమం పూర్తి అవుతుందనుకుంటే మొదటి కేసులో లాభం రేటు $\frac{100}{1000} \times 100 = 10\%$, రెండవ కేసులో $\frac{150}{1000} \times 100 = 15\%$ అవుతుంది.

(b) ఉత్పత్తిక్రమం 6 నెలల కొకసారి (అదే పెట్టుబడితో) పూర్తిఅయితే లాభం రేటు మొదటి కేసులో 20%, రెండవ కేసులో 30% అవుతుంది.

(c) లాభం రేటు పెట్టుబడి అంగనిర్మాణాన్ని బట్టికూడ మారుతుంది. సంవత్సరానికి ఒకసారి ఉత్పత్తిక్రమం పూర్తి అవుతుందనుకోండి. అదనపు విలువ రేటు 100% అనుకోండి. పైన యిచ్చిన ఉదాహరణలోనే ముడిపదార్థాలక్రింద రూ. 700/-, కూలి క్రింద రూ. 300/- ఖర్చుపెట్టాడనుకోండి. అపుడు లాభం రేటు 30% అవుతుంది. అంటే యిదివరకుకన్న పెరిగిందన్నమాట.

అయితే పై ఉదాహరణనుబట్టి కూలిక్రింద ఎక్కువ ఖర్చు పెట్టినకొలది, లాభం రేటు పెరుగుతూన్నట్లు గోచరిస్తుంది. అంటే పెట్టుబడి అంగనిర్మాణం ఘనంగా ఉంటే తక్కువ, లఘువుగా ఉంటే ఎక్కువలాభం వస్తున్నట్లు గోచరిస్తూంది. ఆచరణలో యిలాగే జరిగితే ప్రతి పెట్టుబడిదారూ లఘు అంగ నిర్మాణంగల పరిశ్రమకే ఎగబడతాడు. టెక్నిక్ అభివృద్ధి ఆగిపోతుంది. ఒక్కొక్క పరిశ్రమకు దాని టెక్నికల్ అభివృద్ధి స్థాయినిబట్టి ఒక్కొక్కరకం అంగ నిర్మాణం ఉంటుంది.

1935 లో ఇంగ్లండులో 5 పరిశ్రమలలో అంగనిర్మాణం, లాభాలు యీ క్రిందివిధంగా ఉన్నాయి.

| పరిశ్రమ | స్థి. పె. | కూలి | మొత్తం లాభం |
|---|---|---|---|
| ధాన్యపుమిల్లులు | 82 | 5 | 13 |
| పిండిమరలు | 80 | 6½ | 13½ |
| లినోలియం | 50 | 15 | 35 |
| రసాయన-రంగు పదార్థాలు, మందులు | 46 | 14 | 40 |
| బొగ్గుగనులు | 15 | 62 | 23 |

బొగ్గు పరిశ్రమలో అంగనిర్మాణం చాల తక్కువగా ఉండి, కూలిభాగం చాల ఎక్కువగా ఉంది గాబట్టి ఎక్కువ లాభాలు వస్తాయా? ఆచరణలో ఇంగ్లీషు బొగ్గుగనుల 20 సంవత్సరాల చరిత్రలో లాభం రేటు మామూలు సగటు రేటుకన్న తక్కువగానే ఉంది. దీనికి కారణమేమిటో చూద్దాం.

(4) లాభం రేటు సమానం కావడం: పరిశ్రమను ఎ. బి. సి. అనే 3 భాగాల క్రింద విభజించా మనుకోండి. ఒకొక్క భాగంలో స్థిర పెట్టుబడి, అస్థిర పెట్టుబడి, అదనపు విలువ, సరుకు విలువ యీ క్రిందివిధంగా ఉన్నాయనుకోండి. అదనపు విలువ రేటు 100% అనుకోండి.

| | స్థి. పె | అ. పె | % | సరకుల విలువలు | లాభం రేటు |
|---|---|---|---|---|---|
| ఎ | 80 | 20 | 20 | 120 | 20% |
| బి | 70 | 30 | 30 | 130 | 30% |
| సి | 60 | 40 | 40 | 140 | 40% |

ఇచట లాభాలలో చాల తేడాలున్నట్లు కనబడుతుంది. పెట్టుబడిదారులు 'సి'లో లాభా లెక్కువ లభిస్తున్నాయిగాబట్టి, 'ఎ'లో నుండి విరమించుకుని 'సి' లోకి ఎగబడతారు. అప్పుడు పోటీ పెరిగి సరుకుల ఖరీదులు తగ్గి, లాభం రేటుకూడ తగ్గి పోతుంది. 'ఎ'లో పోటీ తగ్గి, సరుకుల ఖరీదులు హెచ్చి, లాభం రేటు పెరుగుతుంది. కాబట్టి ఆచరణలో అన్ని పరిశ్రమలలోను సగటు లాభం రేటు సమానంగా వచ్చేటట్లు పెట్టుబడులు సర్దు కుంటాయి. (పై ఉదాహరణలో 30% లాభం రేటు). ఇలా సర్దు బాటు కావాలంటే సరుకులు వాటి విలువల ప్రమాణము నకు గాక, వాటి ఉత్పత్తి ధరలకు అంటే ఉత్పత్తిచేయుటలో ఖర్చయిన పెట్టుబడి, సగటు లాభం కలసిన మొత్తానికి కొంచెం అటుయిటుగా ఉండే ధరకు అమ్మబడతాయి. ఈ క్రింది టేబిల్ దీనిని వివరిస్తుంది :

| | స్థి.పె. | అ.పె. | అ.వి. | సగటు లాభం రేటు | సరుకుల విలువ | ఉత్పత్తి ధర | ఉత్పత్తి ధరకు సరుకు విలువకు తేడా |
|---|---|---|---|---|---|---|---|
| అ | 80 | 20 | 20 | 30% | 120 | 130 | + 10 |
| ఆ | 70 | 30 | 30 | 30% | 130 | 130 | 0 |
| ఇ | 60 | 40 | 40 | 30% | 140 | 130 | — 10 |
| | | | | మొత్తం | 390 | 390 | |

పై టేబిల్‌లో కొంతమంది పెట్టుబడిదారులు సరుకు లను వాటి విలువకన్న ఎక్కువధరకు, కొంతమంది వాటి విలువ కన్న తక్కువ ధరకు అమ్మవలసివస్తుంది. దీని నాధారంగా

చేసుకుని బూర్జువా విమర్శకులు కొందరు "చూశారా! మార్క్స్ విలువ సిద్ధాంతం తప్పింది. సరుకులు వాటిలో యిమిడియున్న శ్రమనుబట్టిగాక, వాటి ఉత్పత్తి ధరలకు అమ్ముడౌతున్నాయి. ఈ ఉత్పత్తి ధరలు మార్కెట్‌లో సరుకు యొక్క సప్లై డిమాండులనుబట్టిగదా నిర్ణయింపబడుతున్నాయి" అని ఎత్తిపొడిచారు. కాని మార్క్స్ ఎల్లప్పుడూ సరుకులు సరిగా వాటి విలువలకే అమ్ముడుబోతాయని చెప్పలేదు. సామాన్య ఉత్పత్తి విధానంలో వాటి విలువకు కాస్త అటో యిటో వాటి ధరలు ఊగిసలాడుతుంటా యన్నారు. అలాగే పెట్టుబడిదారీ విధానంలో వాటి ఉత్పత్తిధరల చుట్టూ ఊగుతుంటాయన్నారు. ఒక సరుకుధర దాని విలువ కెక్కువగా ఉన్నా, మరొక సరుకు ధర తక్కువగా ఉన్నా, మొత్తం ధరలు కూడితే మొత్తం విలువకు సరిపోతుంది. అందువల్ల యిచట విలువ సిద్ధాంతం ఎగిరిపోయిందేమీ లేదు. పైగా అసలు సగటు లాభం రేటు శ్రమ విలువ సిద్ధాంతాన్నను సరించే నిర్ణయించబడుతుంది. సరుకుల విలువ నిర్ణయించడంలో సప్లై డిమాండు సూత్రం వర్తించదని యిదివరకే రుజువుచేయబడింది. సప్లై డిమాండులు సరిసమానంగా ఉన్నాయనుకోండి. అపుడు మార్కెట్ ధర ఎలా నిర్ణయిస్తారు? స్థిర పెట్టుబడి అంటే నిర్జీవశ్రమ, అస్థిర పెట్టుబడి అంటే సజీవశ్రమల మొత్తంపై సగటు లాభం రేటు కలిపి ఉత్పత్తిధర నిర్ణయిస్తారు. కాబట్టి శ్రమయే ధర నిర్ణయానికి మూలం.

## 5. అదనపు లాభాల పంపకం

వ్యాపార పెట్టుబడి: సరుకులు కొనడం, అమ్మడంద్వారా అదనపువిలువ రాదని ఇదివరలో చూచాము. ఐతే వ్యాపారులకు లాభ మెలా వస్తుంది? పెట్టుబడిదారీ సమాజం ఉద్భవించక ముందే వ్యాపార పెట్టుబడి ఉండేదని మనం ఎరుగుదుం. పురాతన గ్రీసు వ్యాపారస్తులు, మధ్యకాలపు రోమ్ వ్యాపారస్థులు, పెట్టుబడిదారీసమాజారంభదశలో బ్రిటిష్, డచ్ వ్యాపారస్థులు సరుకులను, ముఖ్యంగా విలాస వస్తువులను వివిధ దేశాలలో తక్కువ ధరలకు కొని, తమ తమ దేశాలలో ఎక్కువ ఖరీదు కమ్మి లాభం సంపాదించేవారు. సముద్రాలపైన వర్తక నౌకలను దోపిడీచేసి, బలవంతంగా వలసదేశ ప్రజలను దోచి వ్యాపారంకూడ సాగించారు. అయితే యీ లాభాలు మారకంలోని హెచ్చుతగ్గులవల్ల వలసదేశాల నిలువుదోపిడీవల్ల సంపాదించారు. పెట్టుబడిదారీ సమాజంలో యీ అవకాశముండదు. అయినా లాభాలెలావస్తాయి?

పెట్టుబడిదారు తాను ఉత్పత్తిచేసిన సరుకులను వెంట వెంటనే అమ్మి, ఆ డబ్బుతో ముడిసరుకులు వగైరా కొని ఉత్పత్తిక్రమం సాగించాలి. లేకపోతే ఉత్పత్తిక్రమం ఆగిపోతుంది. సరుకులు తానే అమ్మడం కష్టం. అందువల్ల సరుకుల అమ్మకం బాధ్యత వర్తకుల కప్పజెపుతాడు. ఈ దళారీ వ్యాపారస్తుడు సరుకులు కొనుటకు కొంత పెట్టుబడి పెట్టాలి. ఈ పెట్టుబడిపైన సగటు లాభంరేటు రానిదే సరుకులమ్మడు. అందువల్ల మొత్తం లాభంలో కొంతభాగాన్ని తాను పొందగలిగితేనే పెట్టుబడి పెడతాడు. ఫ్యాక్టరీ ధరకు తన మార్కెట్ అమ్మకం,

ధరకు మధ్యనుండే తేడాయే యితనికి లాభం. ఆచరణలో యిది ఎలా జరుగుతుందో చూద్దాం. ఉదాహరణ:

ఒక సం॥లో ఉత్పత్తినిమిత్తం ఖర్చుపెట్టబడిన మొత్తం పెట్టుబడి (మిలియన్లలో) 720 (స్థి.పె.) + 180 (అ. పె.)= 900 అనుకుంటే, అదనపు విలువ రేటు 100% అనుకుంటే సరుకుయొక్క ఉత్పత్తి ధర (విలువకూడ యిదే అవుతుంది) 720 + 180 + 180 = 1080 అవుతుంది. లాభంరేటు 20% అవుతుంది.($\frac{18}{90}=\frac{1}{5}=20\%$) ఈ 900 పారిశ్రామిక పెట్టుబడితో పాటు, వ్యాపారస్థుడు ఒక 100 పెట్టుబడి పెట్టాడనుకోండి. అపుడు మొత్తం సామాజిక పెట్టుబడి 900+100=1000 అవుతుంది. మొత్తం పెట్టుబడిలో వ్యాపార పెట్టుబడి $\frac{1}{10}$ అవుతుంది. అంటే మొత్తం లాభంలో (180 లో) $\frac{1}{10}$ వ వంతు లాభం. అంటే 18% లాభం రావాలి. పెట్టుబడిదారుడియొక్క పెట్టుబడి 900 కు 162 లాభం మిగులుతుంది. అంటే అతనికి కూడ 18% లాభం వస్తుంది. అందువల్ల పెట్టుబడిదారు, తన ఉత్పత్తి ధరను 900+180=1080 నుండి 900+162=1062 కు తగ్గించాలి. వ్యాపారస్థుడు 1062 కు కొని, 1080 కి అమ్ముకుంటే, తన 100 పెట్టుబడిపైన 18% గిడుతుంది.

ఇదే విధంగా వ్యాపారస్థుడు, గ్రామాలలో ఉండే రైతులు, చిన్న పరిశ్రమదారుల దగ్గరనుండికూడ సరుకులను తక్కువధరకు కొని, దానికి రవాణా ఖర్చులు, కొలగారం ఖర్చులు మొదలైనవి కలిపి, దానికి సగటులాభంరేటు చేర్చి

మార్కెట్‌లో అమ్మి కొంత లాభం సంపాదిస్తాడు. ఈ విధంగా వ్యాపార పెట్టుబడి చిన్న రైతులను, వృత్తిదారులను దోచుట ద్వారాను, పారిశ్రామిక వస్తువుల అమ్మకంద్వారాను వచ్చిన లాభంలోనుండి కొంత ఖర్చుపెట్టి, తన గుమాస్తాలను, తన క్రింద పనిచేసే కూలీలు వగైరాలను పోషిస్తాడు.

మామూలుగా వ్యాపారంలో సరుకులు పారిశ్రామికాధిపతినుండి కొనుగోలుదారులకు చేరాలంటే, మధ్యలో అనేకమంది దళారులద్వారానే సాధ్యమవుతుంది- టోకు వ్యాపారి- రాష్ట్రం లేక జిల్లాలో టోకు వ్యాపారి- చిల్లర వ్యాపారి-వీరి గుమాస్తాలు, కూలీలు, గ్రామవర్తకుడు,వీరందరు అదనపు విలువలో భాగం పంచుకుంటారు. ఈ విధంగా పెట్టుబడిదారీ విధానంలో అనవసర వ్యాపార ఖర్చులమూలంగా సరుకుల ఉత్పత్తి ధరలు- వాటి విలువలకన్న చాల ఎక్కువగా ఉండడం, ప్రజలకు చాల నష్టం రావడం జరుగుతుంది.

### (a) ప్రొడక్షన్ ఎక్స్ఛేంజి మార్కెట్

వ్యాపారం పెద్ద ఎత్తున జరుగుతూన్నపుడు వాటికి ప్రత్యేక మార్కెట్లుంటాయి. వీటినే ప్రొడక్షన్ ఎక్స్ఛేంజి మార్కెట్లంటారు.వివిధ పారిశ్రామికాధిపతులు, టోకు వ్యాపారులు యిచట చేరుతారు. సరుకు ప్రత్యక్షంగా అక్కడ ఉండదు. కాని పారిశ్రామికాధిపతి తన దగ్గరున్న సరుకు మొత్తానికి దాఖలాచీటి, సరుకు నాణ్యం తెలియుటకై తన ట్రేడ్ మార్కు, గ్రేడింగు చూపిస్తాడు. అపుడు టోకు వ్యాపారి వాటిని కొని యితరుల కమ్ముతాడు.

## స్పెక్యులేషన్ వ్యాపారం

ఒకొక్కప్పుడు వ్యాపారస్తుడు సరుకును అమ్ముటకు గాక, ఎక్కువధర వస్తుందనే ఆశతో బేరం కుదుర్చుకుంటాడు. ధరల ఊగిసలాట నాధారంచేసుకుని తక్కువధర ఉన్నపుడు పేర్లుకొని ఎక్కువధర వచ్చినపుడు అమ్ముకుంటాడు. అమ్మిన వ్యక్తిగాని, కొన్న వ్యక్తిగాని సరుకుమొగం చూడడు. ఒకొక్కప్పుడు విపరీతమైన లాభం, మరొకపుడు విపరీత నష్టంకూడ రావచ్చు. దీనినే స్పెక్యులేషన్ వ్యాపార మంటారు. ఈ వ్యాపారంలో ఒక పెట్టుబడిదారుకు లాభం వచ్చిందంటే, మరొకతనికి నష్టం వస్తుంది. ఆరకంగా లాభనష్టాలు సర్దుబాటవుతూఉంటాయి. ధరలు అరాజకంగాఉండే పెట్టుబడిదారీ విధానంలోనే స్పెక్యులేషన్ వ్యాపారానికి తావుంటుంది.

### అరువు - పెట్టుబడి - పరపతి

వడ్డీ అంటే పెట్టుబడికి ప్రతిఫలమని, పెట్టుబడియొక్క ఉపయోగపు ధర అని (The share alloted to capital as its remuneration or the price for the use of capital) పెట్టుబడిదారీ అర్థశాస్త్రజ్ఞులు చెపుతారు. ఇది ఎంత వరకు నిజం ?

పెట్టుబడిదారీ వ్యవస్థ రాకముందుకూడ వడ్డీవ్యాపారస్థులున్నారు. డబ్బు నిల్వచేసిన కొంతమంది వ్యాపారస్థులు విలాసపురుషులైన ఫ్యూడల్ ప్రభువులకు, కష్టదశలోఉన్న చిన్నచిన్న ఉత్పత్తిదారులకు వడ్డీకి అప్పులు యిచ్చేవారు. ఈపద్ధతి యీనాటివరకు ఇండియా, చైనాలాంటి దేశాలలో

ఉంది. ఆనాటి నీతిశాస్త్రం వడ్డీవ్యాపారం చేయడం పెద్ద పాప మని ఖండించేది.

పెట్టుబడిదారీ సమాజంలో దీనియొక్క రూపం మారింది. ఈ నాడది అతి సహజమైన, అతి న్యాయసమ్మతమైన ప్రతి ఫలంగా చిత్రించబడుతూంది.

## వడ్డీ ఎక్కడనుండి వస్తుంది ?

ఉదాహరణకు ఒక పారిశ్రామికాధిపతి, ఒక వడ్డీ వ్యాపారస్థునిదగ్గర రూ 1000/-లను, 100 కి సంవత్సరానికి 5 రూ చొ॥ వడ్డీకి తీసుకుని, యీ 1000/- పెట్టుబడితో సరుకు ఉత్పత్తిచేసి, రూ 200/- లాభం సంపాదించాడనుకోండి. అంటే 20% లాభం సంపాదించాడన్నమాట. సంవత్సరమయ్యాక యీ రూ 200 లలో రూ 50 వడ్డీ వ్యాపారస్థుడికి వడ్డీక్రింద యిస్తాడు. అంటే తనకు వచ్చిన రూ 200 ల లాభంలోనుండే యీ రూ 50 యిస్తున్నాడు. కాబట్టి వడ్డీ అనేది అదనపు విలువలో ఒక భాగంమాత్రమే. పెట్టుబడిదారు భాగాన్ని లాభమని, వడ్డీ వ్యాపారస్థుని భాగాన్ని వడ్డీఅని పిలుస్తారు. పెట్టుబడి, పెట్టుబడి దారుయొక్క స్వంతధనమైతే వడ్డీఅనేదే ఉండదు. కాని పెట్టు బడిదారు లెక్కలు తయారుచేసేటప్పుడు వడ్డీక్రింద కొంత తీసివేస్తాడు. ఇది తన దోపిడీని కప్పిపుచ్చుటకు కల్పించబడినదే.

ఈరోజులలో వడ్డీవ్యాపారస్థుని దగ్గరగాక, బ్యాంకులలో వడ్డీకి అప్పుతీసుకోవడం సర్వసాధారణంగా జరుగుతుంది. బ్యాంకులకు యీ డబ్బు ఎక్కడనుండి వస్తుంది? అనేకమంది చిన్న ఉద్యోగస్తులు, వ్యాపారులు, కాపిటలిస్టులు తమ ధనాన్ని బ్యాంకులో దాచుకుంటారు. తిరిగి ఒకేసారి అందరకు డబ్బు

తీసుకునే అవసరముండదు. ఈ డబ్బులో కొంత (100 కి 10 వంతులు) అట్టిపెట్టి, మిగతాది బ్యాంకు, పెట్టుబడిదారులకు వడ్డీకి రుణం యిస్తుంది. బ్యాంకు యిచ్చే వడ్డీ రేటుకన్న, పుచ్చుకునే వడ్డీ రేటు ఎక్కువగా ఉంటుంది. ఉదాహరణ:

పారిశ్రామికాధిపతి బ్యాంకునుండి
తెచ్చిన అప్పు రూ. 1000
సరుకుల ఉత్పత్తిద్వారా యితనికి
వచ్చిన లాభం రూ. 100
} రూ. 1100

పారిశ్రామికాధిపతి 100 కి 7 రూ. వడ్డీ చొ॥ అసలుతో కలిపి 1070 బ్యాంకుకిస్తాడు. అంటే బ్యాంకుకు వడ్డీ మూలంగా రూ 70/- వచ్చిందన్నమాట. బ్యాంకు తిరిగి తన డిపాజిటర్లకు 5% చొ॥ 50/- వడ్డీ చెల్లిస్తుంది. ఈవిధంగా కార్మికులు సృష్టించిన అదనపు విలువ మొత్తం రూ 100 లలో నుండి, పెట్టుబడిదారు రూ 30/-, బ్యాంకు యజమాని రూ 20/-, డిపాజిటర్లు రూ 50/- పంచుకొంటారు. ఈవిధంగా బ్యాంకు విషయంలో పెట్టుబడి ఒక సరుకవుతుంది. బ్యాంకు, పెట్టుబడిని కొని అమ్మే ఒక వ్యాపారి అని చెప్పవచ్చు.

## పె ట్టు బ డి వె ల

ఇతర సరుకులవలెనే పెట్టుబడికికూడ ఒక వెల నిర్ణయించబడుతూంది. బ్యాంకు యజమానికి, పెట్టుబడిదారు తాను అప్పు తీసుకున్న రూ 1000/- కి ఒక సం॥లో రూ 70/- వెలగా చెల్లించాడు. అలాగే బ్యాంకు యజమాని, డిపాజిటర్లకు రూ 50/ వెలగా చెల్లించాడు.

## వడ్డీ రేట్లు

వడ్డీరేటు ఎలా నిర్ణయించబడుతుంది? ఈ వడ్డీరేట్లు తరచు మారుతుంటాయి. ధనం వెలకూడా యితర సరుకుల వలెనే సప్లై డిమాండులమీద ఆధారపడివుంటుంది. పారిశ్రామికాధిపతులకు ధనం ఎక్కువ అవసరమై వారిలో వారు పోటీ బడుతూంటే, బ్యాంకు వారికిచ్చే అప్పుకు వడ్డీరేటు పెంచుతుంది. అలాగే పారిశ్రామికాధిపతులకు డబ్బుఅవసరం తక్కువగా ఉండి, బ్యాంకుల్లో దాచుకునే డబ్బు ఎక్కువైతే (సప్లై పెరిగి డిమాండు తగ్గితే) బ్యాంకు తక్కువ వడ్డీరేటుకు పారిశ్రామికాధిపతులకు అప్పు యిస్తుంది. డిపాజిటర్లకుకూడ రేటు తగ్గించేస్తుంది. ఈ విధంగా ధనం సప్లై యెక్కువైనపుడు వడ్డీరేటు తగ్గడంవల్ల ధనం చౌక అవుతుంది. సప్లైతగ్గి, డిమాండు పెరిగినపుడు వడ్డీరేటు పెరిగి ధనం ప్రియమవుతుంది. అయితే ఈ రేటు పెరుగుట కొక పరిమితి వుంటుంది. ఈ పరిమితి సగటు లాభం రేటుపై ఆధారపడియుంటుంది సగటు లాభం రేటుకన్న, బ్యాంకు వడ్డీరేటు ఎప్పుడూ కొంచెం తక్కువగా వుంటుంది. వడ్డీరేటు ప్రత్యేక పరిస్థితులలో ప్రత్యేక ఋణస్థులనుబట్టి కాలం, సెక్యూరిటీ, ప్రమాదాలు మొదలగువాటిని బట్టికూడ మార్చబడుతూంటుంది.

(ఇండియాకు అమెరికా అప్పులు)

## బ్యాంకులు దివాళా తీయుట

బ్యాంకులయొక్క అస్థిత్వం పారిశ్రామికాధిపతుల ఆర్థిక పరిస్థితిపై ఆధారపడియుంటుంది. ఋణస్థులైన పారిశ్రామికాధి

తులు దివాళాతీసినపుడుగాని, తదితర కల్లోల పరిస్థితులలో గాని డిపాజిటర్లకు బాకీ తీర్చుటకు బ్యాంకులవద్ద ధనముండదు. అపుడు బ్యాంకు దివాళాతీస్తుంది. ఈ విధంగా ఒక్కొక్కపుడు అనేక వేలమంది డిపాజిటర్లు నష్టపోవడం జరుగుతుంది.



# 8 వ అ ధ్యా య ము

# పెట్టుబడిదారీ ఆర్థిక సంక్షోభం

పెట్టుబడిదారీ ఉత్పత్తియొక్క లక్ష్యం లాభసంపాదన తప్ప, ప్రజల అవసరాలను సంతృప్తిపరచటం కాదు. ప్రతి పెట్టుబడిదారూ నిరంతరం లాభం సంపాదించుటకు, పెట్టుబడిని కూడబెట్టుటకు, దానితో మరింత లాభం సంపాదించుటకు ప్రయత్నిస్తుంటాడు.

## ఉత్పత్తిలో అరాజకత్వం

పెట్టుబడిదారీ ఉత్పత్తికి ఒక క్రమంగాని, ఒక పథకంగాని ఉండదు. ఏ సరుకును యెంత ఉత్పత్తిచేయాలి, ఉత్పత్తి నెక్కువ చేయాలా, తగ్గించాలా, ఫలానా ఫ్యాక్టరీని మూసివేయాలా, అక్కరలేదా, ఫలానా పరిశ్రమను నెలకొల్పాలా, అక్కర లేదా మొదలైనవన్నీ వ్యక్తిగత పెట్టుబడిదారులే తమకు లాభం బాగా వస్తుందా లేదా, లాభసాటిధరలు వస్తాయా లేవా అనేదానినిబట్టి నిర్ణయిస్తారు. కాబట్టి పెట్టుబడిదారీ ఉత్పత్తిలో ఏదైనా క్రమముంటే అది, సామాజికావసరాలదృష్ట్యా ఒక చైతన్యయుతమైన పథకం ప్రకారం (సోషలిస్టు సమాజంలో వలె) కాక, మార్కెట్ యొక్క గుడ్డిసూత్రాలనుబట్టి నిర్ణయించబడుతుంది.

పెట్టుబడిదారీ ఉత్పత్తియొక్క అరాజకాన్నిగూర్చి ఏంగెల్సు యీ క్రింది విధంగా వివరించారు:

"సామాజికోత్పత్తిలో అరాజకం ప్రబలియుంటుంది. అయితే యితర ఉత్పత్తి విధానాలకు వలెనే, సరుకుల ఉత్పత్తి విధానానికికూడా, దానిలోనే అంతర్భూతమైయుండి, దాని నుండి వేరుజేయరానట్టి సూత్రాలు కొన్ని ఉన్నాయి. ఉత్పత్తిలో అరాజకంవున్నా, ఆ అరాజకంలోనే, అరాజకం ద్వారానే యీ సూత్రాలు బయటపడుతుంటాయి. సామాజిక సంబంధాలరూపంలో, సరుకుల మారకంద్వారా యివి బహిర్గత మవుతుంటాయి. విడివిడిగా ఉండే ఉత్పత్తిదారులను అనివార్య మగు వ్యాపారపోటీద్వారా సామాజిక జీవితంలోనికి యీడు స్తాయి. కాబట్టి మొదట్లో ఈసూత్రాలు వుత్పత్తిదారులకుకూడా కన్పించవు. కాని క్రమంగా, అనుభవంద్వారా యివి వ్యక్త మౌతాయి. ఉత్పత్తిదారులు విడివిడిగా ఉత్పత్తి గావిస్తూ, స్వంతంగానే అమ్ముకుని లాభాలు సంపాదించ జూస్తారు. కాని వారి యిష్టాయిష్టాలకు వ్యతిరేకంగా యీ సూత్రాలు ఉత్పత్తి సంబంధాలను సహజంగా సామాజిక మొనర్చుతాయి. అయితే పెట్టుబడిదారీవిధానం గాబట్టి, గుడ్డిగా పనిజేస్తాయి. సరుకే ఉత్పత్తిదార్లను శాసిస్తుంది." ('యాంటీ-డూరింగు'నుండి)

## పెట్టుబడియొక్క చలనక్రమము - పునరుత్పత్తి

పెట్టుబడి నిరంతరం పరిభ్రమిస్తూంటేనే జీవిస్తూంటుందని యిదివరలో తెలుసుకున్నాం. పెట్టుబడిదారు కొంత ధనాన్ని చేతబట్టుకుని (i) ఉత్పత్తిసాధనాలను, భవనాలు, యంత్రాలు, ముడిపదార్థాలు వగైరాలను (ii) శ్రమశక్తిని కొన్నతరువాతనే,

ఉత్పత్తి క్రమం ప్రారంభమవుతుంది. ముడిపదార్థాలు లభ్యం గాకపోయినా, యంత్రాలు, లేక యంత్రభాగాలు లభ్యంగాక పోయినా, అవి దొరికేవరకు పెట్టుబడి చలనక్రమం నిలిచి పోతుంది. శ్రమశక్తి లభించకపోయినా అంతే. ఉదాహరణకు కార్మికులు సమ్మెచేస్తే చలనక్రమం ఆగిపోతుంది. కాబట్టి పెట్టుబడి చలనక్రమం నిరాఘాటంగా సాగాలంటే, పెట్టుబడి దారు ఎట్టి అడ్డంకులు లేకుండ తన కవసరమైన ఉత్పత్తి సాధనా లను, శ్రమశక్తిని కొనగలిగియుండాలి. పెట్టుబడిదారు ఉత్పత్తిని విస్తృతం చేయాలనుకుంటే యింకా యెక్కువధనం కావాలి. ఇంకా ఎక్కువ ముడిపదార్థాలను, ఉత్పత్తి సాధ నాలను, శ్రమశక్తిని కొనగలిగియుండాలి.

అంతేగాదు. ఉత్పత్తి పూర్తయ్యాక పెట్టుబడిదారు చేతుల్లోకి నూతన సరుకులు వస్తాయి. ఈ సరుకులు అమ్ముడు పోతేనే తిరిగి పెట్టుబడి చలనక్రమం సాగుతుంది. అయితే సరుకు లమ్ముడుపోవాలంటే వీటిని కొనటానికి తయారైనవారు, కొనగలిగేవారు ఉండాలి. కాబట్టి పెట్టుబడియొక్క చలనక్రమం సరుకుల అమ్మకంపైన ఆధారపడియుంది. ఈ సరుకులు ఏ కారణంచేతనైనా అమ్ముడుపోకపోతే చలనక్రమం ఆగిపోవల సిందే. అలా ఆగిపోయినపుడు సంక్షోభం వస్తుంది.

అందుచేత ఆర్థిక సంక్షోభానికి మూలమేమిటో తెలుసు కోవాలంటే, పెట్టుబడియొక్క చలనక్రమం నిలిచిపోవుటకు కారణాలేమిటో పరిశీలించాలి. దీనిని మూడు దృక్కోణాల నుండి పరిశీలించవలసియుంటుంది.

(i) ప్రపంచంలో పెట్టుబడిదారులు వేలు, లక్షలు ఉంటారు. వీరిలో ప్రతిఒక్కడూ తన లాభంకోసమే ఉత్పత్తి చేస్తూఉంటాడు. వీరంతా ఒకరితో ఒకరు లాభంకోసం ఘర్షణ పడుతున్నా, రెండవవైపు ఒక పరిశ్రమకు, మరొక పరిశ్రమకు సంబంధా లుండుటవలన వీరు కలవక తప్పదు. కాబట్టి మొత్తం పెట్టుబడి సామాజికరూపం ధరిస్తుంది. విడివిడిగా ఉండే పెట్టుబడి సామాజికంగా కలుస్తూండడంవలననే ఉత్పత్తి, పునరుత్పత్తిక్రమాలు సాగుతున్నాయి. పునరుత్పత్తి కావాలంటే మొత్తం పెట్టుబడిదారు లందరు తమ తమ సరుకుల నమ్మకో గలిగి యుండాలి. ఏ ఒక్కచోట పెట్టుబడి చలనక్రమం స్తంభించినా మిగతావాటికికూడ ఆ తాకిడి తగులుతుంది. కాబట్టి మొత్తం సామాజిక పెట్టుబడియొక్క చలనక్రమాన్ని పరిశీలిస్తే సంక్షోభానికి కారణం తెలుసుకోగలము.

(ii) సరుకుల ఉత్పత్తికీ, అవి అమ్ముడుపోవడానికీ మధ్యనున్న వైరుధ్యాన్ని పరిశీలించాలి (The study of effective demand in relation to productive capacity).

(iii) దీర్ఘకాలంమీద పెట్టుబడిదారీ వైరుధ్యాలను పెంపొందించి,సంక్షోభానికి దారితీసే పాంశాలను పరిశీలించాలి.

మూడవ విషయాన్ని తరువాత భాగంలో పరిశీలించగలము. మొదటి రెండింటిని యిప్పుడు పరిశీలిద్దాం.

సామాజిక పెట్టుబడియొక్క చలనక్రమాన్నిగురించి చూచేముందు, దాని వివరాలు తెలుసుకోవాలి.

సమాజంలో ఉత్పత్తియైన ప్రతి వస్తువు వినియోగించబడుతుంది - కొన్ని వెనువెంటనే, మరికొన్ని కొంతకాలంలో,

మరికొన్ని దీర్ఘకాలంమీద. ఆహారపదార్థాలు సాధారణంగా వెనువెంటనే ఖర్చవుతాయి. బట్టలు, పుస్తకాలు వగైరా కొంతకాలం మనగలుగుతాయి. యంత్రసామగ్రి, భవనాలు వగైరా చాలాయేండ్లుంటాయి. ఏమైనా ఎప్పుడో ఒకప్పుడు అన్నీ ఖర్చు అవుతాయి. అందువలన అన్నీ తిరిగి ఉత్పత్తి కావలసిందే. సమాజం జీవించియుండాలంటే ఏ వస్తువైనా ఒకసారి ఉత్పత్తిగావడం చాలదు. పదేపదే, తిరిగి తిరిగి ఉత్పత్తి అవుతూఉండాలి. దీనినే వస్తువుల పునరుత్పత్తి అంటాము. అందుకనే మార్క్స్, "సామాజికోత్పత్తి యెడతెగని పునరుత్పత్తి" అన్నారు.

ఏ సమాజంలోనైనా సంవత్సరానికి కావలసిన వస్తువులన్నీ ఉత్పత్తియై, ఆ ఏడాదిలోనే ఖర్చు అయిపోవచ్చు. తిరిగి మరుసటి సంవత్సరంకూడా అదేవిధంగా అవే వస్తువులు ఉత్పత్తి అయి ఖర్చుగావచ్చు. ఇలాంటి ఉత్పత్తి విధానాన్ని సాధారణ పునరుత్పత్తి (Simple reproduction) అంటారు. పెట్టుబడిదారీ విధానంలో ఉత్పత్తి చాలా అధికంగా అభివృద్ధి అవుతుంది. ఏడాదికి కావలసిన సరుకుల కన్న చాలా ఎక్కువ సరుకులు ఉత్పత్తి అవుతూంటే, దాన్ని విస్తృత పునరుత్పత్తి (Extended reproduction) అంటారు. విస్తృత పునరుత్పత్తి పెట్టుబడిదారీ విధానంయొక్క ఒక లక్షణం.

పెట్టుబడిదారీ విధానంలో సరుకుల పునరుత్పత్తి జరుగుతూందంటే, పెట్టుబడికూడ పునరుత్పత్తి జరుగుతూందన్న మాట. ఎందువల్లనంటే పెట్టుబడిదారు ధనంతో బయలుదేరి సరుకులు తయారుచేసి, తిరిగి ఎక్కువ ధనాన్ని సంపాదిస్తున్నాడు. కాబట్టి

పెట్టుబడి మధ్యలో అనేక రూపాలు ధరించి, తిరిగి పెట్టుబడిగా తయారవుతుంది. అయితే తిరిగి తిరిగి అవే సరుకు లుత్పత్తయినపుడు పెట్టుబడి పెరగనక్కరలేదు. అంటే అదనపు విలువను పెట్టుబడికి చేర్చకుండా, ఆ పెట్టుబడితోనే ఉత్పత్తి కొనసాగుతుంది. ఇదే సాధారణ పునరుత్పత్తిక్రమంలో జరిగేది. అయితే విస్తృత పునరుత్పత్తి జరగాలంటే, పరిశ్రమలు విస్తరించాలి. అదనపు విలువను పెట్టుబడికి చేరుస్తూ, పెట్టుబడినికూడ పెంచుతూండాలి.

సాధారణ పునరుత్పత్తిక్రమంలోగాని, విస్తృత పునరుత్పత్తి క్రమంలోగాని సామాజిక పెట్టుబడియొక్క చలనక్రమాన్ని పరిశీలించాలంటే మొత్తం పరిశ్రమ (సమాజంలోని పరిశ్రమలన్నీ కలిపి ఒకే పరిశ్రమ అనుకుంటే) యొక్క వివిధ శాఖల మధ్య ఉండవలసిన సంబంధాలను, నిష్పత్తిని పరిశీలించాలి.

## సాధారణ పునరుత్పత్తిక్రమంలో ఉండవలసిన నిష్పత్తి

మొత్తం పరిశ్రమలను మనం రెండు గ్రూపులుగా విభజించవచ్చును. (i) మానవునకు సూటిగా ఉపయోగపడే వస్తువులను ఉత్పత్తిచేయుటకు ఉపకరించే పరిశ్రమలు – యంత్రాలు, యంత్ర పరికరాలు వగైరా. వీటినే ఉత్పత్తి సాధనాలు అంటారు. (కొన్ని వస్తువులు రెండు రకాలుగా వినియోగపడేవి ఉన్నాయి. ఉదా: బొగ్గు వంటకూ, పరిశ్రమలకూకూడా ఉపయోగపడుతుంది.) (ii) సూటిగా, వెంటనే మానవునికి ఉపయోగపడే ధాన్యం, బట్టలు, పంచదార వగైరాల నుత్పత్తిచేసే పరిశ్రమలు–వీటినే వినిమయ వస్తువులంటాము.

పెట్టుబడియొక్క చలనక్రమం సాఫీగా జరగాలంటే ఈ రెండు గ్రూపుల మధ్య ఏ నిష్పత్తి ఉండాలి? సాధారణ పునరుత్పత్తిలో ఏ నిష్పత్తి ఉండాలో ముందు చూద్దాం.

ఉత్పత్తి సాధనాలను తయారుచేసే గ్రూపును డిపార్టు మెంటు I గాను, వినిమయవస్తువుల నుత్పత్తిచేసే గ్రూపును డిపార్టు మెంటు II గాను భావించుదాం. కార్మికులు, పెట్టుబడిదారులు తప్ప, మరెవరూ లేరనుకుందాం. (నిజానికిది వాస్తవం గాదు. అభివృద్ధియైన పెట్టుబడిదారీ దేశాలలోకూడా బీద రైతులు, చేతివృత్తులవారు ఉంటూనే ఉంటారు. మన సౌలభ్యంకొరకు అలా ఊహించుకుందాం).

I వ డిపార్టు మెంటుకు చెందిన పెట్టుబడిదారులు యంత్రాలను, ముడిపదార్థాలను, శ్రమశక్తిని కొని, కొత్త సరుకులను తయారుచేస్తారు. ఈ సరుకుల విలువ ఎంత? వీటి విలువ=స్థిర పెట్టుబడి+అస్థిర పెట్టుబడి (కూలి) + అదనపు విలువ. అలాగే II వ డిపార్టు మెంటుకు చెందిన పెట్టుబడిదారులు ఉత్పత్తిచేసే వినిమయవస్తువుల విలువకూడ స్థిర పెట్టుబడి+ అస్థిర పెట్టుబడి + అదనపు విలువ.

I వ డిపార్టు మెంటులో ఉత్పత్తి సాధనాలు తయారవుతాయి. ఈ ఉత్పత్తి సాధనాలలో ఒక భాగంమాత్రమే I వ డిపార్టు మెంటులో పునరుత్పత్తికి వినియోగించబడతాయి. ఈ డిపార్టు మెంటులో పనిచేసే కార్మికులు ఉత్పత్తిసాధనాలను తినరుగదా? వారు వినిమయవస్తువులను (బట్టలు, తిండి వగైరా) కొనుక్కోవాలిగదా ! అలాగే యీ డిపార్టు మెంటులోని పెట్టుబడిదారులు, తమ అదనపు విలువతో (అదనపు విలువను

సాధారణ పునరుత్పత్తిక్రమంలో పెట్టుబడికి చేర్చకుండా వినియోగిస్తారుగాబట్టి) వినిమయ వస్తువులను కొనుక్కోవాలి. కాబట్టి I వ డిపార్టుమెంటులో తమ కవసరమైన ఉత్పత్తి సాధనాలు పోగా, మిగిలినవాటిని (అంటే స్థిర పెట్టుబడి భాగం పోను అస్థిర పెట్టుబడి + అదనపు విలువను), II వ డిపార్టు మెంటువారి కిచ్చి, వాటికి బదులుగా తమకు, తమ కార్మికులకు అవసరమైన వినిమయ వస్తువులను తీసుకుంటారు. అలాగే II వ డిపార్టుమెంటులోని పెట్టుబడిదారులు, కార్మికులు తమ డిపార్టుమెంటులో ఉత్పత్తి అయిన సరుకులలో తమ కవసరమైనవాటిని వాడుకుని, మిగతావాటిని (అంటే అస్థి.పె+అ.వి) I వ డిపార్టుమెంటువారి కిచ్చి, తమ డిపార్టు మెంటు కవసరమైన ఉత్పత్తిసాధనాలను తీసుకుంటారు.

ఉత్పత్తిసాధనాల సప్లై, డిమాండులు, వినిమయ వస్తువుల సప్లై డిమాండులు సరితూగాలంటే I వ డిపార్టు మెంటులో ఆ డిపార్టుమెంటు వినియోగించగా మిగిలిన సరుకుల విలువ, II వ డిపార్టుమెంటులో ఆ డిపార్టుమెంటు వినియోగించుకోగా మిగిలిన సరుకుల విలువకు సరిసమానం గావాలి. అంటే I వ డిపార్టుమెంటులోని అస్థిర పెట్టుబడి+అదనపు విలువ కలిసి II వ డిపార్టుమెంటులోని స్థిర పెట్టుబడికి సరిసమానం గావాలి.

## విస్తృత పునరుత్పత్తిలో ఉండవలసిన నిష్పత్తి

విస్తృత పునరుత్పత్తిలో పెట్టుబడి పెరుగుతుందిగదా. మొదటి చలనక్రమంలో సృష్టించబడిన అదనపు విలువలో

కొంతభాగం రెండవ చలనక్రమంలో పెట్టుబడికి చేర్చుతారు. ఇలా పెట్టుబడికి చేర్చిన అదనపు విలువలో కొంతభాగం యంత్రాలు, ముడిపదార్థాలు వగైరా కొనుటకు వినియోగిస్తారు. అంటే స్థిరపెట్టుబడికి చేర్చుతారు. మిగిలినభాగం అదనంగా నియమించబడు కార్మికుల కూలిక్రింద, అంటే అస్థిర పెట్టుబడిగా వినియోగించబడుతుంది. ఈ పరిస్థితులలో సప్లై డిమాండులు సరితూగాలంటే, వినిమయ వస్తువులకు I వ డిపార్టు మెంటుయొక్క డిమాండు, ఉత్పత్తి సాధనాలకు II వ డిపార్టు మెంటుయొక్క డిమాండుతో సరిసమానం గావాలి. అయితే I వ డిపార్టు మెంటులో వినిమయ వస్తువులకు డిమాండు సాధారణ పునరుత్పత్తిలోవలె మామూలు కార్మికుల కూలి (అస్థిర పెట్టుబడి)+పెట్టుబడిదారుల అదనపువిలువగా ఉండదు. కార్మికుల సంఖ్య పెరిగింది గాబట్టి, మామూలు కూలికి కొత్త కూలి (కొత్త అస్థిరపెట్టుబడి) కలవాలి. అలాగే పెట్టుబడిదారులు తమ అదనపు విలువనంతా తినడానికి వినియోగించరు. అందులో కొంతభాగం తీసి, పెట్టుబడికి కలుపుతారు. కాబట్టి యీ అదనపు విలువ భాగాన్ని తీసివేయాలి. అలాగే I వ డిపార్టు మెంటులో ఉత్పత్తి సాధనాలకు డిమాండు ఉండదు. మామూలు స్థిరపెట్టుబడికి కొత్తస్థిరపెట్టుబడిని కలుపుతారు. కాబట్టి I వ డిపార్టు మెంటుయొక్క అస్థిరపెట్టుబడి + కొత్త అస్థిర పెట్టుబడి + పెట్టుబడిదారు వినిమయవస్తువులు కొనుటకు వినియోగించే అనదపు విలువ, II వ డిపార్టు మెంటులోని స్థిర పెట్టుబడి + కొత్త స్థిరపెట్టుబడికి సరిపోవాలి.

పైన వివరించినదానినిబట్టి ఒకటి స్పష్టం. వేలకొలదిగా ఉండే పారిశ్రామిక శాఖలలో ఉత్పత్తి అవుతున్న విలువలమధ్య సరియైన నిష్పత్తి ఉంటేనే, సప్లై డిమాండులు సరి తూగితేనే, రెండు డిపార్టుమెంటులు సాఫీగా నడుస్తాయని తేలుతుంది. కాని ఉత్పత్తి అరాజకంగా జరిగే పెట్టుబడిదారీ విధానంలో యీ నిష్పత్తి ఎప్పుడూకూడ ఖచ్చితంగా అమలు జరగదు. జరగడ మసంభవం. ఒక పథకంప్రకారం మొత్తం సామాజికోత్పత్తిని కొనసాగించే సోషలిస్టు సమాజంలో మాత్రమే సరియైన నిష్పత్తిలో ఉత్పత్తి సాగించబడుతుంది. పెట్టుబడిదారీ విధానంలో వ్యక్తిగత పెట్టుబడిదారులు గుడ్డిగా, ఎచట, ఏదేశంలో, ఎవరు, ఎంత సరుకు నుత్పత్తిచేస్తున్నారో తెలుసుకోరు. తెలియదుకూడా. ప్రతివాడూ తన సరుకులు అమ్ముడుపోతాయనే ఆశిస్తాడు. ఈ డిపార్టుమెంటుల మధ్య వివిధ శాఖల మధ్య ఏ నిష్పత్తి ఉండాలో నిర్ణయించే దెవరు? దాని ఫలితంగా అనేక అవకతవక లేర్పడతాయి. ఒకచోట ఒక సరుకు అధికంగా ఉత్పత్తయితే, ధరలుపడిపోయి దివాళాలకు దారితీస్తుంది. ఒక్కొక్క చోట ఒక సరుకు ఉత్పత్తి తక్కువైనె, ధరలు పెరిగితే తాత్కాలికంగా పెట్టుబడి అటువైపు పరుగెత్తి ఎక్కువ లాభాలుతీయడం కూడా కద్దు. సాంకేతికాభివృద్ధి సాధించబడినపుడుకూడా రెండుడిపార్టుమెంటుల మధ్య ఉండవలసిన నిష్పత్తి మారుతుంది. దానిని సరిదిద్దుకోవలసి యుంటుంది. కాని ఎవరు యిదంతా సరిదిద్దేది? ఈ విధంగా గుడ్డిగా, మొరటుగా, ఒక పథకం లేకుండా మార్కెటు సూత్రాలు, మారకపు సూత్రాలు

పెట్టుబడిదారీ విధానంలో అమలు జరుగుతుంటాయి. అందువలననే, పెట్టుబడిదారీ విధానంలో సరియైన నిష్పత్తిఅనేది ఖచ్చితంగా ఎప్పుడూ ఉండదు. ఒక్కొక్కపుడు యిది తల్లక్రిందులై సంక్షోభాలకు దారితీస్తుంది.

పైన వివరించినట్లు పరిశ్రమలలోని వివిధ శాఖల మధ్య నిష్పత్తి సక్రమంగా ఉండనపుడు, పెట్టుబడిదారీ సంక్షోభాలకు అనువైన పరిస్థితి మాత్రమే ఏర్పడుతుంది. కాని సంక్షోభానికి దానంతటది కారణంమాత్రం కాదు.

క్రమానుగతంగా వచ్చే పెట్టుబడిదారీ సంక్షోభాలకు అసలు కారణం పెట్టుబడిదారీవర్గానికి, కార్మికవర్గానికిమధ్య నుండే వైరుధ్యం. సప్లై డిమాండులు సరితూగకుండా ఉండడానికి కారణం యిదే.

అమెరికాలో గని కార్మికుల జీవితం ఎట్లా ఉంటుందో, ఒక పుస్తకంలోని యీ క్రింది సంభాషణవల్ల తెలుస్తుంది.

"ఒక బొగ్గుగని కార్మికుని కుమారుడు తన తల్లి నిలా ప్రశ్నించాడు: "అమ్మా, నాకు చలివేస్తోందే-మంట వేయవూ?"

"నాయనా, బొగ్గులు లేవురా."

"అమ్మా, బొగ్గు లెందుకు లేవే?"

"మీ నాన్నకు పనిపోయింది. బొగ్గులు కొందా మంటే డబ్బు లేదు బాబూ."

"నాన్నకు పని ఎందుకు పోయిందమ్మా?"

'బొగ్గు ఎక్కువగా ఉందటరా బాబూ.'

"పెట్టుబడిదారీ ఆర్థిక సంక్షోభంలో ఎటువంటి విపరీతాలు సంభవిస్తాయో పై సంభాషణ చక్కగా తెలియజేస్తుంది. బొగ్గు ఎక్కువగా భూగర్భంనుండి తీయబడింది. కాబట్టి బొగ్గుగని కార్మికుని కుటుంబం నిప్పులేక చలిలో బిగుసుకుపోతోంది. గోధుమ చాలా ఎక్కువగా పండినది. కాబట్టి, అది రైలు యింజనులో బొగ్గుక్రింద కాల్చబడుతోంది. లక్షల కొలది ప్రజల పొట్టలు అందుకే మాడ్చబడుతున్నాయి. చాలా ఎక్కువ యిండ్లు కట్టబడినవి. అందుచే అవి ఖాళీగా ఉంటున్నాయి. వేల, లక్షల ప్రజలు చెట్లక్రింద, రోడ్లప్రక్కన నివాసా లుంటున్నారు.

"కాని నిజానికి అవసరంలేనంత ఎక్కువగా రాక్షసి బొగ్గు, రొట్టెలు, యిండ్లు మున్నగునవి ఉత్పత్తి అవుతున్నాయా ? లేదు. సంక్షోభ సమయాలలో ప్రజలకు ఎన్నో వస్తువులు కావలసిఉంటాయి. కాని, పెట్టుబడిదారీ ప్రపంచంలో ప్రజల కెన్ని కోర్కెలుఉన్నా, వారి చేతులలో డబ్బు ఉంటేనే అవి తీరేది. డబ్బు ఉంటే కొండమీద కోతియైనా దిగివస్తుంది. అదిలేకపోతే, ఎవరూ ఖాతరుచేయరు. కాబట్టి, సంక్షోభ దినాలలో బొగ్గు, యిండ్లు, బట్టలు, రొట్టెలు వగైరాలకు అవసరం చాలాఉన్నా, యీ కోర్కెల వెనుక ధనబలం లేకపోవుటచే ప్రజలు యమయాతనలకు గురిగావలసివస్తుంది. ఈ విధంగా ఒకమూల వస్తురాసులు, మరోమూల ఆ వస్తువులు కావలసిన వారు కటికదరిద్రంలో, లేమిలో ఉంటున్నారు. సంక్షోభ కాలంలో యీ విపరీతం మరింత తీవ్రమవుతుంది.

"పెట్టుబడిదారీ విధానంలో సంక్షోభం రావడం అమితోత్పత్తి వల్లనే వస్తున్నది. ఒకమూల అత్యధికంగా సరుకులుత్పత్తి అవుతాయి. ఇంకోమూల యీ వస్తువులను ఉపయోగించవలసినవారు విపరీతంగా దోచుకోబడుటవల్ల వీటిని కొనుక్కోగలశక్తిలేని వారవుతారు. అందుచే యీ సరుకులమ్ముడుగావు." (లియాంటీవ్ - అర్థశాస్త్రం.)

ఈ విధంగా పెట్టుబడిదారీ ఉత్పత్తి విధానంలో అమితోత్పత్తివలన సంక్షోభాలు అనివార్యంగా వస్తూంటాయి. ఎందుకు అనివార్యంగా వస్తాయో కొంచెం లోతుకు వెళ్ళి పరిశీలిద్దాం.



# పెట్టుబడిదారీ ఉత్పత్తి విధానంలో సంక్షోభాలు అనివార్యం

సరుకుల మారకంద్వారా అదనపు విలువనుగుంజి, పెట్టుబడిని పెంచుకోవడమే పెట్టుబడిదారీ ఉత్పత్తియొక్క లక్ష్యం.

పునరుత్పత్తి క్రమంలో పెట్టుబడి మూడురూపాలు ధరిస్తుంది. (i) ధనరూపంలోఉండే పెట్టుబడి, ఉత్పత్తిదాయక పెట్టుబడిగా (యంత్రాలు, ముడిపదార్థాలు, శ్రమశక్తి) మారుతుంది (Money capital is transformed into productive capital). (ii) ఉత్పత్తిదాయక పెట్టుబడి ఎక్కువ

విలువగలిగిన సరుకులుగా మారుతుంది. (iii) ఈ సరుకులు (అదనపు విలువతో సహా) తిరిగి పెట్టుబడిగా మారతాయి. ఈ క్రమం కొనసాగనినాడు పెట్టుబడి నిరర్థకంగా ఉండిపో తుంది. అదనపు విలువను సంపాదించ లేదు.

అయితే, యీ ఉత్పత్తిక్రమంలో అప్పుడప్పుడు అమితోత్పత్తి సంక్షోభాలు ఎందుకు, ఎలా వస్తాయి? ఉత్పత్తి అయిన సరుకులు, ఎందుకు అమ్ముడుపోకుండా నిలచిపోతాయి?

పెట్టుబడిదారీ విధానంలో సరుకులసప్లై డిమాండు ఎలా ఉంటాయో చూద్దాం.

ప్రతి పెట్టుబడిదారూ తన పెట్టుబడిని పెంచుకునేనిమిత్తం లాభాలు సంపాదించేనిమిత్తం నిరంతరం కృషిచేస్తూనేఉంటాడు. నూతన యంత్రాలను, అధునాతన ఉత్పత్తి పద్ధతులను ప్రవేశ పెడుతూనే ఉంటాడు. తన ప్రత్యర్థులతో పోటీ పడుతూనే ఉంటాడు. పోటీకి నిలవలేనివారు తప్పుకుంటారు. ఈ విధంగా ప్రతీ పెట్టుబడిదారు లాభాపేక్షతో, విపరీతవేగంతో సరుకులు ఉత్పత్తి చేస్తూంటారు. ఈ ఉత్పత్తికొక పద్ధతీ, క్రమమూ ఉండవు. ఈ అడ్డగోలు ఉత్పత్తినిగురించి లెనిన్ యిలావ్రాశారు: "ఉత్పత్తి ఒక్కొక్క పెట్టుబడిదారుచేవిడిగా సాగించబడుతుంది. ఎవడెంత ఉత్పత్తి చేయాలో, ఏమి ఉత్పత్తి చేయాలో, దేనికి బజారులో డిమాండుఉన్నదో ఏపెట్టుబడిదారుకూ తెలియదు. ఉత్పత్తంతా అడ్డగోలుగా జరుగుతూంటుంది. ప్రతివాడి దృష్టీ లాభంమీదనే ఉంటుంది. ప్రతివాడూ రెండోవానిని మించా లనే చూస్తాడు. కాబట్టి, సహజంగా బజారులోఉండే డిమాం డుకూ, వీరు ఉత్పత్తిచేసే సరుకుల మొత్తానికీ లంగరందదు.

ఎక్కడైనా, ఏదేశమైనా కొత్తగా అమ్మకాని కనువైన చోటుగా, పెద్ద మార్కెట్‌గా కనిపించిందంటే, సరుకుల ఉత్పత్తి మరీజోరుగా, బజారు డిమాండుకు సంబంధంలేకుండా జరుగుతుంది."

ఇక డిమాండును పరిశీలిద్దాం. పెట్టుబడియొక్క చలన క్రమం ఎంత త్వరితంగా జరుగుతూంటే, పునరుత్పత్తి యెంత వేగంగా జరుగుతూంటే అంత ఎక్కువగా పెట్టుబడిదారులు కొత్తపెట్టుబడిని పెట్టడం, కొత్త సరుకులను సృష్టించడం జరుగుతుంది. పరిశ్రమలు విస్తరిస్తాయి. ఉత్పత్తి సాధనాలైన యంత్రాలు, వగైరాలకు డిమాండు పెరుగుతుంది. ఉద్యోగా లెక్కువవుతాయి. కాని, యివన్నీ తాత్కాలికం మాత్రమే. I వ డిపార్టుమెంటుకు జెందిన ఉత్పత్తిసాధనాలు వగైరాలు (producers' goods) అమ్ముడు పోవాలంటే, II వ డిపార్టు మెంటువారు కొనాలిగదా. వీరు కొనాలంటే, II వ డిపార్టు మెంటులో ఉత్పత్తిఅయిన వినిమయవస్తువులు అమ్ముడుపోయి సొమ్ము చేసుకోబడాలిగదా. కాబట్టి, చివరకు పరిస్థితిఅంతా వినిమయ సరుకులు (Consumers' goods) అమ్ముడుపోవడంపై ఆధారపడి యుంటుంది. వినిమయసరుకు డిమాండు ప్రజల కొనుగోలు శక్తినిబట్టి ఉంటుంది.

పెట్టుబడిదారీ విధానంలో బాగా అభివృద్ధిచెందిన ఇంగ్లండు, అమెరికాలాంటి దేశాలలో కార్మికులసంఖ్య చాలా ఎక్కువగా ఉంటుంది. ఇలాంటి దేశాలలో వినిమయ సరుకు డిమాండు ప్రధానంగా కార్మికులనుండి, లేక పెట్టుబడి దారులనుండి రావాలి. పెట్టుబడిదారులు చాలా కొద్దిమందే

గాబట్టి, యీ సరుకులకు డిమాండు ప్రధానంగా కార్మికుల జీతాలమీద ఆధారపడి యుంటుంది.

భారతదేశంలాంటి వెనుకబడిన దేశాలలో ఐతే, యీ సరుకులకు డిమాండు కార్మికవర్గంతోపాటు, ప్రధానంగా 100 కి 80 మందిగా ఉండే రైతాంగంయొక్క ఆదాయాలపై ఆధారపడి యుంటుంది.

కాని, పెట్టుబడిదారీ ఉత్పత్తియొక్క లక్ష్యం లాభాలు. తమ లాభాలనిమిత్తం పెట్టుబడిదారులు కార్మికవర్గంయొక్క కూలి తగ్గించాలని, అదనపువిలువ భాగాన్ని ఎక్కువ చేసుకోవాలని ప్రయత్నిస్తుంటారని యిదివరకే చూచాము. పెట్టుబడిదారీ విధానం అభివృద్ధియైనకొలదీ కార్మికుల కూలిభాగం అదనపు విలువభాగంతో పోల్చినపుడు, క్రమంగా తగ్గిపోతూంటుందనికూడా చూచాము. పరిశ్రమలను విస్తరింపచేసే దశలో కార్మికులసంఖ్య ఎక్కువగా ఉండవచ్చు. వారి జీతాలబిల్లు పెరగవచ్చు. వినిమయ వస్తువులకు డిమాండు కాస్త పెరగవచ్చు. కాని, నూతన ఉత్పత్తి ప్రారంభమై, సరుకులు బయటికి వచ్చేసరికి ఉత్పత్తిస్థాయికీ, కార్మికుల కొనుగోలుశక్తికీ లంగరు అందకుండా పోతుంది. వీటిమధ్య అఖాతం మరీ ఎక్కువవుతుంది.

ఇక పరాధీన, వలసదేశాల సంగతిచూస్తే, పెట్టుబడిదారులు సంక్షోభంలోనుండి బయటపడేందుకు కొత్తమార్కెట్లకు వెతుకుతారు. కాని, ప్రపంచంలో ఎక్కడ పెట్టుబడిదారీ విధానం అడుగుపెడితే, అక్కడ యీ వైరుధ్యం పెరుగుతూ, చివరకు ఆయాదేశాల హద్దులుదాటి ప్రపంచ వ్యాపితంగా తయారవుతుంది. పెట్టుబడిదారీ విధానం జొరబడినచోట్లల్లా,

వలస దేశాలలోను, వెనుకబడిన దేశాలలోను లక్షలాది రైతాంగము, వృత్తిదారులు బీదరికానికి గురిచేయబడతారు. ఉదాహరణగా, మనదేశంలో రైతాంగం యెలా క్రమంగా బీదరికానికి గురియై, వారి కొనుగోలుశక్తి క్షీణిస్తూందో వేరే చెప్పనక్కరలేదు.

పెట్టుబడిదారీవిధానం వ్యాప్తిచెందుటతో మొత్తం ప్రపంచ ప్రజల కొనుగోలుశక్తి క్షీణిస్తుంది.

కాబట్టి, ఆర్థికసంక్షోభానికి మూలకారణం పెట్టుబడిదారీ ఉత్పత్తి పద్ధతిలోనే, దోపిడీ పద్ధతిలోనే, అదనపు విలువను గుంజుకునే పద్ధతిలోనే అంతర్భూతమై యున్నది.

ఉత్పత్తియొక్క సామాజిక స్వభావమూ, కొద్దిమంది వ్యక్తులు యీ వుత్పత్తి ఫలితాన్ని కాజేయడమూ రెండిటి మధ్యనున్న వైరుధ్యమే పెట్టుబడిదారీ సంక్షోభాలు అనివార్యంగా రావడానికి మూలకారణం. లాభాపేక్ష ప్రతి పెట్టుబడిదారునూ, ఉత్పత్తిశక్తులనూ విపరీతంగా అభివృద్ధిచేసేటందుకూ, రెండవవైపున కార్మికుల కూలిభాగాన్ని తగ్గించివేసేందుకూ ప్రోత్సహిస్తుంది. లాభాపేక్షయే యీ పరస్పర విరుద్ధవైఖరికి మూలం. "ఒకవైపు మొత్తం సమాజంయొక్క అవసరాలన్నిటిని తీర్చటానికి సరిపడినన్ని సరుకుల నుత్పత్తిచేయ సంకల్పించారాఅన్నంత విస్తృతంగా పెట్టుబడిదారీ ఉత్పత్తిశక్తుల నభివృద్ధిచేసే స్వభావమూ, రెండవవైపున ప్రజల బీదరికం ఎక్కువగావడమూ, కొనుగోలుశక్తి పడిపోవడమూ యిదే అన్ని వాస్తవిక సంక్షోభాలకు చివరికారణం" అని మార్క్సు చెప్పారు.

## క్రమానుగతంగా సంక్షోభాలు వస్తూనేఉంటాయి

పెట్టుబడిదారీ విధానంలో ఉత్పత్తి సామాజికంగా జరగడం, ఫలితం కొద్దిమంది వ్యక్తులచే అపహరించబడ్డం అనే ప్రాథమిక వైరుధ్యం తీవ్రరూపం ధరించి, బద్దలైనపుడు సంక్షోభం వస్తుంది.

పెట్టుబడిదారీ విధానం కాస్త వేళ్లూనుకొన్న దగ్గర నుండీ, ఆర్థికసంక్షోభం దానిని వెన్నంటుతూనే ఉంది. గత 150 సంవత్సరాల చరిత్రలో, ప్రతి 8 లేక 10 సంవత్సరాల కొక సంక్షోభంచొప్పున వస్తూనే ఉన్నాయి. మొదటి సంక్షోభం 1825 లో వచ్చింది. తరువాత 1836, 1847, 1857, 1872, 1890, 1900, 1907, 1921, 1929–'35 ల మధ్య సంక్షోభాలు వచ్చాయి. 1938 లో తిరిగి సంక్షోభం తలయెత్తు తూండగా, రెండవ ప్రపంచయుద్ధ ప్రయత్నాలతో అంత రాయం కలిగింది. ఈ విధంగా, పెట్టుబడిదారీఉత్పత్తి మొదటి నుండీ ప్రదక్షిణంచేస్తూ, ఒక చక్రంలాగా (సైకిల్) నడుస్తూంది.

## పెట్టుబడిదారీ వ్యాపారచక్ర పరిభ్రమణం (Trade cycle)

ఆర్థికమాంద్యం (Slump) సమయంలో ఉత్పత్తి సాధ నాలకు, ముడి పదార్థాలకు ఆర్డర్లు తగ్గిపోతాయి. ఒకవేళ అవుసరమైతే, నిల్వస్టాకులలోనుండి సప్లయి చేయబడతాయి. సరుకుల ఖరీదులు క్రమంగా, అసలు విలువలకన్న (Intrinsic values) చాలా తక్కువగా పడిపోతాయి. ధరలు తగ్గగానే తిరిగి కొనుగోలుదారులనుండి క్రమశః డిమాండు పెరుగు తూంటుంది. తిరిగి సరుకు అమ్ముడుబో నారంభిస్తాయి. దీనితో

పెట్టుబడిదారులు నూతన యంత్రోత్పత్తికి ఎక్కువ కార్మికులను వినియోగించుటకు, ఎక్కువ ముడిపదార్థాలు కొనుటకు ముందుకు వస్తారు. కార్మికులసంఖ్య, ముడిపదార్థాల కొనుగోలు ఎప్పుడైతే పెరిగిందో అప్పుడే బట్టలు, ఆహారపదార్థాలు మొదలైనవాటికి డిమాండు పెరుగుతుంది. ధరలు కొద్దిగా పెరుగుతాయి. పెట్టుబడిదారుల ఆశలు చిగిరిస్తాయి. వినిమయ వస్తువుల ఉత్పత్తి తిరిగి ప్రారంభమవుతుంది. ఈ పరిశ్రమలు పనిచేయడం ఎక్కువకాగానే, తప్పనిసరిగా ఉత్పత్తి సాధనాలకుకూడా డిమాండు పెరుగుతుంది. నూతనయంత్రాలు సృష్టించబడతాయి.

ఎప్పుడైతే, యీ నూతనయంత్రాలు వినిమయవస్తువు గ్రూపుకు చేరతాయో, II వ డిపార్టుమెంటు ఉత్పత్తి పెరగ నారంభిస్తుంది. ఈ దశనే పుంజుకునేదశ(Period of Recovery) అంటారు. II వ డిపార్టుమెంటు బాగా విజృంభించి, ఉత్పత్తి గావించి సరుకులను ముమ్మరంగా మార్కెట్లోకి విడుదలచేసే లోపల 3-4 సంవత్సరాలు పట్టవచ్చు. ఈ మధ్యలో సరుకుల రవాణా, పెట్టుబడి పరిభ్రమణం, అదనపు విలువ ఉత్పత్తి చురుకుగా సాగుతూంటాయి. పెట్టుబడి సమీకరణ పెరుగుతూంటుంది. లాభాల ఆశతో బ్యాంకులలో ఎక్కువ అప్పులు తీసుకోవడం, పరిశ్రమలను విస్తరింపజేయడం, వ్యాపారంలో ఎక్కువ పెట్టుబడి పెట్టడం, సరుకుల ధరలు పెంచివేయడం జరుగుతుంది. దీనినే సుభిక్షకాలమంటారు (Boom).

ఇలా జరుగుతూండగానే, రెండవవైపున ఉత్పత్తి అవుతూన్న నూతన విలువలలో కార్మికుల భాగం తగ్గుతూ,

ఉత్పత్తి పెరుగుదలకు - కొనుగోలు శక్తికి మధ్యగల అంతరం పెరుగుతూంటుంది. చివరకు కొనుగోలుశక్తి బాగా తగ్గిపోయి, సరుకులు నిల్వ ఉండిపోతాయి. సంక్షోభం (crisis) బయలు దేరుతుంది. సంక్షోభ సమయంలో అనేక ఫ్యాక్టరీలు మూత బడతాయి; దివాళా తీస్తాయి. కొన్నింటిలో ఉత్పత్తి తగ్గించి వేయబడుతుంది. నిల్వవున్న సరుకులను పెద్ద మొత్తాలలో నాశనం చేస్తారు. ఈ విధంగా అనేక విలువలు ధ్వంసం చేయ బడతాయి. మళ్ళీ కొన్నాళ్ళు మాంద్యం, పుంజుకోవడం, సుభిక్షం, తిరిగి సంక్షోభం - ఈవిధంగా పెట్టుబడిదారీ వ్యాపార చక్రం నిరంతరం పరిభ్రమిస్తూనే ఉంటుంది. ఈ ప్రక్క బొమ్మ చూడండి.

ఈ పరిభ్రమణ పూర్తియగుటకు సాధారణంగా 10 సంవత్సరాలు పడుతుందని అనుభవం రుజువుచేస్తూంది. దీనికి మరొక కారణంకూడా ఉంది. సంక్షోభ సమయంలో పరి శ్రమలు పూర్తిగా దెబ్బతింటాయి. విస్తరణప్లానులు ఆపు చేయబడి, కొత్తయంత్రాల నమర్చడం మానివేస్తారు. పాత యంత్రాలతోనే కొన్నిరిపేర్లు చేయుటద్వారా, ఉత్పత్తిని కొన సాగిస్తారు. పరిస్థితి తిరిగి బాగుపడగానే, టెక్నిక్ నభివృద్ధి చేయడం, కొత్తయంత్రా లమర్చడం, ఉత్పత్తిని పెంచడం జరుగుతుంది. మూలపరిశ్రమలు కదలి పనిచేయ నారంభిస్తాయి. ఈవిధంగా యంత్రాలు పూర్తిగా అరిగిపోకపోయినా, ఒక పర్యాయం అమర్చిన యంత్రసామగ్రిని 10 సంవత్సరాల కొకసారి మార్చివేయవలసి వస్తుంది. స్థిర పెట్టుబడిభాగం మార్చవలసి వస్తుంది. ఇలా జరిగినవెంటనే, సుభిక్షం - దాని




వెంటనే సంక్షోభం అనివార్యంగా వస్తాయి. కాబట్టి, 10 సంవత్సరాల కొకసారి సంక్షోభంకూడా సర్వసాధారణంగా వస్తూంటుంది.

సంక్షోభాలు ఒకదానికన్న ఒకటి తీవ్రంగా తయారవు తాయి. సంక్షోభానంతరం టెక్నిక్ అభివృద్ధి, కొత్త యంత్రా లమర్చడం జరుగుతుందని చూచాము. దీని ఫలితంగా, ప్రధాన వైరుధ్యం, ఉత్పత్తి పెరుగుదలకు – కొనుగోలు శక్తికిమధ్య

వైరుధ్యంకూడా తీవ్రతర మవుతూంటుంది. అందువలన సంక్షోభాలు రానురాను తీవ్రతరంగా తయారవుతాయి.

## వ్యా పా ర చ క్ర ము - ధ ర లు

వ్యాపార చక్రంతోపాటే, సరుకుల ధరలుకూడా పరిభ్రమిస్తూంటాయి. సంక్షోభ కాలంలో పెట్టుబడిదారుల కోర్కెలకు వ్యతిరేకంగానే ధరలు విపరీతంగా పడిపోతాయి. పుంజుకునే దశలో, తిరిగి నెమ్మదిగా పెరగ నారంభిస్తాయి. సుభిక్షా కాలంలో అసలు విలువనుదాటి బాగా పెరిగిపోతాయి. ఈ దశలో పెట్టుబడిదారులు లాభాపేక్షతో ధరలను విపరీతంగా పెంచుతారు. సహజంగా, టెక్నిక్ అభివృద్ధితో ఉత్పత్తిశక్తి పెరుగుటవలన సరుకుల అసలు విలువతగ్గాలి. కాని, పెట్టుబడిదారులు ధరలను పెంచుటవలన వైరుధ్య మేర్పడుతుంది. త్వరలోనే కొనుగోలుశక్తి పడిపోయి, సరుకు లమ్ముడుబోక సంక్షోభం వస్తుంది. ధరలు మరల విపరీతంగా పడిపోతాయి. ఈ విధంగా పెట్టుబడిదారీ వ్యాపారచక్రంతోపాటే ధరలు తిరుగుతూంటాయి. ఒకసారి అసలు విలువకన్న చాలా ఎక్కువగాను, మరొకసారి అసలు విలువకన్న చాలా తక్కువగాను ఉంటూంటాయి. తత్ఫలితంగా, మార్క్సుయొక్క విలువ సిద్ధాంతం తప్పనిసరిగా ఆచరణలోనికి వస్తూంటుంది.

## లాభంరేటు తగ్గిపోయే ధోరణి

పెట్టుబడిదారులు లాభంకొరకే ఉత్పత్తి గావిస్తారు. ప్రతి పెట్టుబడిదారుడూ తాను కొత్త యంత్రాలను అమర్చి, కార్మికులను తొలగించి ఉత్పత్తి ఖర్చులు తగ్గించాలనీ, తన

సరుకుల నెక్కువ అమ్ముకోవాలనీ, తనవంతు లాభాన్ని పెంచుకోవాలనీ చూస్తాడు. ఇందుకై టెక్నిక్‌ను అభివృద్ధి చేస్తాడు. కొత్త యంత్రాలు అమరుస్తాడు.

ఈ విధంగా, టెక్నిక్‌ను అభివృద్ధిచేసి నూతనయంత్రాలు అమరుస్తున్నాడంటే, తప్పనిసరిగా స్థిర పెట్టుబడిభాగం పెరుగుతుంది. స్థిర పెట్టుబడియొక్క నిష్పత్తి పెరిగేకొలదీ లాభంరేటు తగ్గుతుంది.

ఉదాహరణకు, మొత్తం పెట్టుబడి రూ. 100 కోట్లు అనుకోండి. దోపిడీ నిష్పత్తి 100% అనుకోండి. మూడు దశాబ్దాలలో క్రమంగా స్థిర పెట్టుబడిభాగం పెరిగిందనుకోండి. అపుడు :

| | స్థిర పెట్టుబడి | అస్థిర పెట్టుబడి | అదనపువిలువ | లాభంరేటు |
|---|---|---|---|---|
| 1860 లో | 50 | 50 | 50 | 50% |
| 1870 | 60 | 40 | 40 | 40% |
| 1880 | 70 | 30 | 30 | 30% |

అయితే, యిచట లాభంరేటు పడిపోతున్నా మొత్తం లాభం తగ్గుతుందని భావించగూడదు. మొత్తం పెట్టుబడి పెరుగుతున్నకొలదీ, పరిశ్రమలు విస్తరిస్తున్నకొలదీ, కార్మికులను దోచుకోవడం ఎక్కువవుతున్నకొలదీ మొత్తం లాభం పెరుగుతూంటుంది. కాబట్టి, ఒకవైపున మొత్తంలాభం పెరుగుతూన్నప్పటికీ, రెండవవైపున లాభంరేటు క్రమంగా తగ్గడంవైపే మొగ్గు చూపుతూంటుంది.

ఉదాహరణకు, 50 కోట్ల రూపాయల పెట్టుబడి ఒక దశాబ్దంలో 80 కోట్లకు పెరిగిందనుకోండి. లాభంరేటు యిదే

కాలంలో 12% నుండి 10% కు తగ్గిపోయిం దనుకోండి. అయి నప్పటికీ, మొత్తం లాభంమాత్రము మొదట 6 కోట్ల రూపా యలే వస్తే, రెండవసారి 8 కోట్ల రూపాయలు వస్తుంది.

పైన వివరించినట్లు కొత్త టెక్నిక్ ప్రవేశపెట్టగానే క్రమంగా లాభపురేటు పడిపోనారంభిస్తుంది. దీనినుండి తప్పు కుని ప్రతి వ్యక్తిగత పెట్టుబడిదారూ తానెక్కువ లాభంరేటు సంపాదించాలని ప్రయత్నిస్తాడు. టెక్నిక్‌ను మరికొంత అభి వృద్ధి చేస్తాడు. ఈవిధంగా టెక్నిక్ అభివృద్ధి అవుతూన్నకొలదీ, పెట్టుబడిదారీ విధాన మంతటిలోనూ లాభంరేటు మరింత ఖచ్చి తంగా పడిపోయేందుకు దారితీస్తుంది. పెట్టుబడిదారీ విధానంలో యిదొక సూత్రంగా ఉంటుంది.

## లాభంరేటు పడిపోకుండా నిరోధించే శక్తులు

ఒకవైపు లాభంరేటు పడిపోయే లక్షణం ప్రదర్శిత మవుతున్నా, రెండవవైపు యిది పడిపోకుండా ప్రతిఘటించే అంశాలుకూడా పనిచేస్తుంటాయి. అలా జరుగకపోయినట్ల యితే, యింత బ్రహ్మాండమైన సాంకేతికాభివృద్ధి జరుగుతూ న్నపుడు యీపాటికి లాభంరేటు బాగాపడిపోయి ఉండేదే. అందువలననే, మార్క్సు దీననొక వైఖరిగా మాత్రమే చెప్పారు. లాభంరేటు పడిపోకుండా యీ క్రింది అంశాలు పనిచేస్తాయి.

i) టెక్నిక్ అభివృద్ధి అవుతున్నప్పటికీ, దానితోపాటే పెట్టుబడిదారీ విధానంలో కార్మికుల ఉత్పత్తిశక్తి, శ్రమ

తీవ్రత పెరుగుతూనే ఉంటాయి. దీనివలన తారతమ్యపు అదనపు విలువ పెరుగుతుంది.

ii) మాటిమాటికీ పెట్టుబడిదారులు లాభం రేటును కాపాడుకొనేందుకు, సాధ్యమైనంతవరకు కార్మికుల కూలిని తగ్గించేందుకు ప్రయత్నిస్తూనే ఉంటారు.

iii) కార్మికుల ఉత్పత్తిశక్తి పెరిగేకొలదీ, స్థిర పెట్టుబడి భాగాలలో యిమిడియుండే శ్రమకాలం తగ్గుటద్వారా అవి చౌకవుతాయి. ఆ విధంగా, స్థిర పెట్టుబడి కొంత తగ్గుతుంది.

iv) తారతమ్యపు అదనపు జనాభా (నిరుద్యోగ సైన్యం) ఉండుటవలన ఒక్కొక్కపుడు యంత్రాభివృద్ధి లేకుండానే చౌకగా శ్రమశక్తిని కొని, ఎక్కువలాభాలు దోచుకుంటారు.

v) బాగా అభివృద్ధిచెందిన పెట్టుబడిదారీ దేశాలలోని పెట్టుబడిదారులు వలస, అధీన, వెనుకబడిన దేశాలలో శ్రమశక్తిని చౌకగాకొని అధికలాభాలు సంపాదిస్తారు. అలాగే, విదేశీవ్యాపారంద్వారాకూడా లాభాలు సంపాదిస్తారు.

పైన వివరించిన పద్ధతులద్వారా పెట్టుబడిదారులు లాభం రేటు పడిపోకుండా నిలబెట్టుకొనుటకు కృషి చేస్తారు. అయితే, పైన చెప్పిన పద్ధతులన్నీ తిరిగి పెట్టుబడిదారీ విధానంలోని వైరుధ్యాలను, ముఖ్యంగా ఉత్పత్తికి, వినిమయానికి మధ్య అఖాతాన్ని ఎక్కువచేసి సంక్షోభానికి దారితీస్తాయి. సంక్షోభం వచ్చినపుడు సరుకులు అమ్ముడుపోకుండా నిలచిపోవడం వలన గానీయండి, లేక అసలు విలువకన్న చాలా తక్కువకు

అమ్ముడుపోవడంవలన గానీయండి లాభాలు బాగా తగ్గిపో తాయి. ఈ విధంగా, "లాభం రేటు పడిపోకుండా ప్రతిఘటించే శక్తులు ప్రతిఘటింప బడతాయి." (మార్క్సు)

## లాభంరేటు పడిపోయే ధోరణి - పెట్టుబడిదారీ విధానపు చలనసూత్రము

## (Law of Motion of capitalist society)

పెట్టుబడియొక్క అంగ నిర్మాణం పెరుగుతున్న కొలదీ, లాభం రేటు పడిపోయే ధోరణి ఎక్కువవుతుంది. లాభం రేటును నిలబెట్టుకునేందుకు పెట్టుబడిదారు లవలంభించే పద్ధతులవలన వైరుధ్యాలు తీవ్రతరమై, మరింత తీవ్రమైన సంక్షోభాలు వస్తుంటాయి.

పరిస్థితులు అనుకూలంగా ఉన్నప్పుడు ప్రతి పెట్టుబడి దారూ నూతనయంత్రాలు నెలకొల్పి, పెద్దయెత్తున ఉత్పత్తి గావించి ఎక్కువలాభాలు సంపాదించాలని చూస్తాడు. ఆ విధంగా టెక్నిక్ అభివృద్ధికి, పెట్టుబడి అంగనిర్మాణం పెరుగుటకు పునాది ఏర్పడుతుంది. ఇంతలో సంక్షోభంవచ్చి ప్లానులన్నీ తల్లక్రింతు లవుతాయి. కాని, సంక్షోభ కాలంలో పెద్దపెద్ద పెట్టు బడిదారులు, బాగా టెక్నిక్‌ను అభివృద్ధి చేసినవారు తట్టుకో టాని కెక్కువ అవకాశ ముంటుంది. చిన్నచిన్న వారందరు చితికి పోతారు. పెద్ద పెట్టుబడిదారులు వీరి పరిశ్రమలను చౌకగా కొనివేస్తారు. ఈవిధంగా పెట్టుబడి కేంద్రీకరణ జరుగుతుంది. అంతేగాదు; మాంద్యకాలంలో ధరలు చాలా తక్కువగా ఉంటాయి. అందువల్ల పెట్టుబడిదారులు తమ లాభాల నెక్కువ

చేసుకునేందుకు ఉత్పత్తిఖర్చులను తగ్గించజూస్తారు. అందుకుగాను కూలిని తగ్గించేందుకు, ఉత్పత్తిశక్తిని పెంపొందించేందుకు ప్రయత్నిస్తారు. అంటే, తిరిగి నూతనయంత్రాలు ప్రవేశపెడతారు. ఈవిధంగా పెట్టుబడి అంగనిర్మాణం మరల పెరుగుతుంది. పైన వివరించినట్లు ప్రతిదఫా, సంక్షోభం వచ్చి పోయినపుడల్లా, పెట్టుబడి కేంద్రీకరణ, సమీకరణ జరుగుతూనే ఉంటాయి. తత్ఫలితంగా, పెట్టుబడిదారీ విధానంలోని ప్రధాన వైరుధ్యం–పరిశ్రమల ఉత్పత్తిశక్తికి, ప్రజల కొనుగోలుశక్తికి మధ్య వైరుధ్యం – ఉత్పత్తి యొక్క సామాజిక స్వభావానికి, ఫలితం వ్యక్తిగతంగా అనుభవించడానికిమధ్య వైరుధ్యం తీవ్రతరమవుతూనే వుంటుంది.

లాభం రేటు పడిపోయేధోరణి ఎంత ముఖ్యమైనదో యిప్పుడు స్పష్టంగా అర్థమయ్యే ఉంటుంది. పెట్టుబడిదారీ విధానపు అభివృద్ధిక్రమాన్నే యీ సూత్రం నిర్ణయిస్తుంది. లాభం రేటు పడిపోయేధోరణే ప్రతి వ్యక్తిగత పెట్టుబడిదారునూ, తన లాభాలను పెంచుకునేందుకు తాపత్రయపడేట్లు చేస్తుంది. ఈ తాపత్రయం ఫలితంగా, మొత్తం పెట్టుబడిదారుల లాభం రేటు పడిపోయేందుకు దారితీస్తుంది. తత్ఫలితంగా, మరల లాభాలు పెంచుకొనుటకు కృషి, వైరుధ్యాలు తీవ్రతరంగావడం, మరల లాభం రేటు పడిపోయే ధోరణి, వైరుధ్యాలు మరింత తీవ్రంగావడం జరుగుతూనే ఉంటుంది. "ఒకవైపున పెట్టుబడిదారీఉత్పత్తి ముందుకు నడుస్తూంటే, రెండవవైపున అదృశ్యమైన అవరోధాలు తిరిగి తిరిగి ఎదు

ర్కొంటూనే ఉంటాయి." "పెట్టుబడియే పెట్టుబడిదారీ వుత్పత్తికి నిజమైన సంకెలగా తయారవుతుంది." (మార్క్స్.)

పెట్టుబడిదారీ విధానపు వైరుధ్యాలెందుకు తీవ్రతర మవుతాయో, సంక్షోభాలు ఒకదానికన్న ఒకటి తీవ్రతరంగా యెందుకుంటాయో, చివరకు పెట్టుబడిదారీ విధానం శాశ్వత సంక్షోభంలో యెందుకు పడుతుందో, శాశ్వత నిరుద్యోగం ఎందుకు యేర్పడుతుందో, యుద్ధాలు, విప్లవాలు యెందుకు వస్తాయో పై సూత్రం చూపించగలుగుతుంది.

### సంక్షోభాన్నిగూర్చి పెట్టుబడిదారీ సిద్ధాంతాలు

పెట్టుబడిదారీ విధానంలో ఆర్థిక సంక్షోభాలు అనివార్యంగా రావడానికి మూలకారణ మేమిటో పైన చూచాము.

మొట్టమొదట పెట్టుబడిదారీ అర్థశాస్త్రజ్ఞులు సంక్షోభాలు వస్తాయని అంగీకరించే వారేకాదు. స్వేచ్ఛా పోటీ విధానంవలన ఆర్థికవిధానం దానంతటది సక్రమంగా నడుస్తుందని (Self-regulating system), సప్లై డిమాండులు వాటంతటవే సర్దుకుంటాయని వాదించేవారు. రికార్డో యిలావ్రాశాడు: "ప్రతివ్యక్తీ తాను స్వయంగా అనుభవించేందుకు, లేదా యితరులకమ్మి తన కవసరమైన మరో సరుకు సంపాదించేందుకు, లేదా భవిష్యదుత్పత్తికి తోడ్పడేందుకు మాత్రమే సరుకు సృష్టిస్తున్నాడు అందువలన, ఉత్పత్తిచేసే ప్రతివ్యక్తీ తన సరుకులను తానైనా అనుభవిస్తాడు; లేదా యితరులు ఉత్పత్తిచేసిన సరుకులను కొని అనుభవిస్తాడు. కాబట్టి, ఉత్పత్తి యిన ప్రతి సరుకూ మరొక సరుకుతో మారకం వేయబడి తీరుతుంది. ధనం వీటిమధ్య ఒక మారకపుసాధనం మాత్రమే."

అలాగే, జె. బి. సే అనే అర్థశాస్త్రజ్ఞుడు తన "మార్కెట్ల సూత్రం"లో యిలా వాదించాడు: "ప్రతి అమ్మకం తర్వాత దానితో సరితూగు సరుకులు కొనడం జరుగుతుంది. ఆ విధంగా మొత్తం డిమాండు, మొత్తం సప్లైకి సరిపోతుంది. వివిధ వర్గాలకు వచ్చే ఆదాయాలు మొత్తం ఉత్పత్తిఅయిన విలువలకు సరిసమానంగా ఉంటాయి." ఈ అర్థశాస్త్రజ్ఞుడు కూలికీ, సరుకు ధరకూ, సరుకు విలువకూ, లాభానికీమధ్య సంబంధం లేదని, సరుకుల ధరలు మార్కెట్ దయాధర్మాలపై ఆధార పడతాయనే విషయాన్ని గుర్తించలేదు.

మరికొందరు అర్థశాస్త్రజ్ఞులు (ప్రొఫెసర్ హిల్స్ వగైరా) సంక్షోభాలు వస్తాయని అంగీకరిస్తూనే, అవి వరదలు, భూకంపాలలాగా దురదృష్టవశాత్తు సంభవించే ఆకస్మిక ఘటనలుగా చిత్రించారు.

కాని, 1929-'35 సంక్షోభం తరువాత బూర్జువా అర్థశాస్త్రవేత్తలు ఆర్థిక సంక్షోభాలు యాదృచ్ఛికాలు కావని, ఆర్థికవిధానంలోని కొన్ని లోపాలవలననే వస్తున్నాయనీ అంగీకరిస్తూ, రకరకాల సిద్ధాంతాలల్లారు. 1930 లో స్టాలిన్ యీ సిద్ధాంతాలనుగురించి యిలా చెప్పారు: "సంక్షోభాన్ని గూర్చి రకరకాలైన సిద్ధాంతాలు కనిపెట్టబడుతున్నాయి. సంక్షోభ 'తీవ్రతను తగ్గించేందుకు', లేక సంక్షోభాన్ని 'నివారించేందుకు', లేక 'తుదముట్టించేందుకు' విస్తృతమైన పథకాలు తయారుచేయ బడుతున్నాయి. బూర్జువా ప్రభుత్వాలు సంక్షోభాన్ని నివారించేందుకు అవసరమైన చర్యల నన్నిటినీ తీసుకోలేక పోయాయని బూర్జువా ప్రతిపక్షాలు విమర్శిస్తూ

న్నాయి (అమెరికాలో). రిపబ్లికన్‌లను డెమోక్రట్లు, డెమోక్ర ట్లను రిపబ్లికన్లు, వీరిద్దరూ కలసి ఫెడరల్ రిజర్వ్ విధానాన్ని గురించి ప్రచారంచేసే హూవర్ ముఠాను, సంక్షోభాన్ని అదుపులో పెట్టలేనందుకు దుయ్యబడుతున్నారు. ప్రపంచ ఆర్థిక సంక్షోభానికి మూలకారణం 'బోల్షివిక్ కుట్రలే'నని చెప్పే బుద్ధిమంతులుకూడా లేకపోలేదు... నిజానికీ సిద్ధాంతా లన్నీ అశాస్త్రీయమైనవే. సంక్షోభం విషయంలో బూర్జువా అర్థశాస్త్రజ్ఞులు తమ పూర్తి దివాళాకోరుతనాన్ని ప్రదర్శిస్తు న్నారని అంగీకరించక తప్పదు." ('లెనినిజం'నుండి)

(i) ధనప్రాప్తి సిద్ధాంతాలు (Monetary Theories of Crisis) (హాట్రే, ఇర్వింగ్ ఫిషర్ వగైరాలు) సుభిక్షా కాలంలో బ్యాంకులలో డిపాజిట్లు పెరుగుతాయి. అరువు విరివిగా లభిస్తుంది. తత్ఫలితంగా, డిమాండుకు సంబంధం లేకుండా, ఉత్పత్తిని పెంచడం జరుగుతుంది. అదే సంక్షోభానికి కారణమని వీరి వాదన. సుభిక్షాకాలంలో లభ్యమయ్యే ధనాన్ని గనుక, పరిమితుల్లో ఉంచినట్లయితే, సుభిక్షనుకూడా పరిమితులలో పెట్టవచ్చుననీ, తద్వారా సంక్షోభాన్ని నివా రించవచ్చునీ వీరి సూచన.

(ii) అధిక పెట్టుబడి సిద్ధాంతం (Theory of over-nvestment) (ప్రొఫెసర్ హైక్, రాబిన్స్ వగైరాలు) సుభిక్షాకాలంలో కార్మికులు, తదితర వర్గాలచేతులలో డబ్బు ఎక్కువ మెదలుతూంటుందని; బ్యాంకులలో డిపాజిట్లు, ఎక్కువై వడ్డీ రేట్లు తక్కువగా ఉంటాయని, అందువలన పెట్టుబడిదారులు బ్యాంకులలో చౌకవడ్డీ రేట్లకు అప్పులు తీసుకొని, పరిశ్రమలను

విస్తరింపజేసి, ఉత్పత్తిని విపరీతంగా పెంచివేస్తారని, యీ విస్తరణకు తగినవిధంగా, దాని కవసరమైన పెట్టుబడికి తగినట్లుగా వినిమయం (Consumption) తగ్గలేదని, పొదుపు జరగడం లేదని, తత్ఫలితంగా యీ విస్తరణ పథకాలు అమలు జరుగక ముందే సరుకులు నిల్వ ఉండిపోయి, సంక్షోభం బయలుదేరు తుందని వీరివాదన. కాబట్టి, పెట్టుబడిదారులకు లభ్యమయ్యే ధనం తక్కువగాఉంటే, అధికోత్పత్తి జరగదని, కూలీలకూలి తగ్గించి, మిగిలిన దానిని పెట్టుబడి విస్తరణకు వినియోగించాలని వీరి సూచన. మొత్తంమీద యిటు కూలి తగ్గించి, అటు బ్యాంకు రేటు పెంచితే సంక్షోభంరాదని వీరి వాదన. పెట్టుబడిదారులకు ఎంత గొప్ప వరప్రసాదం !

(iii) మనస్తత్వ సిద్ధాంతం (Psychological Theory of crisis): సుభిక్షకాలంలో పెట్టుబడిదారులు అధికలాభాల ఆశతో ఉత్పత్తి ఎక్కువచేసి, ధరలను పెంచేసి సరుకు అమ్ముతారు. భవిష్యత్ లో ఎక్కువ డిమాండు ఉంటుందని అంచనా వేస్తారు. కాని, త్వరలోనే డిమాండుకుమించి సరుకులు ఉత్పత్తి కావడం, కొనుగోలుశక్తినిమించి ధరలు పెరగడం వలన సరుకు లమ్ముడుపోకుండా నిలచిపోతాయి. వెంటనే నిరాశాపరులైన పెట్టుబడిదారులు ఫ్యాక్టరీలను మూసివేయడం, డిమాండుకన్నకూడ ఉత్పత్తిస్థాయిని తగ్గించివేయడం జరుగుతుంది. కాబట్టి, పెట్టుబడిదారుల ఉత్సాహ, నిరుత్సాహాలనుబట్టి, ఆశా నిరాశలనుబట్టి అమితోత్పత్తి, మాంద్యాలేర్పడతాయని వీరి వాదన.

(iv) వినిమయక్షీణతా సిద్ధాంతం (Theory of under-consumption) జె.ఎ. హాబ్సన్-కొంతవరకు కీన్స్.

ప్రజల కొనుగోలుశక్తి తగ్గిపోవుట వలననే, సరుకులమ్ముడుబోక సంక్షోభం వస్తుందని వీరంగీకరిస్తారు. అందువలన, కార్మికులకూలిని తగ్గించగూడదనియు, ప్రజల సౌకర్యాలనిమిత్తం ప్రభుత్వం సాంఘిక వ్యయాన్ని (Public Spending) ఎక్కువ చేయుటద్వారాను, వడ్డీరేట్లు తగ్గించుటద్వారాను సంక్షోభాన్నరికట్టవచ్చని వీరి సూచనలు. అయితే, డబ్బురూపంలో కూలి రేట్లు పెరిగినా, సంక్షోభం వస్తూనేయుండడం చూస్తున్నాము. కూలిభాగానికి, అదనపు విలువభాగానికి మధ్యనుండే అంతరం రెండవవైపున పెరుగుతూన్నంతకాలం సంక్షోభాలు తప్పవు.

(v) ఉత్పత్తి ఖర్చుల పెరుగుదల సిద్ధాంతం (డబ్ల్యు. జి. మిచ్చెల్) సుభిక్షాకాలంలో కూలి పెరుగుటవలన ఉత్పత్తి ఖర్చులు పెరిగి, లాభాలు తగ్గిపోవడంమూలంగా సంక్షోభం వస్తుందని ఈయన వాదన.

(vi) సూర్యుని మచ్చల సిద్ధాంతం (Sun spot Theory) (జెవాన్స్) సూర్యునిలో పదిపండ్లకొకసారి క్రమానుగతంగా మచ్చలు పెరుగుతూ, తగ్గుతూంటాయి. ఈ మచ్చల కారణంగా సూర్యుని కిరణప్రసారంలో మార్పులువచ్చి, వాతావరణం మారుతూంటుంది. వాతావరణం మార్పువల్ల వ్యవసాయం దెబ్బతింటుంది. దానితో రైతుల ఆదాయం మారుతూంటుంది. వారి కొనుగోలుశక్తికూడ మారుతూంటుంది. సంక్షోభానికి కారణ మిదేనని యీాయన సిద్ధాంతం.

(vii) అష్టవర్ష పరిభ్రమణ సిద్ధాంతం (The venus Theory) 8 ఏండ్లకొకసారి శుక్ర గ్రహం భూమికి, సూర్యునికి మధ్యగా వచ్చుటవలన సూర్యరశ్మి సోకక, పంటలు దెబ్బ తింటాయి. అందువల్ల, రైతుల కొనుగోలుశక్తి పడిపోయి, సంక్షోభం వస్తుందని వీరి సిద్ధాంతం.

పైన వివరించిన బూర్జువా ఆర్థికవేత్తల సిద్ధాంతాలు ఒకదాని కొకటి పరస్పర విరుద్ధంగా ఉన్నప్పటికీ, ఒక విషయంలోమాత్రం అందరూ ఒకటే. పెట్టుబడిదారీ విధానంలో సంక్షోభాలు యాదృచ్ఛికంగానే వస్తాయని అంటారు. ఇందులో ఏ ఒక్క సిద్ధాంతమూకూడ సంక్షోభానికిగల మూల కారణాన్ని వివరించలేక పోతూంది. నివారణోపాయాన్నిగూడ సూచించలేక పోతూంది.

ఉదాహరణకు, అధిక పెట్టుబడి సిద్ధాంతకర్తలు పెట్టుబడికీ, మిగుల్చుకోగల దానికీ మధ్య (Balance between investment and real savings) నిష్పత్తి సక్రమంగా ఉండేందుకుగాను, వడ్డీరేట్లు ఎక్కువగా ఉండాలని, కూలి తక్కువగా ఉండాలని సూచిస్తున్నారు. వీరు ఒక వైపున ఉత్పత్తిశక్తిని త్వరితంగా పెంగనీయరాదని చెబుతూనే, రెండవవైపున ప్రజల కొనుగోలుశక్తిని తగ్గించాలని సూచిస్తున్నారు. మొత్తంమీద లాభం తగినంత ఉండాలనే వీరి వాదన. ఆచరణలో పెట్టుబడిదారీ విధానపు ప్రధాన వైరుధ్యం యథాతథంగానే ఉంటుంది.

అలాగే, వినిమయ క్షీణతా సిద్ధాంతకర్తలు కూలి తగ్గించగూడ దంటారు. వడ్డీరేట్లు తక్కువగా వుండాలని, ప్రభుత్వ

సాంఘికవ్యయం ఎక్కువగా వుండాలని అంటారు. అయితే, మాంద్యం ప్రారంభమయ్యేముందు కూలిపెరిగినా, మాంద్యం రావడం చూస్తున్నాము. దీనికి కారణం ఒకవైపు కూలి పెరిగినా, రెండవవైపున తారతమ్యంగా అంతకన్న ఎక్కువగా వుత్పత్తిశక్తి, లాభాలు పెరుగుతూంటాయి. వైరుధ్యం యథాతథంగానే వుంటుంది. మొత్తంమీద యీ రెండు తరగతుల సిద్ధాంతకర్తలూకూడ పెట్టుబడిదారీ వుత్పత్తి విధానంలోనే అంతర్భూతమైయున్న ప్రాథమిక వైరుధ్యాన్ని గమనించ లేకపోతున్నారు.

సంక్షోభానికి గల మూలకారణాన్ని స్టాలిన్ యీక్రింది విధంగా వివరించారు: "సామాజికంగా ఉత్పత్తి జరుగుటకూ, ఉత్పత్తి ఫలితాన్ని వ్యక్తిగత పెట్టుబడిదారులు స్వాహాజేయుటకూ మధ్యగల వైరుధ్యమే సంక్షోభానికి పునాది. ఈ వైరుధ్యం ఫలితంగానే, ఒకవైపున పెట్టుబడిదారులకు సాధ్యమైనంత అధిక లాభం సంపాదించి పెట్టేందుకు ఉత్పత్తిశక్తులు బ్రహ్మాండంగా అభివృద్ధి చెందుతూంటే, రెండవవైపున లక్షలాది కష్టజీవుల జీవితస్థాయిని వీలైనంత తక్కువ పరిమితులలో ఉంచేందుకు నిరంతరం ప్రయత్నిస్తూ, తారతమ్యంగా వారి కొనుగోలుశక్తి తగ్గించబడుతూంది. పోటీలో తట్టుకుని, ఎక్కువలాభాలు సంపాదించే నిమిత్తం పెట్టుబడిదారులు టెక్నిక్‌ను అభివృద్ధిచేయుటకు, రేషనలైజేషన్‌ను అమలుజరుపుటకు, కార్మికులదోపిడీని హెచ్చుచేయుటకు, వుత్పత్తిశక్తిని విపరీతంగా పెంచుటకు పూనుకుంటారు... కాని, అదేసమయంలో దేశీయ, విదేశీయ మార్కెట్లు, ప్రాథమిక కొనుగోలుదారులుగావుండే లక్షలాది

కార్మికులు, రైతులయొక్క కొనుగోలుశక్తి క్షీణిస్తాయి. అందువలననే, అమితోత్పత్తి సంక్షోభం వస్తుంది". (లెనినిజం నుండి)

"గత కొలది దశాబ్దాలలో పరిశ్రమల, వ్యాపారాల యొక్క చరిత్రఏమిటి ? పెట్టుబడిదారీ సమాజంయొక్క అస్థిత్వానికీ, దాని పరిపాలనకూ కారణమైన ఉత్పత్తి సంబంధాలు, ఆస్తి సంబంధాలతోటి యీనాటి ఉత్పత్తి శక్తుల తిరుగుబాటు చరిత్రయే. ఈ సత్యాన్ని వేరే తెలుపనక్కర లేదు. ప్రతిదఫా, అతిశయిస్తున్న భీకరత్వంతో ప్రత్యక్షమవుతూవున్న ఆర్థిక సంక్షోభాల నుదహరిస్తే చాలు. ఈ సంక్షోభ కాలంలో నే డుత్పత్తి గావించినవేగాక, యింతకుపూర్వ ముత్పత్తి చేసిన సంపదలుకూడ విశేషంగా నాశనం చేయబడతాయి" (కమ్యూనిస్టు మానిఫెస్టోనుండి). సంక్షోభ కాలంలో సంపదలు నాశనం గావడమేగాదు; పెట్టుబడిదారీ విధానంలోని వైరుధ్యాలన్నీ నగ్నంగా బయటపడతాయి. కార్మికులకు సంబంధించినంతవరకు ఆర్థిక సంక్షోభం ఎక్కువయ్యేకొలదీ అధికధరలు, నోట్లముమ్మరం, డివాల్యుయేషన్, కూలి స్తంభన (Freezing of wages), రేషనలైజేషన్, రిట్రెంచ్ మెంటు వగైరాలవల్ల దరిద్రం పెరుగుతుంది. నిరుద్యోగం సర్వవ్యాప్తమవుతుంది. మధ్యతరగతి ప్రజలు, చిన్న వ్యాపారస్థులు, ఉద్యోగస్థులు వగైరాలు దివాళాలకు, నిస్పృహకు గురియాతారు. వలసదేశ ప్రజలు, రైతాంగము, కార్మికులు సామ్రాజ్యవాదుల అధిక దోపిడీకి, తత్ఫలితంగా కరువుకాటకాలకు గురియాతారు.

సంక్షోభం పెట్టుబడిదారీ వర్గానికి చావు బాజాగా కూడ పరిణమిస్తుంది. ప్రతి సంక్షోభానంతరం పెట్టుబడిదారులు కార్మికులపైన, ప్రజలపైన దాడిని ఉధృతం చేస్తూంటారు. కొలదిమంది బడా పెట్టుబడిదారుల ప్రయోజనాలను రక్షించేందుకు ప్రభుత్వ యంత్రాన్ని క్రూరంగా వినియోగిస్తారు. తత్ఫలితంగా, ప్రతి సంక్షోభమూ పెట్టుబడిదారీ విధానంలో కొన్ని మార్పులు తెచ్చినా, రెండవవైపు పెట్టుబడిదారీ వర్గాన్ని మృత్యుసన్నిధి కీడ్చుకుపోతూంటుంది. పెట్టుబడిదారీ విధానంక్రింద నలిగిపోయే కార్మికవర్గమూ, వలసదేశాల ప్రజలూ పెట్టుబడిదారీ విధానాన్ని నాశనం చేయనిదే తమకు ముక్తిలేదని గ్రహిస్తారు. కృతనిశ్చయంతో పెట్టుబడిదారీ విధానానికి శాశ్వతంగా గోరీ కట్టేందుకు జరుపవలసిన అంతిమ పోరాటానికి ఆయత్తమవుతారు.

పెట్టుబడిదారీ పునరుత్పత్తిని గూర్చి వెల్లడిచేసిన మార్క్సిస్టు - లెనినిస్టు సిద్ధాంతం బూర్జువా అర్థశాస్త్రవేత్తల తప్పుడు సిద్ధాంతాలను చిత్తుచేసింది. పెట్టుబడిదారీ అర్థశాస్త్రజ్ఞులూ, వారి అనుయాయులూ యీ విధానం ఏ సంక్షోభమూ, ఏ దుస్థితీ లేకుండా రాజమార్గాన నడుస్తూ ఉంటుందని చెబుతారు. ఇది పూర్తిగా అబద్ధమని మార్క్సిజం రుజువుపరిచింది.

అలాగే పెట్టుబడిదారీ పునరుత్పత్తిలో అనేక పరస్పర వైరుధ్యాలున్నాయి. గాబట్టి, యీ వ్యవస్థ అభివృద్ధి కాలేదని సిద్ధాంతా లల్లారు. పెట్టుబడిదారీ విధానపు బాల్యదశనుచూచి

"యిది అసాధ్యం, యిది వృద్ధికాదు" అన్నారీపెద్దలు. కాని, యివికూడా తప్పని మార్క్సిజం రుజువుచేసింది.

మొదట పెట్టుబడిదారీ వ్యవస్థ అభివృద్ధికావడ మసాధ్యమని వాదించిన బుద్ధిమంతుల వారసులే తిరిగి పెట్టుబడిదారీ విధానం అంతర్గత వైరుధ్యాల ఘర్షణవల్ల ఎలాగూ నశిస్తుంది గాబట్టి, దానికోరకై శ్రామికవర్గం పోరాడవలసిన పని లేదనే విద్రోహ సిద్ధాంతాన్ని ప్రచారం చేశారు. అలాగే, మరికొందరు, (వీరిలో రోజాలగ్జెంబర్గ్ కూడా వున్నది) సరుకుల సామాన్య ఉత్పత్తిక్రమాన్ని నాశనం చేసేవరకే పెట్టుబడిదారీ పునరుత్పత్తిక్రమం సాగుతుంది. అటుపిమ్మట యీ పునరుత్పత్తి వలన జనించే పరస్పర వైరుధ్యాల ఘర్షణ ఫలితంగా, పెట్టుబడిదారీ విధానం దానంతటదే నాశనమవుతుంది. కాబట్టి, పెట్టుబడిదారీ విధానాన్ని కూలద్రోయుటకు మనమేమీ పోరాడనక్కరలేదు—అన్నారు. ఈవాదనలుమార్క్సిస్టు లెనినిస్టు విప్లవసిద్ధాంతాలకు పూర్తిగా విరుద్ధమైనవి. పెట్టుబడిదారీ విధానం స్వచ్ఛందంగా, దానంతటదిగా మరణించడం యెన్నడూ సంభవించదు. శ్రామికవర్గంయొక్క అఖండ త్యాగాల ఫలితంగానే, విప్లవపోరాటాల ద్వారానే పెట్టుబడిదారీ విధానంతోబాటే వెట్టి, దాస్యం నశించ గలవు.



